# ప్రతాపరుద్రీయనాటకము

(సటిప్పణము)

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి కృతము

తొమ్మిదవ ముద్రణము

వేదము వేంకటరాయశాస్త్రి అండ్ బ్రదర్స్
4, మల్లికేశ్వరగుడిసందు, మన్నడి,
జి. టి. మదరాసు.
1954



రు. 2-8-0

ప్రతాపరుద్రీయమను నీ నాటకము

మదీయగ్రంథములందు సమాదరమువహించి నన్ను పలుమాఱు సత్కరించి

విద్వత్పరికాంక్షకులకు సుకవిమిత్రులకు

శ్రీమద్వేంకటగిరి సింహాసనాధీశ్వరులకు

మహారాజా సర్ వెలుగోటి

శ్రీ రాజగోపాలకృష్ణ యాచేంద్ర

బహద్దర్ కె. సి. ఐ. ఇ.

పంచహజారి మన్సబ్దార్ వారికి

మదీయకృతజ్ఞతాసూచకముగా అంకితము గావింపఁబడినట్టిది.

వేదము వేంకటరాయశాస్త్రి.

---

# ఉపోద్ఘాతము

## శ్రీ శాస్త్రిగారి జీవితచరిత్రము *

ఆంధ్రవాఙ్మయమునకు నూతన వికాసము కలిగిన పందొమ్మిదవ శతాబ్ద్యుత్తరార్ధమున తమ రచనలచే దేశమునంతయు ఒక ఊపు ఊపి వాఙ్మయమున కాదర్శప్రాయములగు నూతన మార్గములఁ జూపినవారిలో శ్రీశాస్త్రిగారు ప్రథములు.

వేదమువారు పుదూరుద్రావిడబ్రాహ్మణులు. వీరి స్వగ్రామము నెల్లూరుజిల్లా కావలితాలూకాలో ఇసుకపల్లెకు సమీపమున సముద్రతీరము మల్లయపాళెము. వీరందఱు యజ్ఞయాగాదులొనర్చి సోమయాజులుగా జగత్ప్రసిద్ధులై యుండిరి. ఇప్పటికిని అల్లూరులో వేదమువారు సోమయాజులు కలరు. శాస్త్రిగారి తాతగారు వేంకటరాయశాస్త్రిగారు. తండ్రిగారు వేంకటరమణశాస్త్రిగారు, 'వైయాకరణపతంజలి' బిరుదాంకితులు, కంచిలో గురుకులవాసముచేసి సకల శాస్త్రములను చదివి 1847 లో మదరాసునకు వచ్చిరి. అప్పుడు ముత్యాలపేట బేరిసెట్లు సంస్కృతాంధ్రద్రవిడ పాఠశాల నొకదానిని ప్రారంభించిరి. దానికి వీరు మూఁడు భాషలలో పండితులు గావున ప్రధానోపాధ్యాయులైరి. అప్పుడు శ్రీబహుజనపల్లి సీతారామాచా

* వివరములు శ్రీశాస్త్రిగారి జీవితచరిత్రసంగ్రహము అను గ్రంథమున చూడవచ్చును.

ర్యులవారు (శబ్దరత్నాకరనిఘంటుకర్తలు) ఆంధ్రపండితులు. -
పాఠశాలయే అభివృద్ధియై నేటి ముత్యాలపేట హైస్కూ
లుగా తంబుసెట్టివీధిలో నున్నది. ఇచ్చట వీరుద్యోగము చేయుః
సమీపమున రామస్వామివీధి (లేక వీరపిళ్లైవీధి)లో నొక ఱుం
నివసించుచుండుకాలమున 1853 సం. డిసంబరు 21 తారీఖు
[ప్రమాదీచ, మార్గశీర్ష, బ ౬ లు బుధవారము] శ్రీవేదమ
వేంకటరాయశాస్త్రిగారు జనించిరి.

వేంకటరమణశాస్త్రిగారు 1856 లో మదరాసువీడి కా
నాడ, నరసాపురము, పోడూరు, విశాఖపట్టణములలోనుండి కః
పట 1878 లో రాజమహేంద్రవరపు రాజకీయ కళాశాలలో
సంస్కృతపండితులై 1887 విరామమొంది, 1901 లో నెల్లూ
రిలో తమ 83-వ యేట మరణించిరి. చిన్నయసూరిగారి
మిత్రులు. వేంకటరాయశాస్త్రిగారికి వేంకటాచలముగారు సూర్య
నారాయణశాస్త్రిగారును సహోదరులు. ఇరువురును మహామేధా
వులని ప్రసిద్ధినందిరి. ఇందు వేంకటాచలముగారు శ్రీచిలకమర్తి
లక్ష్మీనరసింహముపంతులవారికి గురువులు.

వేంకటరాయశాస్త్రిగారి బాల్యమంతయు ఆంధ్రదేశమున
పెక్కుప్రదేశములలో గడచినది. 1869 సం॥న మెట్రిక్యులేషను
మొదటితరగతిలో నుత్తీర్ణులైరి. తర్వాత మదరాసులో నార్మలు
స్కూలులో ట్రెయినింగు పొందిరి. అప్పుడు వీరికి శ్రీబహుజన
పల్లి సీతారామాచార్యులుగారు గురువులు. వెనుక 1875 లో
ఎఫ్. ఏ. పరీక్షయైరి.

అదిమొదలు ఉద్యోగములుచేయుటకు ప్రారంభించి వరుసగా ౧ శ్రీకాకుళము గవర్నమెంటుస్కూలులో కడపటియొజ్జ; ౨ విశాఖపట్టణముజిల్లా చోడవరము (లోకల్‌ఫండ్) మిడిల్ స్కూలు ప్రధానోపాధ్యాయుఁడు; 3 విశాఖపట్టణము హిందూ హైస్కూలులో ద్వితీయసహోపాధ్యాయుఁడు; ౪ రాజమహేంద్రవరము టౌనుస్కూలు ప్రధానోపాధ్యాయుఁడు; ౫ మదరాసు ముత్యాలపేట ఆంగ్లోవర్నాక్యులర్ మిడిల్‌స్కూలు ప్రధానోపాధ్యాయుఁడు అను నుద్యోగములలో పదునొకండు సంవత్సరములు గడపిరి. (1875+11 = 1886).

రాజమహేంద్రవరమున నుండునప్పుడే వీరు వాఙ్మయ రంగమున ప్రవేశించిరి. 1879-వ సం॥ ఆగస్టు 3-వ తేది శ్రీకందుకూరి వీరేశలింగముపంతులుగారు స్త్రీ పునర్వివాహమునుగూర్చి వాదించినప్పుడు శాస్త్రిగారు రాజమండ్రిలోనే దానికి ఖండనోపన్యాసమును చేసిరి. అదిమొదలు ఈవిషయముమీఁద రాజమండ్రిలోను మదరాసులోను లెక్కలేని యుపన్యాసములుచేసి 1883-వ సంవత్సరము స్త్రీపునర్వివాహ దుర్వాద నిర్వాపణమని గ్రంథముగా ప్రకటించిరి. దాదాపు 1880 నుండి మదరాసులో C. L. S. వారి జనవినోదిని యను పత్రికకు కొంతకాలము సంపాదకులుగా నుండిరి. అలంకారసారసంగ్రహమును రచించి ప్రకటించిరి. కథాసరిత్సాగరమును ఆంధ్రీకరించి జనవినోదినిలో ప్రకటించుచుండిరి.

1886-వ సంవత్సరమున వీరికొమారులు జనించిరి. [వీరే వేంకటరమణయ్యగారు. శాస్త్రిగారి జ్యోతిష్మతీ ముద్రాక్షరశాలను నిర్వహించుచుండి మువ్వురుకుమారులను ఒక కొమార్తెను కని, లేఁతవయసులో 1922 లో తమ 37-వ యేట, తండ్రిగారికన్న ఏడేండ్లు ముందుగానే చనిపోయిరి.] ఈసంవత్సరమే శాస్త్రిగారు మదరాసు క్రైస్తవకళాశాలవారిచే నాహ్వానింపఁబడి సంస్కృతప్రధానపండితులైరి. అప్పుడే ప్రక్రియాఛందస్సు అని తెలుఁగున నొక ఛందశ్శాస్త్రమును ఇంగ్లీషువివరణములతోను,సంస్కృతభోజవిక్రమార్కచరిత్రములను తెనుఁగుటీకలతోను ప్రకటించిరి.

కాలేజిపండితులైనపిమ్మటనే శాస్త్రిగారు బి. ఏ., పరీక్షకు కూర్చుండిరి. అదిమొదలు స్వతంత్రగ్రంథరచనకు ప్రారంభించిరి. తాము బాల్యములో తమ తండ్రిగారుచెప్పఁగా వినిన ప్రతాపరుద్రునికథను పెంచి, నూతనపాత్రలను సృష్టించి, కథగా జనవినోదినిలో ప్రకటించిరి. 1885-86-వ సంవత్సరమే మల్లికేశ్వరాలయమువీథిలో నేఁడును తత్కుటుంబమువారుండునింటిని కొనిరి. అందే 1890 లో జ్యోతిష్మతీముద్రాక్షరశాలను ప్రారంభించిరి. అంతవఱకు జనవినోదినిలో ప్రకటించుచువచ్చిన కథాసరిత్సాగరమును పూర్తిగావించి 1891 లో తమ ముద్రాక్షరశాలలో ముద్రించి ప్రకటించిరి. నాగానందనాటకము నాంధ్రీకరించిరి. తర్వాత 1896 లో శాకుంతలము నాంధ్రీకరించి ప్రకటించిరి. 1897 ప్రతాపరుద్రీయమును నాటకముగారచించి ప్రకటించిరి. [ఆసంవత్సరాంతమున కన్యాశుల్కము వెలువడెను.]

ఆకాలమున పండితులు వాఙ్మయమహాయుద్ధములు చేయుచుండిరి. శ్రీకొక్కొండము వేంకటరత్నముపంతులవారి బిల్వేశ్వరీయమును శ్రీపూండ్ల రామకృష్ణయ్యగారు విమర్శించిరి. శ్రీశాస్త్రిగారును మిత్రులచే ప్రార్థింపఁబడి ఈ 'యుద్ధము'లలో పాల్గొనసాగిరి. 1898 లో విమర్శగ్రంథములు వ్రాయఁబూను కొని శారదాకాంచిక లనుపేర ప్రకటింప నారంభించిరి. అందు జక్కన విక్రమార్కచరిత్ర ముద్రణవిమర్శనము మొదటికింకిణి; ఆంధ్రప్రసన్నరాఘవనాటకవిమర్శనము రెండవకింకిణి.

ఇంతవఱకు శాస్త్రులవారుచేసిన వాఙ్మయసేవ యేమనఁగా కొన్ని నూతనమార్గములను చూపుట. శాస్త్రిగారు సంస్కృతాంధ్రములలో పండితులేగాక ఇంగ్లీషులో బి. ఏ., గావునను క్రిశ్చియన్కాలేజిలో సంస్కృతకావ్యనాటకములను ఇంగ్లీషులో బోధించుచుండినవా రగుటచేతను 'నూతనమార్గములలో కవులు వ్రాయవలయును'. అని ఉపన్యాసము లిచ్చుచుండిరి. ఈయభిప్రాయముచే సులువైన వచన రచనకు మార్గదర్శకముగా కథాసరిత్సాగరమును వ్రాసిరి. అంతవఱకు ఆంధ్రకవులు నాటకముల నాంధ్రీకరించిరిగాని సంస్కృతమూలమును చక్కఁగా అర్థము చేసికొనలేదు. తమ యనువాదములలో పాత్రోచితభాషా మర్యాదను పాటింపలేదు. శాస్త్రిగారు మూలమునందలి స్వారస్యమును పూర్తిగా అనువదించుటేగాక 1891 లో నాగానందము నాంద్రీకరించినప్పుడే పాత్రోచితభాషను ప్రారంభించిరి. పైగా అంతవఱకు తెనుఁగున స్వతంత్రనాటకములు లేని

లోటును తీర్చిరి. ప్రతాపరుద్రీయము మొదటి స్వతంత్రనాటకము, ఆంధ్రజాతీయము, సర్వవిధముల రూపకరచనకు మార్గదర్శకము. ఈరచనలచేత శాస్త్రులవారికి సరిపడనివారు బయలుదేరి పాత్రోచితభాషను అరికట్టచూచిరిగాని నాటి మహాసభలలో శాస్త్రులవారి యుపన్యాసములను వినినపండితులు వారిపద్ధతినే మెచ్చుకొనిరి. ఆంధ్రదేశముకూడ దానినే ఆదరించినది.

తర్వాత శాస్త్రిగారు చాలగ్రంథములు రచియించిరికాని 1910-వ సంవత్సరము క్రైస్తవకళాశాలనుండి విరమించినతర్వాతనే ఎక్కువగ్రంథములు ప్రకటించిరి. చాల సంస్కృతగ్రంథములను చక్కని టీకాతాత్పర్యాదులతో ప్రకటించి విద్యార్థులు స్వయముగా చదువుకొనుటకు అనుకూలముచేసిరి. ఆంధ్రగ్రంథములలో మహాపండితులకు సైతము అర్థముకాని ప్రబంధములను విపులమైన వ్యాఖ్యలతో ప్రకటించిరి. వీనిలో శృంగారనైషధాముక్తమాల్యదలు ప్రధానములు. అచ్చాఫీసు వ్యాపారములో నష్టమువచ్చి 1919 లో జ్యోతిష్మతీముద్రాక్షరశాలను విక్రయించిరి. తర్వాత పదిసంవత్సరములు భాషాసేవచేసి 1929 జూను 18 తేది పరమపదించిరి.

శాస్త్రులవారు ప్రకటించిన సంస్కృతగ్రంథములలో నొక విశేషముగలదు. ఉపాధ్యాయునితో పనిలేకయే సంస్కృతమందు నాటకాంతము సాహిత్య మలవరుచుకొనవచ్చును. శాస్త్రులవారి సంస్కృతనాటకముల యనువాదములు మూలమునకు చాల సమీపముగానుండును. మూలార్థము సందిగ్ధముగా

నుండుచోట్ల నీయనువాదములు మూలములకు వ్యాఖ్యా ప్రాయములుగా నుండును. శాస్త్రిగారు సంస్కృతగ్రంథముల నాంధ్రీకరించుటకుముందు భిన్నదేశముల ప్రతులను తెప్పించి వానింబరించి పాఠనిర్ణయము చేసికొని ఆవెనుక అనువదించు చుండిరి. ఈవిషయములను వారు తమ విమర్శవినోదవ్యాస మున వివరించియున్నారు.

ఆంధ్రనాటకరంగమునకు వన్నె దెచ్చినవారిలో వీ రగ్ర గణ్యులు. నాటకములను అనువదించునప్పుడుగాని స్వతంత్ర నాటకములను రచియించునప్పుడుగాని రంగమందు వీని ప్రయో గమునుకూడ ధ్యానించెడివారు. తమ నాటకములను నెల్లూరి యాంధ్రభాషాభిమానిసమాజమువారిచేతను మదరాసు విద్వ న్మనోరంజనీసమాజమువారిచేతను సుగుణవిలాససభవారిచేతను మంచి కట్టుదిట్టములతో ఆడించుచుండువారు.

శాస్త్రిగారు వచనరచనలో అద్వితీయులు. ఇన్నివిధము లుగా తెలుఁగున వచనరచన గావించినవారులేరు. కథాసరి త్సాగరశైలి యొకవిధము. దశకుమారచరిత్ర యొకవిధము. భోజచరిత్ర విక్రమార్కచరిత్ర బేతాళపంచవింశతిక లొక్క విధము. పండితులకు పామరులకు విద్యార్థుల తరగతులకు తగి నట్లు వ్రాయునేర్పు వారికుండెను. నాటకములలో వారివచ నము నానావిధముల చూడవచ్చును. కథలలోని వచనశైలి వేఱు; నాటకసంభాషణములశైలి వేఱు. హెచ్చుతగ్గులులేని ప్రవాహము కథనము. నాటక మట్లుగాదు. అందు పాత్రభాషి

తములు ఆయాపాత్రోచితములుగా సందర్భానుసారముగా నుండవలయును.

శాస్త్రిగారి సారస్వతమూర్తి వారి స్వతంత్ర నాటకములలో కనఁబడును. తమ జీవితచరితమున తాము చూచి విని యనుభవించిన పెక్కు విషయములను నాటకములలో చేర్చినారు. శాస్త్రిగారి బాల్యమంతయు తండ్రిగారితోకూడ నాంధ్ర దేశమున పలుతావుల గడచినది. బాల్యమునుండియు కంటఁబడిన వస్తువును కనులారఁజూచి చెవులఁబడినవానిని చెవులారవిని ఆనందించి ఉత్తరకాలమున గ్రంథస్థములం జేసినారు. ఆ సునిశిత బుద్ధికి అన్నియు జ్ఞాపకములే! రసాత్మకవాక్య మేది ఆయన చెవింబడినను మఱి ఆహృదయమును వీడదు. ఆంధ్రదేశమును వర్ణింపను ఆంధ్రప్రతిభను లోకమునకు చాటను—వారికి బాల్యమందే ఆశ జనించినది; ప్రతాపరుద్రీయ బొబ్బిలియుద్ధనాటకములందు రూపుఁదాల్చినది.

ప్రతాపరుద్రీయ నాటక రచనాబీజము వారి హృదయమున వారి యెనిమిదవయేటనే పడినది. దీని ప్రథమముద్రణావతారికలో నిట్లు వ్రాసినారు. "ఓరుగంటి ప్రతాపరుద్రమహారాజును తురకలు ఢిల్లికి ఖయిదుకొనిపోయిన కథ లిఖితముగాని ముద్రితముగాని నా కెచటను దొరకలేదు. నే నెనిమిదేండ్ల వయస్సుననుండఁగా మా నాయనగారు వేదము వేంకటరమణ శాస్త్రులవారు తమ మిత్రబృందములో నీకథను ప్రస్తుతించు

నపుడు నేనును వింటిని. వారు చెప్పుటలో సకథ అరగంటకూడ పట్టలేదు. ఇటీవల నేను ఆంధ్రజనవినోదినీ ముద్రణాధికృతుఁడనై యుండఁగా 1883 సం॥మున ఈకథను నాకుఁ దోఁచినట్లు విరివిచేసి యచ్చట కథారూపమునఁ బ్రచురించియుంటిని. పిమ్మట 1896 సం॥ జూలై నెలలో దానిని నాటకోచితముగా రూపుచేసి, ఈనాటకమందలి గద్యభాగమునుమాత్రము వ్రాసి నా మిత్రులకుఁ జూపితిని."

ఈనాటకమును సమగ్రముగా విమర్శించుట కిది చోటు గాదు. గ్రంథము సముద్రమంతయై ముద్రణభాగ్యమునొందుట యసాధ్య మగును. కొన్నివిషయములుమాత్రము చెప్పఁదగినవి.

రచనకు ఆధారములు లేవు. శాస్త్రిగారు తండ్రిగారు చెప్పఁగా వినినకథ. తండ్రిగారికి ఈకథపరంపరగా వచ్చినది. అందును పూర్వపరంపర యేమనఁగా ప్రతాపరుద్రుని యుద్ధమున తురకలు పట్టుకొనిపోఁగా అతని మంత్రి యుగంధరుఁడు పిచ్చివానివేషమునపోయి విడిపించుకొనివచ్చె ననునదిమాత్రమే. మఱి మిగిలినవానిలో చారిత్రకాంశము లేవనఁగా విద్యానాథుఁడు ప్రతాపరుద్రుని సమకాలికుఁడును ఆస్థానకవియు నను నది. రాజు, ముమ్మడమ్మ, విద్యానాథుఁడు, షహ్యాబుద్దీన్ టోగ్లాకు సుల్తాను మాత్రమే ఇందలి చారిత్రక పురుషులు. తురుష్కుల మొదటి దండయాత్ర క్రీ. శ. 1307 బయలుదేరెను. రెండవ యాత్ర 1326 లో జరిగినది. యుద్ధమున రాజు ఖైదుచేయఁబడి

ఢిల్లికి కొనిపోఁబడెను. మిగిలిన పాత్రలనంతయు శాస్త్రిగారు కల్పించిరి. రాజును శత్రువులు యుద్ధమున గెలువఁజాలమని తలఁచి నిద్రలో ఖైదుచేయుట, విద్యానాథుఁడు ఓడలో రాజును దర్శించుట, మంత్రి రామేశ్వరముననుండుట, చెకుముకిశాస్త్రి గడుసుదనము, పేరిగాని వర్తనము, యుగంధరుఁడు పెద్దసెట్టిని, చెకుముకిని, బేతాళరాయని తనకు సాయముంచుకొని ఓడల మూలమున రాజును విడిపించుకొని వచ్చుట – ఇదంతయు పాత్రపోషణకొఱకును వస్తుగౌరవముకొఱకును శాస్త్రిగారు కల్పించినదే. దీనిని రచియించునాటికి (1897) ఆంధ్రదేశచరిత్ర మనకు విశేషము తెలియదు. కావున బేతాళరా వనుటకు బదులు సేనాపతి నామము కమాల్రావని ప్రథమ ముద్రణమున వ్రాసి తర్వాత బేతాళరావని మార్చుకొనిరి. వాస్తవముగా ప్రతాపరుద్రుఁడు బందీవిముక్తుఁ డాయెనో లేదో తెలియదు. గాని విముక్తుఁడైనట్లే మనపూర్వులెల్లరును భావించి కథలు చెప్పుకొనుచుండిరి. ఆయాభాణకమునే శాస్త్రిగారు గ్రహించిరి. మిగిలిన పెంపకమంతయు వారిదేగదా.

ఈనాటకము రచియించునాటికి భాసనాటకములు బయలు పడలేదు. అందుచేత ప్రతిజ్ఞాయౌగంధరాయణ నాటకమును, శాస్త్రిగారేమి భారతీయులే 1897 కు తర్వాత చాలకాలము నకు 1912 లో చూచిరి. దానికిని దీనికిని పోలికయే లేదు, ఒక్క మంత్రి పిచ్చితనమునదక్క.

రచన—సంస్కృత నాటకలక్షణము ననుసరించియు, కథాంశముల ననుసరించియు నడచినది. నాటక మింత పెద్దదై రంగమున కొద్దికాలములో ప్రయోగించుట కనువుపడకయుండు టకు కారణము కథయే యని వారే సెలవిచ్చియున్నారు. పైగా లెక్కలేని యుద్దేశములతో రచింపఁబడినది. నారితర్యాతి స్వాతంత్ర్య నాటకములు ఉషాబొబ్బిలియుద్ధములు చిన్నవే. రచనయందు తమ యనుభవమును వారే యిట్లు వ్రాసియున్నారు.

"అంకము—రంగము (=సీను). అంకమున కాలదేశవ్యక్త్యైక్యములు మూఁడును సుఘటితతరములు. ఆ ఘటన రంగనామ కాధునికకల్పిత విభజనచేత శిథిలమైన రసహాని కలుగును. కావున ఈయవాంతరవిభాగములు పనికిరావు. ఎన్నిసీనులో అన్ని అంకములనియే వ్యవరింపరాదా? నా స్వానుభవము.

నేను ప్రతాపరుద్రీయమును సీనులు సీనులుగానే తొలుత వ్రాసికొంటిని. నా హృదయమునకు రసము అందలేదు. తృప్తిగాలేదు. మరల మరల మార్చుచుంటిని. మార్పులలో సంకోచమగపడినది. సంకోచము హెచ్చుగా హెచ్చుగా సీనులు తగ్గినవి. అంకములు కొంచెము హెచ్చినవి. ఈవిధమున విష్కంభప్రవేశకాది సంఘటనచే సీనుల పెంపు నివర్తిల్లినది." (భారతాభారతరూపకమర్యాదలు).

వేంకటరమణశాస్త్రులవారికి వేదాంతులు నలువురుశిష్యులు నిరంతరము వారితో గోష్ఠిసలుపుచుండువారు. ఒకరు ముసల్మాను, రెండవవారు చాకలి, మూఁడవవారు క్రిశ్చియను, నాలవవారు

బ్రాహ్మణులు. సాహెబుగారు తమ మతగ్రంథములలోని వేదాంతవిషయములను చెప్పుచు "ఆ అరాబియా దేశంలో వభ్ఫఖీర్" అను నీతీరున మాటలాడుచుండువారు. ఆరయేనిమి దేండ్లవయసున సాహెబుగారిమాటలు శాస్త్రిగారికి వింతగా కనబడినవి. హృదయమున నెలకొన్నవి. ఇట్టి సాయెబుల నెంద అనో క్షనియే ప్రతాపరుద్రీయమందలి ఆమహమ్మదీయపాత్ర భాషితములను వ్రాసితిమని వారే చెప్పియున్నారు.*

ఒకప్పుడు బాల్యములో తమ్మునితోకూడ గోదావరిలో ఈతపందెములలో పాల్గొని ఇరువురును మునిగిపోవునంతటి పరిస్థితికివచ్చిరి. నాటి రాజమండ్రి బాల్యానుభవమును ప్రతాపరుద్రీయమును రచించునెడ జ్ఞప్తియందుంచుకొని విద్యానాథునికిచేర్చి సంవిధాన మల్లినారు. ఇట్లే పేరిగానింగూర్చికూడ వినోదవృత్తములు కలవు.

ప్రతాపరుద్రీయములో వెఱ్ఱివాడు, 'నేను కండచీమను ఏమనుకున్నావో ? పట్టుకుంటే వదలను' అని శిష్యులను బెదరించును. విశాఖపట్టణములో వీరు నివసించిన యింటి పొరుగింటి యాతడు, ముసలివాడు, తన పడుచుభార్యను ఈవాక్యమునే పలికి నిరంతరము బెదరించుచుండువాడట. జ్ఞాపకముంచుకొని తమాషాగా నుండినందున వెఱ్ఱివానికి తగిలించినారు. *

---

* ఇటువంటి విషయములు నా రచియించిన శాస్త్రిగారి జీవిత చరిత్రమున చూడవచ్చును.

శాస్త్రులవారి నాటకములు లోకస్వభావానుకరణములు లోకవృత్తానుకరణమున వారిది మొదటిచేయి. మాటలును, చేష్టలును ఇతరులవి అట్లే అభినయించి చూపగలిగినది వారిశక్తి. శాస్త్రులవారి నాటకముల ప్రసిద్ధికి ముఖ్యకారణము వారి పాత్రోచితభాష. సాయెబులు, చాకళ్లు, మంగళ్లు, పామరులు, విద్యావంతులు, బాలురు, స్త్రీలు, అరవలు, ఆంధ్రులలోనే నానా ప్రదేశములవారు-మొదలైనవారి గ్రామ్యభేదములను మెలకువతో కనిపట్టి తమ నాటకములలో ప్రయోగించినారు. ఈ గ్రామ్యభేదముల నన్నిటిని తమ బాల్యమునుండియే కనిపట్టుచు వచ్చినారు. ఇదియే ప్రతిభ.

1929 జూన్ 23 తేది యుగంధరపత్రిక, ఏలూరు, ఇట్లు నుడివినది. "స్వతంత్రమూర్తి, స్వాధీనుఁడు, వైలక్షణ్యము సహజము. ఆయన వాక్యరచనయందు, ఆయన ప్రసంగమునందు, ఆయన వ్యాఖ్యానాది టీకలయందు, ఆయనబోధయందు, పద్యకవనమందు-ఒకదానిలోగాదు తత్కృతులలో నొక్కొక్కదాని యందు ఆయన స్వాతంత్ర్యత,స్వాధీనత, విలక్షణత ముద్రితములై యుండుట కన్నుగలవారు చూడఁగలరు. శిష్యవత్సలుఁడు. చలపట్టినా ప్రత్యర్థినిపట్టి పల్లార్పవలసినదే. శరణమిచ్చినా సమర్థించి రక్షింపవలసినదే. నిరంకుశుఁడు, నీతిపరుఁడు; భాషాప్రపంచమున సర్వతంత్రస్వతంత్రుడే. సర్వాధికారి, ప్రామాణికుఁడు, పరిపూర్ణుఁడు. ఆసమయస్ఫూర్తి, ఆసందర్భశుద్ధి, ఆమేధాశక్తి, ఆ

ప్రతిభ, ఆప్రజ్ఞ, ఆప్రయోగకౌశలము, ఆహాస్యవిలాసము, ఆ ఛలోక్తి, నిరుపమానములు, కని వినినవారిదే భాగ్యము.

“దూరమునుండి చూచువారికి భయంకరుఁడు, సన్నిధి సేసినవారి కభయంకరుఁడు. ఈయన స్వవిరచితగ్రంథములు నట్లే. పైపైఁ జూచువారికి పాషాణకఠినములు నీరసములు, చొరఁబడి చదివినవాఁడు ద్రాక్షాదికదళీపాకములు రుచిగొనగలఁడు. కవిత్వమునందలి బింకము, శబ్దప్రయోజనము, సందర్భోచితి అచ్చున బోసినట్లుండును. ఇంతేల రసద్రష్ట, శబ్దస్రష్ట.”

‘శాస్త్రిమనుమఁడు’



# నాటికకథాసంగ్రహము.

౧. ప్రతాపరుద్ర మహారాజు ఓరుఁగల్లు నిజరాజధానిగా త్రిలింగ దేశము నేలుచుండెను. అతని మంత్రి యుగంధరుఁడు రామేశ్వరయాత్ర పోయి యుండెను. మంత్రి తమ్ముఁడు జనార్దనుఁడు రాజ్యము విచారించు చుండెను. ప్రతాపరుద్రుఁడు వేఁటకుఁ బోయి యుండెను. అట్టి సమయములో ఢిల్లీసుల్తాను సర్వసేనాపతి వలీఖానుఁడు, త్రిలింగరాజ్యముమీఁదికి పెద్దదండుతో వచ్చి ఓరుఁగంటిదాఁపున విడిసి సఖ్యముకై వచ్చినవానివలె నభినయించుచు జనార్దనమంత్రిని దర్శించి, తాను ఢిల్లీసుల్తానుకడనుండి రాయబారము తెచ్చి నట్లును, ఢిల్లీరాజ్యము మీఁదికి ఆఫుగానిస్తాను సుల్తాను దండెత్తి వచ్చుచున్న ట్లును, ప్రతాపరుద్రమహారాజు దండునడుపుకొనివచ్చి ఢిల్లీసుల్తానునకు సాహాయ్యపడవలయునని సుల్తాను ప్రార్థించుచున్నాఁడనియు, తెలిపెను. తురక ఈ వ్యాజమున రాజును గొనిపోవుటకును ఖయిదు సేయుటకును పిమ్మట సులువుగా త్రిలింగదేశమును పట్టుటకును యత్నించుచున్నాఁడని జనార్దనమంత్రి యూహించి, తానును పైకి సఖ్యమునే అభినయించుచు, నగరమున రాజు లేఁడనియు రాఁగానే దర్శన మిప్పించెద ననియు చెప్పెను. కొందఱు చాకళ్లను కొందరు మంగళ్లను తమకు నౌకరికి పంపు మని వలీఖానుఁడు జనార్దనుని వేఁడెను. తురక వేగుకొఱకు నౌకరులను కోరినాఁ డని తలంచి జనార్దనుఁడు తన వేగులను చాకళ్లుగా మంగళ్లుగా పంపెను. పిమ్మట తనయన్న గారిని రప్పించుటకై బేగిరావు టప్పా పంపెను. వేఁటలోనున్న రాజునకు వెంటనే రాజధానికి రమ్మనియు తురకలు దండెత్తివచ్చియున్నారనియు జాబు పంపెను. తురకలను స్వదేశమునకు పాఱిపోనీయక ఇచటనే తెగటార్చువాఁడై జనార్దనుఁడు నది దాఁటు సాధనములను యానపాత్రములను పగులఁగొట్టి పాఱవేయవలసిన దని గోదావరి రేవు లన్నిటికి ఆజ్ఞ పంపెను. రాజును బోలిన చాకలి యొకఁడు పరమ మూఢుఁడు నగరమున నుండఁగా, వాఁ డీసమయమున నెందులకేని పనికివచ్చు

వని వానిని తనయింట నుంచుకొనెను. త్రిలింగరాజ్య సర్వసేనాపతిని బేతాళ రాయని రప్పించి సన్నాహమున నుండ నాజ్ఞాపించెను.

II. పిమ్మట వలీఖాను తన క్రిందిసర్దార్లతో మంత్రాలోచన చేయుచుండఁగా ఆసభలోనికి చెవుముకిశాస్త్రి యనునతఁడు జనార్దనుని సహాధ్యాయి తత్ప్రేరణచేఁ బోయి తాను జోస్యుఁడనియు, పేరు యమధర్మ రాజజ్యోతిషికుఁడనియు, తాను రాజద్వేషి యనియు, వారియాశ్రయముచే ఢిల్లీసుల్తానును దర్శించి అతనితోడ్పాటున ఈరాజును సాధింప నభిలషించియున్నాఁడనియు, తెలిపి, వారిని నమ్మించి వారితో సఖ్యముచేసికొని వారివలన తురకదుస్తు బహుమతి నొంది వెడలిపోయెను. తురకలు ఓరుఁగల్లు పట్టుట యసాధ్యమని తెలిసికొనిరి. వలీఖాను కడమ సర్దారులను అక్కడనే నిలిపి తాను రాజును పట్టఁగోరి అడవికిఁ బోయెను.

III. రాజు వేఁటలో నొంటిఁ జిక్కి, బడలి, గోదావరి దక్షిణతీరమున అడవిముఖమున నొకచెట్టుక్రింద నిద్రించుచుండెను. వలీఖానుని సిపాయీలు అతనిం గని రాజని గ్రహించి వలీకి తెలిపి అతనియాజ్ఞచే నతనిని నిద్రలోనే ఖయిదుచేసి, మేల్కొనఁగా, సవారిలోనుంచి గోదావరిపై కొని పోయిరి. నదిలో ఆసమయమున కొన్నియోడలు మంత్రియాజ్ఞ యందనివి పోవుచుండఁగా వానిలో నెక్కి యీతురకలు గోదావరి దాఁటుచుండిరి. దీని నెల్ల విద్యానాథుఁడనుమహాకవి యొకఁడు దూరమునఁ గని, హిందూప్రభువును తురకలు గొనిపోవుచున్నట్లూహించి నిజ మెఱుఁగఁగోరి నీటఁబడి, మొసలి తరిమినట్లభినయించుచు ఓడలకడకు ఈఁదివచ్చి ప్రవేశమొంది, రాజుం గనెను. రాజడుగఁగా తాను ప్రతాపరుద్రునిమీఁద గ్రంథముచేసినట్లును ఓరుగంటిలో రాజు లేనందున రాజదర్శనము కానట్లును తెలిపెను. మఱియెవరికైన నంకితముచేసి బహుమతి పొందరాదా యని రాజడుగఁగా 'అంతటను వానినే తగుల వేసితి' ననెను. రాజు శ్లోకములు జదివించి విని సంతసించి తన మొహరుంగరమును విద్యానాథుని కిచ్చెను. దానివలన విద్యానాథుఁ

ఇతనిని ప్రతాపరుద్రునిఁగా నెఱిఁగి 'ఈ యుంగరమును మరల స్వతంత్ర ఓరుఁగంటి సింహాసనమున నెక్కించెదను.' అని ప్రతిజ్ఞ చేసి వెడలిపోయెను.

IV. ఇంతలో యుగంధరుఁడు ఓరుఁగంటికి వచ్చెను. మంత్రిసభ. రాజును గనిన మఱునాఁడే కవి నానామాయోపాయములచే అంచెల మీఁద ఓరుఁగల్లు చేరి యుగంధరుని దర్శించి జేని వృత్తాంతము తెలిపెను. యుగంధరుఁడు ఇతనిని తనసభ్యులకు జోస్యునిఁగా తెలిపి, రాజు వేటలో గాయపడి బెడదపూడిలో కామాంధకారుఁడయి యున్నట్లు ఇతనిచే జోస్యము చెప్పించి, ఆయర్థమే గలదిగా ఒక జాబు రాజునొద్దనుండి వచ్చినట్లుగా కల్పించి రప్పించి, రాజును తెచ్చుటకు జనార్దనుని నియమించి, విద్యానాథుని తమతో నొక మంత్రిని జేసి, సభ చాలించెను. పిమ్మట ఏకాంతమున, విద్యానాథ జనార్దనులకు 'రాజు లేఁడన్న రాజ్యము నిలువదు, చాకలిని పేరిగానిని కోగిరాజుగా చేసి కోటకు తెండు,' అని బోధించెను. అట్లే విద్యానాథుఁడు పేరిగానికి 'నీవు రాజ వగుదు' వని జోస్యము చెప్పి, ఆరాత్రి వానిని బెడదపూడికి కొని పోయెను.

V. మఱునాఁడు జనార్దనుఁడు విద్యానాథుఁడును వానిని కోగిరాజునుగా వేషము వేసి తెచ్చి కోటలో వేఱుగా నొకమహలులో నుంచిరి. వెంటనే తురకశిబిరములో సర్దారు ఖుస్రూఖానుఁడు రాజు వచ్చె నని చారులవలన నెఱిఁగి పరితపించుచుండెను; వానికడకు వలీఖానునిహర్కారా వచ్చి 'రాజును వలీఖాను ఖయిదుచేసి ఢిల్లీకి కొనిపోయె' నని తెలిపెను. ఖుస్రూ సందేహపడి చెకుముకిశాస్త్రిని (యమధర్మరాజ జోస్యులను) జోస్యమడుగఁగా, రాజను కొని చాకలిపేరిగానిని వలీఖాను పట్టుకొనిపోయె నని అతఁడు జోస్యముగా చెప్పెను. ఆసమయమున యుగంధరునికడనుండి దుబాసి వచ్చి ఖుస్రూతో, తత్క్షణము యుద్ధమునకు సిద్ధపడు మని రాజాజ్ఞగా చెప్పిపోయెను. ఖుస్రూ ఈ గందరగోళములో ఏమియుం దోఁపక, తానింత కాలము కోటను పట్టక యూరక యున్నందున తన కార్య మిట్లు చెడినదని తలఁచినవాఁడై తన యుద్ధోద్యమము

లకు ప్రతిఘటిల్లుచుండిన తనక్రిందిసర్దార్లను ముస్తఫా ఫిరోజులను చంపఁ దరలెను. వేతాళరావు తురకదండును ఇరుప్రక్కలం బొదివి నాశముచేసెను. యుగంధరుఁడు తురకలకు చాకలిని పట్టి యిచ్చె నని నగర మెల్ల కింవదంతి కలిగెను. అది విని పేరిగాని పెండ్లాము ఎల్లి యుగంధరునికడకు వచ్చి మొఱ్ఱపెట్టుకోఁగా, మంత్రి, 'మేము వానిని తెప్పించి నీ కిచ్చెదము పొమ్ము,' అని దానికిచెప్పి ధనమిచ్చి సమాధానపెట్టిపంపివేసెను. అంతఃపురములో రాణియు రాజుతల్లి ముమ్మడమ్మయు రాజును చూడవచ్చిరి. విద్యానాథ జనార్దనులు కూడదని యాటంకపఱిచిరి. వారిని లక్ష్యపెట్టక, రాణి చూడకమాన నని హఠము చేయఁగా యుగంధరుఁడు పోయి 'రాజును తురక ఖయిదుచేసి ఢిల్లీకి కొనిపోయె' నని ముమ్మడమ్మతో చెప్పి, ఏడునెలలు పదిదినములలో తెచ్చి తాను అప్పగించువాఁడని ప్రతిజ్ఞ చేసి, వారిని పంపివేసి, రాజ్యమును విద్యానాథ జనార్దనులకు అప్పగించి, తాను ఎవరికిని తెలుపక ఎచటికో పోయెను.

VI. విద్యానాథ జనార్దనులు పేరిగానికి శబ్దశుద్ధియు రాచఠీవియు కొంతకాలము నేర్పిరి. నవీనులయెదుట వాఁడెట్లు వ్యవహరించునో చూడఁగోరి తమలో తామే సంగీతగాండ్రుగాను కవులుగాను వచ్చి దర్శనము చేసిరి. సభ జరిగినది. పేరిగాఁడు మంత్రులబోధన మఱచి చాకలిగానే ప్రవర్తించి రసాభాసము చేసెను. అంతట మంత్రులు వాని యాకారమునుమాత్రము దూరస్థలముల నుపయోగింపను, ఆగంతుకులను రాజదర్శనాపేక్షులను తామే పరితోషపెట్టి పంపను, నిశ్చయించుకొనిరి.

VII. ఢిల్లీలో చెకుముకిశాస్త్రి యుగంధరాజ్ఞ చే వలీఖానుతో కుట్ర యొకటి సాగించెను. ఆకుట్రకు పర్యవసాయ మేమన, ఢిల్లీసుల్తానును వజీర్ల నందఱను యమునలోనికి రాఁబోవు నౌకానాక వర్తకుని యోడలోనికి చేర్చి, అచట వారి నందఱను సంహరించి వలీఖాను సుల్తాను అగుటయు, వెంటనే చెకుముకిశాస్త్రిని ఓరుఁగంటికి పాదుషాను చేయుటయు, కుట్ర స్థిరపడినది. నాఁటికి మూఁడుమాసములనుండి ఢిల్లీవీథులలో 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్?

అని ఒక వెఱ్ఱివాఁడు అఱచుచు తిరుగుచుండెను. వాఁడు వెఱ్ఱియో కాఁడో కనిపట్టుఁడని సుల్తాను ప్రభృతులు చారులను నియమించిరి. చారులు వానిని పరికించుచుండిరి. చెకుముకిశాస్త్రి కుట్రప్రకారము కార్యము సాధించుటకై ప్రతాపరుద్రుని యాభరణములను అతని గుఱ్ఱము సాభరణములను వలీఖాను వలన వర్తకులకు లంచము గాఁగొని, అవినిండియున్న పెట్టెను ఒక జవానుచేత నెత్తించుకొని వెఱ్ఱివానికనులయెదుటి పేఠలో పోయెను. ఖుస్రూఖాన్ ఓరుఁగంటియుద్ధమునుండి పరారియై వచ్చినవాఁడు వలీఖానును చూడఁబోవుచు రస్తాలో వెఱ్ఱివానిని పిల్చి నిదానించి కనిపోయెను. వెఱ్ఱివాఁడు తనకు శిష్యుఁడుగా అనుచున్నయొకనిని (తనకుమారు నే) ఖుస్రూవెంట చారునిఁగాఁ బంపెను. ఖుస్రూ వలీని కనెను. చాకలిని తెచ్చి తీవనెను. ఆమాట సుల్తానుతో చెప్పునని వెఱచి వలీ వానిని సికారి రమ్మని యమునయొడ్డున శ్మశానముకడకుఁ గొని పోయి అచట తలఁగొట్టి తలకాయను గట్టువెంబడి పాఁతి, మొండెమును రాయి కట్టి యమునలో వైచెను. శిష్యుఁడు కని పోయి అది యెల్లను వెఱ్ఱివానికి 'తాటికాయ' పాటగా తెలిపెను. ఆ కళేబరమును తెచ్చి తలను అదికి దాఁచియుంపను పిమ్మట పిశాచముగా నుపయోగింపను చెకుముకిశాస్త్రికి తన యాజ్ఞ తెలుపు మని వెఱ్ఱివాఁడు పాటగా నే శిష్యునికి సూచనచేసెను. పిమ్మట వెఱ్ఱి యేకాకిగా యమునాతీరమున శ్మశానమునకుఁబోయి వంటచేసికొనెను. చారులు చెట్లపైనుండి వానికగపడక యే పరికించుచుండిరి. వెఱ్ఱివానికి ఆవులింత వచ్చెను. దానివలన వెఱ్ఱివాఁడు శంకించి అట నెవరో చారులు తన్ను పరికించుచున్నారని యూహించి, 'గుడగుడశబ్దం కుండకు నష్టం' అని అన్నపుఁగుండ పగులఁగొట్టి, తిండిలేకయే, మరల అఱచుచు ఊరిలోనికి వెడలెను. అది గని చారులు వెఱ్ఱియే అని నిశ్చయముచేసికొని, చెట్లుదుమికి, పోయి సుల్తాను ప్రభృతులకు అట్లే తెలిపిరి.

**VIII.** సుల్తానుదర్శనమునకు కోమట్లు ఓడవర్తకులు వచ్చి, గొప్ప నజరు లుంచి 'ఓడలలో అపారముగా వింతసరకులు మణిమయములు ఉన్నవి.

ఇవలికి తెచ్చుటకు రెండుమూఁడుమాసములు పట్టును, సుల్తానువారు ఓడలకే వచ్చివానింగని కొనవలయును.' అని తెలుపుకొనిరి. అంగీకరించి, వెలలుతీర్చుటకు ప్రతాపరుద్రుని ఖైదు విడిపించి రప్పించి సుల్తాను, వజీర్లు, అందఱును ఓడలకుఁ బోయిరి. దారిలో వెఱ్ఱివాఁడును 'ఢిల్లీసుల్తాన్ పట్టుకపోతాన్, ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్.' అని అఱచుచు కనిపించెను. వినోదార్థము సుల్తాను వానినిగూడ తోడ్కొనిపోయెను. ఓడలలో వర్తకులు సుల్తానునకు వినోదములు సలుపుచు ప్రొద్దుపుచ్చి, రాత్రిభోజనమునకు అందఱను అచటనే నిలిపి, భోజనానంతరము వారియెదుట సుల్తానువారి త్రిలింగవిజయమును నాటక మాడించిరి. అందులో వలీఖాను చాకలిని పట్టి తెచ్చి రాజని తెలుపుటయు, ఖుస్రూఖానును చంపుటయు, ఖుస్రూకళేబరముచేత నే పలికించిరి. ప్రకృతము వలీఖాను చేయుచున్న కుట్రనుకూడ వెల్లడిచేసిరి. సుల్తాను ఆగ్రహపరవశుఁడై వలీఖానును వానిపక్షము వజీర్లను అందఱను సంహారముచేయించి యమునలో వేయించెను. వర్తకులు వలీఖాను తలను తెచ్చి దాఁచిరి. హతశేషులు సుల్తాను, ఇరువురు వజీర్లు, ఇరువురు జవానులు. ఓడలోనే నిద్రించిరి. వారిని నిద్రలో ఖైదుచేయించి వెఱ్ఱివాఁడును (యుగంధరుఁడును) రాజును మంగళవేషములు ధరించిరి. (ఓడలు తెల్లవాఱునప్పటికి కాశి చేరెను.)

IX. రాణి గౌరిపూజ చేయుచున్నది. బ్రాహ్మణ సత్కారము. ప్రతాపరుద్రుని నగరప్రవేశ వ్యూహము; రాజసురత్రాణులు అష్టగజపుష్పకమున, ఖుస్రూకళేబరము బండిలో, వలీతల గడమీఁద. విద్యాధరమిథునము గౌర్యాజ్ఞచే ఆకాశయానమున వచ్చి ఆవిభవములఁ గని గౌరికి నివేదింపఁబోయెను. యుగంధరుఁడు రాజును గొనిపోయి ముమ్మడమ్మకు అప్పగించెను. రాణి యుగంధరునిపాదములను పుష్పములతోను ముత్తెములతోను పూజించినది. పేరిగానిని చాకలిపరివారముతో ఎల్లికడకు ఇంటికి పంపిరి. పేరిగాఁడు త్రాగి కైపెక్కి, 'దూడపేడ బఱ్ఱిపేడ లేక కూడుతిన,' నని యిల్లు వెడలి పాఱిపోయెను. వానికి వెఱ్ఱి యెత్తిన దని తలంచి యెల్లిపోయి మంత్రితో మొఱపెట్టుకొనెను.

మంత్రి, 'శ్రీనాథకవీంద్రుడు రాజసభలో చెప్పగా వ్రాసి పత్రిక అర్పించెను,
(పేరని వదకంచి కహారాలో సూచించెను).

X. రాజసభ. అప్పుడు రాజా కటకపల్లకారుని గూర్చి మహాదానము తెచ్చెను. అవర్తకులును వచ్చిరి, మమ్మదమ్మ యుగంధరునికి పిడికెడు దాంకిత మైన హార మొకటి పంపెను. దానిని సభలో రాజు అతని మెడలో వైచెను. సుల్తానును పిడిక్కొనిరి. రాజు పక్షిపిత్రుడు నిచ్చి, పేరని చాకలిదొరను, ఎల్లిని చాకలిదొరసానిని, చేసి, వారికి గొప్పబహుమానములు ఇచ్చెను. రాజు విద్యా సాక్షికి గారి గౌరవించి ప్రతాపరుద్రీయాక్కృతిని గ్రహించి 'అంతట వానిసే తగులజేసితి నంటిరి గదా' యనెను. మీ పేరు ప్రతిశ్లోకమునకు తగిలియున్నదో లేదో చూచుకొనుడు' అని కవి యుత్తరము చెప్పెను. ఆసమయస్ఫూర్తికి ప్రభువు సంతోషించెను. రాజకార్యసాధకులకు గొప్పసత్కారములు.



# నాటకపాత్రములు

## పురుషులు.

---

సూత్రధారుఁడు— ప్రస్తావన.

జనార్దనుఁడు (యుగంధరునితమ్ముఁడు.) I, IV, V-6, VI, X,

మంత్రి ప్రతీహారుఁడు. ... ... I, IV, V-4. VI.

వలీఖానుఁడు (ఢిల్లీ సుల్తాను సర్వసేనాధిపతి.) I, II, III-2, VII-1, VIII.

విశ్వాసరావు (రాజమంత్రి శిరస్తా) ... I, IV, X.

బేతాళరావు (ప్రతాపరుద్రుని సర్వసేనాపతి.) ... I, IV, X.

10 వేగులు (5 చాకళ్లుగాను, 5 మంగళ్లుగాను), దలాయతు, వలీ శిరస్తా. I.

చెకుముకిశాస్త్రి, II, IV, V-1, 2, 3, 4, VI, VII-1. 2. VIII-5, X.

ఖుస్రూఖాన్ (వలీఖానుని క్రిందసర్దారుఁడు) II, V-1. VII-2.

ముస్తఫాఖాన్, ఫిరోజ్ ఖాన్ (ఖుస్రూఖాను క్రిందిసర్దార్లు.) II.

తురక డేరాకడ దౌవారికుఁడు. ... ... II, V-1.

11 తురక సిపాయీలు. ... ... III-2,3,4,6.

ప్రతాపరుద్రుఁడు (త్రిలింగదేశ మహారాజు) III-2,3.5, VIII, IX-4, X.

5 పడవ వాండ్రు. ... ... III-3, 4, 6, VII-3.

పడవవాఁడు (బాలుఁడు.) ... ... III-3, 4, 6.

విద్యానాథుఁడు (కవి) III-4, 5, 6, 7, IV, V-6, VI, X.

* గుఱ్ఱము (ప్రతాపరుద్రునిది.) ... ... III-2.

యుగంధరుఁడు IV, V-4, 5, 6, VII-2, 3, VIII-2, 3, 4, 5, IX-4, X.

విజయరామరెడ్డిగారు, నారాయణరాజుగారు (జమీందార్లు.) IV, X.

3 ఉద్యోగస్థులు, ... ... ... IV.

పేరిగాఁడు (ఒక చాకలి.) ... ... IV, VI, IX-5, 6 X.

తురక సిపాయి, హర్కారా, దుబాసి. ... ... V-1.

2 రౌతులు, పడవాలు. ... ... ... V-4,

బాలుఁడు (ప్రతాపరుద్రుని కుమారుఁడు.) ... V-6, IX-4, X.

2 పహరా జవానులు (ప్రతాపరుద్రుని నగరిలో.) ... ... V-6.

అనుమఁడు. పులిగాఁడు, వైణికుఁడు. ... ... VI

మార్దంగికుఁడు. ... ... ... VI, VIII-4.

మోర్చింగువాఁడు. ... ... ... VI, VII-2.

4 బేగు సిపాయీలు, వలీ నౌకరు, వర్తకుఁడు, 3 ద్రష్టలు, 3 శిష్యులు. VII-2.

ఢిల్లీ సుల్తాన్, పెద్దసెట్టి, 2 వర్తకులు, 2 వజీర్లు. VIII, X.

4 సుల్తాన్ జవానులు, 6 వజీర్లు. ... ... VIII.

10 సిపాయి పాత్రములు, వలీపాత్రము. ... VIII-5.

దౌవారికుఁడు (సుల్తానువారి.) ... ... VIII-1.

పురోహితుఁడు, తత్పుత్త్రుఁడు, అవధానులు, సోమయాజులు, చయనులు. IX-1.

5 సంభావనీయ బ్రాహ్మణులు. ... ... IX-1.

1 చాటింపువాఁడు. ... ... ... IX-2.

విద్యాధరుఁడు. ... ... ... IX-2, 3.

10 చాకళ్లు (పేరిగాని పరివారము.) ... ... IX-5, 6.

అన్నమరాజు, నరసింహరాయలు, కంచుకి, అగ్రహారస్థుఁడు X.

4 అంగరక్షకులు, ప్రతీహారుఁడు, ... ... X.

## స్త్రీలు.

నటి— ప్రస్తావన, VI, X: నటీచతుష్టయము, 3 ఛత్త్రధారిణులు. VIII-4.
3 చేటికలు—III-1. చేటి - V-4: 2. చేటికలు - V-6:
4. చేటికలు - IX-1.
ఎల్లి (పేరిగాని పెండ్లాము.) ... V-4, IX-6, X.
శర్వాణి (ప్రతాపరుద్రుని రాణి.) ... V-6, IX-1, 4.
ముమ్మడమ్మ (ప్రతాపరుద్రుని తల్లి.) V-6, IX-4.
భాగ్యశాలిని ... ... ... VII-2.
6 చామరగ్రాహిణులు VIII-4; 2 చామర...VIII-5; 2 చామరX.
5 ముత్తయిదువులు, పురోహితభార్య, జగదంబిక, సోమిదేవమ్మ. IX-1,
విద్యాధరి. ... ... ... X-2, 3.
చాకలిముసలిసువాసిని ... ... IX-6,

హెచ్చరిక:—పాత్రసంఖ్య గొప్పదిగా నున్నను, నాటక మెల్లనాడుటకు, 6 పురుషులు, 11 స్త్రీలు చాలుదురు.

ఈనాటకము రెండురాత్రులకు ఉద్దేశింపఁబడినది. అట్లు ఆడువారు తొలి 6 అంకములు ఒకరాత్రి, కడను 5 అంకములు ఒకరాత్రిగా, ఆడుట మంచిది. అటుగాక సంగ్రహించి ఒకరాత్రి ఆడఁగోరికయైన, - 3 అం; 5 అం. 1, 6, స్థ. ; 6 అం ; 7 అం. ; 8 అం 2-5 స్థ.-ఆడుట మంచిది.

శ్రీ

# ప్రతాపరుద్రీయము.

ఉ. 1నీటను డాఁగి, 2కొండతొల నెక్కొని, 3నేలను బొజ్జె వెట్టి, 4పె
న్గోటను జక్కు సేసి, 5యడుగుల్నిక మీఁదియు దవ్వు దాఁటి, 6రా
పోటొనరించి, 7కట్టి, 8కలుముచ్చయి, 9దొంగిలి, 10లేదటంచు, 11టా
టోటుగఁ 12గత్తి దూయు నొకటొఁకటి యాతనియాలు సేలుతకా. 1

## ప్రస్తావన.

నాంద్యంతమున

సూత్రధారుఁడు—ఏల యతివిస్తరము? ఇవ్వాళ్లీకుఁగదా తగిన సభయెదుటఁ బ్రతాపరుద్రీయ మాడనోఁచితిని. ఇంటికిఁ బోయి గృహిణిని దెచ్చి సంగీతక మారంభించెదను. [పరిక్రమించి తెరవైపు చూచి]పరధ్యానములో ఇల్లు దాఁటిపో నుంటిని ! ఆర్యా, రారమ్ము, రొట్టె విఱిగి నేతిలోఁ బడినది.

---

1. ఇందు నారాయణుని యవతారములు వర్ణింపఁబడినవి .1. మత్స్యమూర్తియై, 2. మందర పర్వతముయొక్క మొదటిభాగముకడ నుండి-అనఁగా కూర్మమై, 3. వరాహమై, 4. పెద్దనఖము(ల)తోఁ చీల్చి-నరసింహమూర్తియై, 5.(వరాహావతారమునందు నాలుగు పాదములుండఁగా అందులో రెండింటిని వదలి-అనఁగా) రెండే పాదములు గలిగియు దూరము లంఘించి-స్వర్గపాతాళములవఱకు అంజవైచి-వామనమూర్తియై, 6. రాజులం బొడిచి-పరశురాముఁడై, 7. సేతువును నిర్మించి-శ్రీరాముఁడై, 8, బలరాముఁడై, 9. వెన్న దొంగిలించి-శ్రీకృష్ణుఁడై, 10. ఆత్మ లేదని వాదముచేసి-బుద్ధుఁడై, 11. మోసముగా, 12. కల్క్యవతారమైన నారాయణుఁడు.

కథాంశసూచననాదీతర విషయములను చదువరు లూహించుకొనవలయును.

నటి—[నేపథ్యాత్ప్రవిష్టయై, కంపస్వేదములతో] ఎవరు? ఎవరు? [ఎదుటికివచ్చి] నీవా ఆర్యపుత్త్రా!

సూత్ర.—ఆర్యా, ఏమి యీనృత్యము? ఏమి యీముత్తెసరులు?

నటి.—ఆర్యపుత్త్రా, నే నిపు డీద్వారదేశమునకు రాఁగానే మొన్న నా చెల్లెలిని ఆటలోఁ జూచి యింటికి వెంబడించి ఆ తురక ఈ ప్రదేశముననే ఎత్తుకొనిపోయిన యదావడి జ్ఞప్తియై ఆపరధ్యానములో నుంటిని. అంతలో మాట్ల వినఁబడినది. అంతట నామీఁదికిఁగూడ వాఁడు వచ్చినాఁడో యని భయపడితిని. చూడఁగా నీవు.

సూత్ర.—[సహర్షము] ఆహాహా! ఏమి దివ్యశకునము! నేను సాయె బెత్తుకొని పోయిననాటకమునే ఆడుటకై నిన్నుఁ బిలువ వచ్చితిని.

నటి.—[సానూయము]సడిసడి! మాకత అప్పుడే నాటకము సేసితివా?

సూత్ర.—ఏమి యీకోపము! నిన్నుఁ జూడఁగా తిట్టువానివలె నున్నది. నీవు—అని యారంభించు నీతో నే నేమి చేయవచ్చును?

నటి—[సభ్రుకుటి] నాటకా లాడవచ్చును, మా చెల్లెలిని గుఱించి.

సూత్ర.—ఆవిషయమే గాదు.

నటి.—మఱి యేవిషయము?

సూత్ర.—నీతోఁ జెప్పినది చాలును.

నటి.—అటయినఁ జెప్పవా?

సూత్ర.—ముఖ మెఱ్ఱనైయుండ గాయుచున్నదే?

నటి.—[మందహాసముతో] అది కుంకుమతాంబూలముల యీరెండ లే చెప్ప.

సూత్ర.—ఒక ముద్దిచ్చినఁ జెప్పెదను.

నటి.—చెప్పినవెంటనే అడిగిన నిచ్చెదను.

సూత్ర.—ఢిల్లీసుల్తానుసర్దారు ఓరుగంటిమహారాజును గొనిపోయిన నాటకము.

నటి.—అది శ్రీ వేదము వేంకటరాయశాస్త్రి విరచితము గదా.

ఉ. అంకెకుఁ దార్చె నేరసికు నంగలభారతి ప్రౌఢనీ, తిసా
కింకిరి నాంధ్రి ద్రావిడియుఁ గేరుచు నైవియుఁ గూడి రెవ్వరిక్,
జంకు కళంకు లేనికవిచంద్రుఁడు తోషితకోవిదేంద్రుఁ డా
వేంకటరాయశాస్త్రికృతి వెంగలిమూఁక కెఱుంగ శక్యమే ? 2

దానిస్వారస్యము గ్రహించు రసికశిఖామణులు మన కెక్కడ నొనఁగూడుదురు ?

సూత్ర.—ఇక్కడ కూడియున్నారు.

నటి.—ఈ నాటకమును నే నాడునపుడు నాకుఁ జూడఁ గోరిక, చూచునపు డాడఁగోరిక. ఈమాఱు దీనిని సామాజికులలోఁ జేరి చూచి యానందించెదను.

సూత్ర.—సరిసరి ! నీవు లేనియాట ర క్తి లేనిపాట.

నటి.—నేను ఆడిన, చక్కఁగా ఆడక తప్పదు. చక్కఁగా ఆడిన—

సూత్ర.—[హేళనముగా] సాయె బెత్తుకొనిపోవు నని భయమా ?

నటి.—[పరిహాసముగా] అవును, అదేభయము. అట్లు జరిగిన నీవేమి చేయఁగలవు ?

సూత్ర.—నీచెల్లెలిని విడిపించుకొని వచ్చిన నా నేర్పు నీవెఱుఁగవా? గొప్పవారు తప్పు చేసిన. వారికత నాటక మాడి పరువు తీసివేయనా ?

నటి.—నేను లేనియాట ర క్తిలేని పాట గదా ?

సూత్ర.—నీచెల్లెని బెట్టుకొని యాడెదను.

నటి.—దానిం గొనిపోయిన ?

సూత్ర.—రథం బుడింగి ! నీయు క్తి కాళయుక్తిగా నున్నదే !

నటి.—కావున, ఆర్యపుత్త్రా, నాకు సామాజికులలో నుండ సెల వీయవా ?

సూత్ర.—ఇట్టి రసికప్రభుసమాజము నీ కెప్పుడు దొరకును? వీరివలన వచ్చునది గదా పేరు.

నటి.— అటయిన నేనును ఆడెదను. ఏఋతువును పాడు మందువో?

సూత్ర.— వేఱుఋతువు నేల, వర్షావిరామసుభగమనీశరదృతువునే పాడుము.

నటి.— సరియే [అని పాడును.

జంఝోటిరాగము, చాపుతాళము.

వచ్చెఁ జెలియ యంచ లలియు వాసరంబులే
చెచ్చెర వికసిల్లుకల్వ శ్రీసరంబులే! వచ్చెఁ.

1. వెన్నెల బయళ్లఁ గలయు వేడ్క లిప్పుడే,
కన్నుల విల్లెక్కు వెట్టుఁ గంతుఁ డిప్పుడే. వచ్చెఁ.

2. రిక్క లెల్ల తమ్మి యంచ రేఁచు వెన్నెల
దక్క నిపుడు నెలయు లేని తఱిని వెన్నెల. వచ్చెఁ.

3. నీటిమోఁత తీఱె నింగి నెఱయ నవ్వెటో!
బోటిఁ జదలఁ బాలకడలి పొంగి కవ్వెటో! వచ్చెఁ.

4. చదురు సేయు లక్ష్మి యిపుడు సరసులం దిటఁ,
జదురు సేయు నటియు నిపుడు సరసులం దిట. వచ్చెఁ.

సూత్ర.— [విస్మయపరవశుఁడై] నిత్యము విను నాకే నీపాట యింత మోహాకముగా నున్నదే! [ఆత్మగతము] క్రొత్తగా వినువారు రసోన్మత్తులగుటకు సందేహమా? [ప్రకాశము] మన మిఁక భూమికాగ్రహణము చేయుదము రమ్ము.

నటి.— మఱచితివి గదా ఆర్యపుత్త్రా. [అని పో నుంకించును.

సూత్ర.— [ఆలోచించి] ఏమి మఱచితిని? [స్మరణ మభినయించి, ప్రకాశము] ఆ! ముద్దిమ్ము ముద్దిమ్ము.

నటి.— చెప్పినవెంటనే ఆడుదు మంటిని, చెప్పి పావుగంట సే పయినది. [అని నిష్క్రమించును.

సూత్ర.— ఎంత మోసగత్తెరా యిది!

క. కానీ, పరిశీలించెద
దీని న్నైఅజాణ నేను 1ధీవిభవమునన్,
మానుగ 2 నయసరణిన్ వి
జ్ఞాని జనార్దనుఁ డితండు సాధించుగలిన్. 3

[అని నిష్క్రమించును.

ప్రస్తావన ముగిసినది.



3. 1 బుద్ధిప్రభావముచేత. 2 నీతిమార్గమును,

# ప్రథమాంకము.

స్థలము:—ఓరుఁగల్లు, నగరము వెలుపల తోఁటలో మంత్రికచ్చేరి.

[అంతట జనార్దనమంత్రి యుపవిష్టుఁడుగాఁ బ్రవేశించును,
పరివారము ఉచితప్రకారములఁ బ్రవేశించును.]

జనార్దనుఁడు.—[ఏమో వ్రాయుచు, చింతించుచు, ఆత్మగతము] చారదృష్టిచేఁ గని యూహించినది ప్రత్యక్షమే అయినది. వచ్చినవిధమును మొత్తమునం జూఁడగా ఇది దాడియే, సంశయము లేదు. గడుసుఁదలయే నడుపుచున్నది. వీఁడు అన్నగారును ఏలినవారును లేనిసమయముఁ జూచి వచ్చినాఁడు. వీనికి మంచి వేగుదృష్టి యున్నది. వీనికి బేటికి సెలవిచ్చితినిగదా, రానీ సర్వమును బయటఁబడును. ఎట్లన—

క. వేనిన్ ధూర్తుఁ డడంచునొ
దానినె పొడగాంచు బుద్ధిధనుఁ డెప్పాటన్,
వీనులును గన్నులును [1]నను
మానమునకు సాటి గావు [2]మంత్రపరులకున్. 1

మంచిది ; అన్నగారు యాత్రకు వెడలినపుడు సవారిచెంతకు నన్నుఁ బిలిచి 'జనార్దనా, నీ చేత రాజును రాష్ట్రమును, తొమ్మిదిలక్షుల విలుకాండ్రను అప్పగించితిని. భద్రము.' అనిరి. ఈ సమస్తమును అన్నగారికి మరల నప్పగించి వారి మెప్పు పొందఁగలనా ? [వామాక్షిస్పందనము సూచించి] హా! ఏమి యీయపశకునము ! అప్పగింపను గాఁబోలుఁగదా !

ప్రతీహారుఁడు—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—[ఆత్మగతము] ఆహా! ఏమి యీశకునములు పరస్పరవిరుద్ధములు, తొలుత శ్రమ గలిగి పిమ్మట మేలు కలుగునఁట; ముందు కాలకూటము, పిమ్మట నమృతము. [ప్రకాశము] ఏమోయి ఏమి?

---

1. 1 ఊహకు, 2 మంత్రాంగమందు ఆసక్తులయినవారికి.

ప్రతీ.—తురకసర్దారు వలీఖాను శిరస్తాతోను ఒకజవానుతోను వచ్చివున్నాడు ! అటుపైన దేవరవారి చిత్తము.

జనా.—మంచిది, తోడ్కొనిరా, ఇద్దఱనుమాత్రము.

ప్రతీ—దేవరవారియాజ్ఞ.[అని నిష్క్రమించి వలీఖానుని,శిరస్తానుతోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రిగారు. [అని జనార్దనుని చూపును.

[జనార్దనుఁడు లేచి కొన్నియడుగులు వలీఖానునకు ఎదురు పోవును. వలీఖానుఁడును శిరస్తాయును జనార్దనునికి సలాములు చేయుదురు. జనార్దనుఁడు బదులు సలాములు చేయును. నౌకరులు ఆగంతులకు రెండు కుర్చీలను తెచ్చి యుంతురు.

జనా.—కూర్చుండవలయు. [మువ్వురును కూర్చుందురు.

జనా.—కుశలమా మీసుల్తానుగారికి? ఇంతదూరము ప్రయాణశ్రమనోర్చుటకు గొప్పకారణ ముండవలయును.

వలీ.—[మందహాసముతో] అల్లా కతాచ్ఛంవల్ల మా యేలినవారు ఘయాజుడ్డీన్ టోఘ్లాక్ సుల్తానువారికి కుషలమే. తమ యేలినవారు ప్రతాపరుద్రమహారాజావారికి కుషలంకదా ?

జనా.—మా యేలినవారికి కుశలమే.

వలీ.— మేము వచ్చినకారణం గొప్పదే. మాసుల్తానువారికి కాబూలువాడికి పేషావర్ పర్గణా మాకీ రావాలా మాకీ రావాలా అని తఖ్రార్ గల్గి ఇద్దర్కి నమ్మక్ అంగార్ అయింది. అటుపైన కాబూల్వాడు మాఢిల్లీ మీదికి దాడీవస్తున్నాడు. ఈసమయంలో తమయేలినవారు వ్వాయంగా దండునమ్పకొని వచ్చి మహాయపడ్వాలా అని మాసుల్తాన్వారు నానోటితో మన్వీ చేస్తున్నార్. తమరు మహారాజా వారికీ మాకీ భేటీ చేయించి మాకోరికాకి నెరవేర్పించవాలా కోర్తాం.

జనా.—మీసుల్తానుగారితో సఖ్యము మాకు సంతోషమే; కాని,మీ రాయబారమును గుఱించి కొన్ని సంశయము లడిగెదము.కోపము వహింపక తీర్పెదరా?

వలీ.—వినయత్వంగా తీర్చుతాం.

జనా.—

ఆ. సెలవు లేక మీరు సీమఁ జొచ్చుట యేల?
పగళు లెల్ల నడవిఁ బట్టు టేల?
దండు దేల? యొక్క దారి నంతయు రాక
చెదరి చెదరి యిట్లు చేరు టేల? 2

వలీ.—[ఆత్మగతము] ఎంత తేగుచూపు వుందిరా యీయనికి! [ప్రకాశము] అవశ్యం సమాధానం మన్వీచేస్తాం. వక్టి.—ముందుగా మీకీ తెల్పడానికి మాకీపుర్సత్ లేకోయింది. మాసుల్తాన్వారు 'ఓరంగోల్ల మహారాజావారికి మనమీద చాలా దయా వుంటుంది, అంటే స్నేహం వుంటుంది, ముందు తెల్పకుండా మన్ము వెల్లినా వారు ఏమీ ఆచ్ఛేపించరు లే, వెల్లండి వెల్లండి' అని మాకీ చాలా తొందర పెట్టినార్. రెండు.—మేము చల్లని దేశంనుండి వచ్చేతప్పుడు ఈదేశం యండాకి నిల్వాలేక పగల్ నడ్వటం లేదు; రాత్రి నడ్వటం. పగల్ చల్లనినీడాకోసం వాడ్వులులో మకాంచేయటం. సమాధాన మైందా!

జనా.—[ఆత్మగతము] వీఁడు గడుసువాఁడు, సమయస్ఫూర్తి కలవాఁడు. [ప్రకాశము] మంచిదిగాని, మూఁడవవిషయము.—మీరాజ్యముపైకి దాడివచ్చుచుండఁగా, ఢిల్లీకి గొప్పసర్దార్లు మీరు రాజ్యము వదలి గొప్ప దండుతో వచ్చుట ఆశ్చర్యముగా నున్నది. రాయబార మైన, ఒకరిద్దఱు గొప్పవారు కొంచెపాటి పరిజనముతో వత్తురు, ఇంత రాణువ యేల?

వలీ.—[ఆత్మగతము] అరే హమాకూ షమ్కి ఈయన బాగా కనిపట్టినాడు! పక్కామంత్రి! గోదావరికి అకతలనే మాకీ ఆప లేనందుకి చింతిస్తాడు. కానీ ఈలాగ చెప్పి చూస్తాం [ప్రకాశము] మహామంత్రులవారు చిత్తగించవాలా. కాబూల్ వాడికి ఢిల్లీకి మధ్యలో ఎందర్ నవాబులు అందర్ ఎదిరిస్తార్. అందర్ని దాటుకోని వచ్చినా, మాకి మించిన సర్దార్లు మాసుల్తాన్వారి హజారంలో వున్నారు. వారికీ వుండే దండూ మే ఈ హాల్కా దండూ

యేపాటి! ఇది వుంటే యెంత? లేకపోతే యెంత? మేము వెళ్లవలసివస్తే [చిటికవైచుచు] ఎంతలో వచ్చినాము [చిటికవైచుచు] అంతలో వెళ్లలేమా? హల్లాకరాచ్చం చల్లగా వుండి మీదయా బాగా వుండితే మాకి యేమీ తక్వా? ప్రతాపరుద్రమహారాజావార్—చాలా గొప్పవార్ అని, వారికీ పంపేది రాయబారం హల్కా వుండకూడదు అని, మాతో ఈకొద్ది రాణ్యాకి సుల్తాన్వార్ పంపినార్. మరి యీదారినే వెళ్లి ఖట్కాంపట్టుకొమ్మని అందుకోసంకూడ సుల్తాన్వార్ ఈలష్కర్ పంపినార్. అఖాబుల్వాడికి మనరాజ్యాలులో ఇంగువసాలామిస్రి అమ్ముకొని బతికేలాగ చెయ్యవాలా అని సుల్తాన్వారిది సంకల్పం. అందుకి కోసం యెక్కడెక్కడిది దండు జమా చేస్తావున్నార్. మాకి ఇక్కడిక్కి పంపినార్. నాలుగు.—రస్తుసరఫరాలు జరగవని చెదిరి చెదిరి వచ్చినాం.

జనా.—[ఆత్మగతము] ఏమి ఈనయవంచన! ఏమి ఈనయవంచన! ఇందులకు నయవంచనయే ప్రతిక్రియ. నిప్పులో వేయుటకై కట్టెలమోపును నెత్తిపై మోచుట. [ప్రకాశము] మంచిది గాని, వారిని మీసర్దారునిఁగా దండు తోడ్కొని రమ్మనెద లేమి? ఏమి యిట్టిరాయబారము తెచ్చితిరి?

వలీ.—లేదు అన్నగారూ, స్నేహంచేత సుల్తాన్వారు అప్రకారం కోరినార్. పోనీ మహాప్రభువుగారు రాకపోతే దండుకీ సర్దార్లకీ పంపితే చాల్.

జనా.—[ఆత్మగతము]

ఆ. రాజు తోడు సనిన, రాణువ నిడిసను,
నతనిఁ గట్టి, దాని నణఁచిపెట్టి,
[1]తద్విహీనగదానఁ ద్రైలింగలక్ష్మిని
[2]జీకుసింహిఁ బోలెఁ జెనకఁ దలఁపు. 3

3. 1. రాజును బాసినందునఁ అలజడినొందియున్న దానిని. 2. గ్రుడ్డియాఁడుసింగమును.

[ప్రకాశము] వారిని రమ్మనుమాట ప్రస్తావింపనుఁడు. వారముదినములలో బేటి కలుగఁ జేసెదము.

వలీ.—ఓహో ఆలాగయితే మాకీ చాలా ఆశ్చర్యం అయితుంది. మేము ఇంకా ఖట్కాన్కి కూడ పోవాల వుంది. మామీద చాలా దయా చేసి, మాకీ రేపే బేటీకి శెలవిప్పించవాలా కోర్తాం.

జనా.—[ఆత్మగతము] వీనికి ఏలినవారు నగరమున లేనిమాట తెలిసియే యున్నది. నానోట లాగుట కీటకమ్కా. కానీ [ప్రకాశము] మాయేలిన వారు ఇప్పుడు నగరమున లేరు. నేఁడో రేపో వత్తురు, వచ్చినవెనుక మీరు దర్శనము చేయచ్చును.

వలీ.—చాలా షంతోషం. తమవొక్క గొప్పతనం మేము మా దేషం లోనే విన్నాం విన్నాం. ఇప్పుడు ప్రత్యక్షంగా చూచినాం. తమరు ఇంతా షులభులు అని మేము తలచలేదు. తమపేరూ అంటే మాదేషంలో కూడా గడ్గడా గదా. ఈలాగ గదా మాదేషంలో బీబీల్ జోల ల్పాడ్తార్.—

(గేయము.) వీరయుగంధర్ పేరు చెప్పితే నీరు విడుమ ఘోడా,

రుద్రయుగంధర్ ముద్ర పెట్టితే నిద్రపోదు హాథీ,
బాలయుగంధర్ లీల పల్కితే పేలదుర తుపాకీ,
సూరయుగంధర్ బీరము వింటే పారదుర ఫిరంగీ,

ప్రౌడయుగంధర్ దాడి పాడుతా సేడవకుర బాబా

ఇలాగా ఒళ్లు గగుర్ హాయ్యేలాగ హామేషా మేము మానుల్తా న్వారు విన్న మహామంత్రి యుగంధరుల్వారికి దర్షణం చేస్కొన్న యీరోజే మాజన్మమ్కి మంచిరోజ్. ఇక మేము శెలవు పుచ్చుకోవచ్చునా?

జనా.—[ఆత్మగతము] ఏమి వీనిమోసము! వీనికి అన్నగారు దేశాంతరము పోయినమాట చక్కఁగా తెలిసియున్నది. నానోటఁ దీయుటకై యీనటన. కానీ. [ప్రకాశము] సాయెబు గారూ, నేను జనార్ధన మంత్రిని.

క. కాను యుగంధర దేవుఁడ,
నా [1]నీతివిరక్తకావ్యు ననుజాతుండన్;
మీ[2]నొడువులోకదీపపుఁ
గ్రీనీడం గాఁగ నవధరింపుఁడు నన్నున్. 4

అన్నగారు కొంచెము ప్రయాణము పోయియున్నారు, త్వరలో నేవచ్చెదరు.

వలీ.—బళిబళి, వినివున్నాం, వారికి మించినవారు తమర్. అందుకీ ఇదే నిదర్శనం. వారూ రాజా యిద్దరూ లేర్. మీరూ వున్నార్. వారికి ఇద్దరికి మీరు వకరు సమానం, గనుక నే మీకి ఖబరికి వుంచి వారు ఇద్దరు వెల్లి సార్. ఇది మాకి చాలా మంచి రోజ్. ఇక మేము శెలవు పుచ్చు కొందుమా ?

జనా.—చిత్తము. [అందఱు లేతురు.

శిరస్తా—మనకి కొంచెం నౌకర్లకి తమరు శెల విప్పించవాలా. మాకీ ఈఘూరం ప్రయాణంలో చాలామంది మధ్యమధ్య రోగం గీగంపడీ మర్గయా అవిసార్. తమరే మాకి యిక్డ వారంరోజులు పడ్తుంది శెలవిచ్చినార్. మరి యిది మాకి కొత్తచోటు. కొంచెం హాజాములు, కొంచెంచాకళ్లు దయచెయ్యవాలా వేడుతాం.

జనా.—మీకు సరఫరాలు విచారించుటకు మాశిరస్తా విశ్వాసరావును ఏర్పరించెదము.

వలీ.—చిత్తము. మరి సెలవు.

శిరస్తా —సలాం సలాం.

జనా.—సలాము, సలాము, [తురకలు నిష్క్రమింతురు.

జనా.—[కూర్చుండి] ఎవరోయి అక్కడ ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ?

జనా.—విశ్వాసరావును రమ్మను.

---

4. 1. నీతియందు తిరస్కరింపఁబడిన శుక్రాచార్యులు గల [నీతివిద్యయందు శుక్రాచార్యులను మించిన] యాయుగంధరుని తమ్ముఁడను. 2. ప్రస్తావించుచున్న.

ప్రతీ:—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించును

విశ్వాసరావు.—[వచ్చి] ఏమి దేవరవారి యాజ్ఞ ?

జనా.—విశ్వాసరావు, ఈ తురకలవిషయములో నీయభిప్రాయ మేమి?

విశ్వా.—ఈ తురకలరాక బలుమోసము; మనము మంచి జాగ్రత్తలో నుండవలయును.

జనా.—'సర్వయత్నేన తత్ కుర్యాత్ సింహో దేకం ప్రచక్షతే' అన్నట్లు సింహాక్రమణము చేయవలయును.

విశ్వా.—శరభక్రమణము గండభేరుండక్రమణము గూడ చేయవలయును.

జనా.—ఈ సమయములో అన్నగారిని రప్పింపవలసినదే.

విశ్వా.—తప్పకుండ.

క. ఆయన గాలిని బేనును,
[1]దోయముతో నటుకుc, బోగలతో గోడ లిడుc,
ఆయన ప్రయోగ [2]మభినవ
తోయజభవసృష్టి, [3]పెఱంది దగిస్వప్న మగుc, 5

జనా.—[ఇంచుక ఆలోచించి] మంచిది, ఇట్లు చేయుము.—

విశ్వా.—ఏమి యాజ్ఞ ?

జనా.—ఈక్షణమే-[అని సగములో] ఉండు చెప్పెదను. ఎవరోయి అక్కడ?

ప్రతి.—[ప్రవేశించి] ఏమి దేవరవారియాజ్ఞ ?

జనా.—సేనాపతి బేతాళనాయనింగారిని మేము చూడవలయును.

ప్రతీ.—దేవరవారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

జనా.—విశ్వాసరావూ, ఈక్షణమేమనరాష్ట్రములో నాసిక మొదలు భద్రాచలమువఱకు గోదావరి దాటుటకు లేకుండ బల్లకట్లు డింగీలు మొదలగు సాధనముల నన్నిటిని పగులcగొట్టింప వలసినది. పడవలు దోనెలు ఓడలు లోనగు యానపాత్రముల నన్నిటిని భద్రాద్రికవతల లంగరు వేయవలసినది.

5. 1. నీళ్లతో. 2. క్రొత్తబ్రహ్మసృష్టి. 3. ఇతరులప్రయోగము.

ఏప్రాణియు గోదావరి దాఁటఁగూడదు, దాఁటింపఁగూడదు. అతిక్రమణమున సంబంధించిన సకలజనులకు గ్రామగ్రామముగా తలకొట్టాజ్ఞ.— ఇట్లుగా రేవుల కన్నిటికిని, సంబంధించు నిశారకలములకును, తాఖీదులు వ్రాయింపుము.

విశ్వా.— చిత్తము. [అని నిష్క్రమించును. జనా.— చింతించుచుండును.

ప్రతి.— [సేనాపతిని దోడ్కొనివచ్చి] వారుగో మహామంత్రిగారు.

బేతాళరావు.— జయము జయము మహామంత్రిగారికి.

జనా.— [తిరిగి చూచి] బేతాళరావూ, కూర్చుండుము. ధర్మసింగూ, నీపని నీవు చూడుము.

బేతా.— [కూర్చుండి] ఏమి? ఈ తురకవానిరాకకై పిలిపించినారా?

జనా.— ఔను. మీసన్నాహ మెట్లున్నది?

బేతా.— సర్వసిద్ధము.

క. యుద్ధ మయినఁ గాకున్నఁ
[1]యుద్ధారంభముగ నుండ నుత్తరువు గదా;
[2]యిద్ధాగ్నిగ ననయము స
న్నద్ధుండ [3]శతాంగసైన్యనాగాశ్వముతోఁ, 6

జనా.— బురుజులపై, అలంగములలో, సొరంగములందు, మాటులలో, గుహాలలో, అంతటను దండు సిద్ధమా?

బేతా.— సిద్ధమే.

జనా.— దర్వాజాలకడ యంత్రములు, అగడ్తతిరుగుడులు, సర్వము సన్నాహములోనే యున్నవా?

బేతా.— ఉన్నవి. తమయాజ్ఞ యందినక్షణములోనే తురకశిబిరమును స్వప్నప్రాయము చేసివేసెదము.

జనా.— లక్షదండే గదా యిచట నున్నది?

బేతా.— అయిన నేమి? అనుమకొండలోనిలక్ష కోటకుకాపు. కడమ

---

6. 1. యుద్ధారంభములో నుండునట్లు— అనఁగా యుద్ధసన్నాహములో-సందా ఉండుమని. 2. మండుచున్న నిప్పు. 3. రథములు, సిపాయీలు, ఏనుఁగులు, గుఱ్ఱములు-వీనితో.

యేడులక్షలకును నరసింహదేవరాయలకును ఇప్పుడే హెచ్చరిక పంపెదను మఱి నామనవి.—నేను కోరఁగా కోరఁగా ఇన్నాళ్లకు యుద్ధప్రసక్తికలిగినది. కొల్పింట్లు మొదలుకొని విన్నపము—

క. భుజములు [1] రణకండూలత
గజిబిజి గొన్నయవి, యీఁటెగంటులఁ దక్కన్
భజయింపవు శాంతిన్, మము
నిజ [2]యాహవ మొసఁగుచూడ్కి వీక్షింపఁగదే. 7

మఱియు,

మ. గరడీలే, గడికోటలే, నియమనాగార ప్రఘాణంబులే,
[1]యిరవై కొల్చితి మెప్పుడున్ [2]విరతి లేకేవంశ [3]పారంపరిన్;
అరికంఠాద్రిగుహా వినిస్సరదసృక్ప్రాగ్భార వీరాపగా
తరణక్రీడకు నొక్కయాటవిడుపుం దామియ్యరాదే ప్రభూ?

అని.—యుద్ధమునకాజ్ఞ యీవలయు నని నేనుప్రార్థించుచున్నాను.—అటుపైని తమచిత్తము.

జనా.—

ఆ. సందడింప కీవు సన్నాహమున నుండు,
నవసరమున [1]ముదల యంపువాఁడ,
అన్నగారు లేమి [2]యవనీపతియు రామి
[3]కొఱలు గాక మనము కూల్త మరుల. 9

---

7. 1. యుద్ధముకొఱకైన దురదచే 2. ఆహవము=యుద్ధము.

8. గర...బులే = తాలీముఖానాలే ఎల్లలలో నుండుదుర్గములే చెఱసాలల ముంగిళ్లే. 1. ఇలుగా. 2. విరామము. 3. పరంపరగా. అరి కంఠ అద్రి గుహా వినిస్సరత్ అసృక్ ప్రాగ్భార వీర ఆపగా తరణ క్రీడకున్-శత్రువులయొక్క గొంతుక్రోవు లనెడు కొండగుహలనుండి వెలువడియెడు నెత్తుటి మొత్తములనెడు శూరోచిత నదులయందు ఈఁతయాటకు.

9. 1. ఆజ్ఞ. 2. రాజు. 3. లోపములు. అరులన్ కూల్తము=శత్రువులను నాశము చేయుదము.

జేతా.—చిత్తము. [అని నిష్క్రమించును. జనా.-జాబులువ్రాయును.

విశ్వా.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

జనా.—విశ్వాసరావూ, అంతయు సిద్ధమా?

విశ్వా.—సిద్ధము. ఇవిగో తాఖీదులు, ఒక్కొక్కటియు అంచెల మీఁద చేరవలసిన తేది గడియ, జవాబు తెచ్చి ఇక్కడ అప్పగింపవలసిన తేది గడియ కూడ నమూదు. తమ పేరాహారు దయచేయవలయును.

జనా.—సంతోషము. [అని మొహరిచ్చును. దూరమున జవాను ముద్రించును.

జనా.—[విశ్వాసరావుచేతికి ఒక జాబిచ్చుచు] దీనిని అన్నగారికి బేగీరావు టపామీఁద పంపవలయును. వారు వచ్చుటకు బేగీరావుటపా ఉంపవలయును. [మఱియొక జాబిచ్చుచు] ఏలినవారికి దీనిని ఎచ్చట నున్న నచ్చటికి వెదకుకొనిపోయి యిచ్చునట్లు టపా పంపవలయును.

విశ్వా.—చిత్తము.

జనా.—తురకకు నౌకర్లు చేకర్లను వలయునేఁట; ఎందులకో ఎఱుఁగుదువా?

విశ్వా.—వేగుకొఱకు.

జనా.—మనవేగులను పంపుదము. ఈవ్యవహారము ఇసుకతక్కడ గాఁడు పేఁడ తక్కెడగాఁడుగా నున్నది.

విశ్వా.—అప్పుడే హెచ్చరించియున్నాను, సమ్ముఖమునకుఁ బంపుదునా?

జనా.—పంపు, అందఱను మనవాండ్రనే పంపు.

విశ్వా.—చిత్తము, అందఱు మనవాండ్రే. హిందూస్తానీ చక్కఁగా వచ్చినవారే. వారిని తురకలకు చేయవలసిన నౌకరిలక్షణములతో నే పంపెదను. [జవానును నిర్దేశించి] ఏమోయి మొహర్లయినవా?

జవాను.—అయినవండి. [అని తాఖీదు లిచ్చును.

విశ్వా.—[పుచ్చుకొని యాత్మగతము] సుదర్శనమునకు అంచులెన్నియో యివన్ని. దానియంతపని నివియే చేయును గాక. [ప్రకాశము] పోయి వీనిని రవానా చేసెదను.

జనా.—మంచిది, కానిమ్ము. [విశ్వాసరావు నిష్క్రమించును.

జనా.—[స్వగతము] ఇంక నేమి చేయవలయును? ఆ! జ్ఞప్తియైనది. ఒకప్పుడు అన్నగారు చెప్పియుండిరి గదా, మా చాకలిని పేరిగానిని చూపి, 'పరమమూర్ఖుఁడైనను వీడు రాజుపోలిక వాఁడు, ఎప్పుడైనగొప్పయిక్కట్టులో విశేషముగా నుపయోగపడును.' అని. వాని నీసమయములో మాయింట నే ప్రచ్ఛన్నముగా నిలిపెదను. అన్నగారు వచ్చి యుపయోగింతురుగాక.

ప్రతీ.—జయము మహామంత్రిగారికి. ఎవరో చాకళ్లు కొందరు మంగళ్లు కొందరు తమరు పిలిపించినారని వచ్చియున్నారు.

జనా.—రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నిష్క్రమించును.

(అంతట చాకళ్లుగ్గాను, మంగళ్లుగాను చారులు ప్రవేశింతురు)

నాకర్లు.—దణ్ణం మహప్పెబో దణ్ణం.

జనా.—ఓరీ, చాకళ్లు, మంగళ్లు, నూఱునూఱుతరములుగా మీరు ఎవరి యన్నము తిని బ్రతుకుచున్నారో ఎఱుఁగుదురా?

మంగలి యొకఁడు.—అయ్యో మారాజా, అది యరక్కపోతే మాజల్మ మెందుకు మహప్పెబో ! అంతామీయన్న మే.

చాకలి యొకఁడు.—ఒకయన్న మేంటి, మాయన్నీ మీమే, మా పానాలు మీపానాలే, మాకొంపలు మీకొంపలే, మావోల్లు మీవోల్లే, మా గుడ్డలు మీగుడ్డలే, మాబిడ్డలు మీబిడ్డలే, మాపెళ్లాలు మీపెళ్లాలే, మాయన్నీ మీయే.

జనా.—మూర్ఖా, మూర్ఖప్రసంగము చేసెద వేమిరా ?

ఆచాకలి?—బుద్ది బుద్ది [అని యితరులచాటునకుఁ బోయి, జనాంతికము ఆమంగలితో] ఏంటిరా నానన్నాతప్పు?

అనుంగలి.—మాపెళ్లాలు మీపెళ్లాలే యేంట్రా సాకలెదవా?

ఆచాకలి.—[సవిస్మయము] అల్లదా! ఓరి నానోటొచ్చేశిందిరా! ఓయిబాబో! మరి కోలాగ నూర్తే మాట యెందూర మెల్లిందిరా! [అని మంత్రిముందఱ సాగిలఁ బడి] నానో టొచ్చేశింది మారాజా! నానాలిక కోంయ్యంచెయ్యండి బాబూ.

జనా.—మన్నించితిమి లే. ఓరీ మామాటమీఁద ఇప్పుడు మీరు పోయి తురకలను కొన్నాళ్లు కొలువవలయును.

నాకర్లు.—మీరు గోతులో పడమన్నా పడతాం, అగ్గిలో ఉరకమన్నా ఉరుకుతాం.

జనా.—చక్కఁగా కొలువవలయును విశ్వాసరావు జవాను నిచ్చును ఆ జవానుతో పొండి.

నాకర్లు.—తురకలపని అయిందనిపించి మరీ వొస్తాం బాబయ్యా! మాకు మేమే శెప్పుకోవట మెందుకు? ఏరోజు కారోజుకి ఏగడి కాగడికి తమరికి తెలుస్తానే వుంటది లెండి. అంతా యిశ్వాసరావుగారి యిశ్వాసం.

జనా.—మీరు ఏలినవారి విశేషానుగ్రహము పొందుట కిది సమయముగదా?

నాకర్లు.—శిత్తం మహాప్పెబో.

జనా.—మాసొంతచాకలిని పేరిగానిని వానిపెండ్లాము ఎల్లిని కూడ, మీకు సాయ ముంచుకొండి. వారిచే గొప్పసర్దార్లకే పనిచేయింపుఁడు. వాండ్రు చాకలిపని మిక్కిలి బాగుగా చేయుదురు.

నాకర్లు.—శిత్తం మహాప్పెబో.

జనా.—మఱి మీరు పోవచ్చును.

నాకర్లు.—దణ్ణం, దణ్ణం, దణ్ణం, దణ్ణం, [అని పరిక్రమింతురు.] మొగసాల కొచ్చినాం. ఆయన కవుపడంగందా? [అని వెనుకకు తిరిగిచూచి] అవుపడం. మ రెవ్వరూ లేరు గందా? [అని కలయఁజూచి] లేదు.

[ఈనౌకర్లు ఈ క్రింది తమతమవాక్యములను ఒకని మించి యొకఁడు పాడుదురు. అట్లు తాము పాడు దానిని తమలో నొకనిమీఁద అభినయించి చూపుదురు.

చాకలి యొకఁడు.—నాను ఈ తురకోళ్ళని ఉదికేస్తానురా.

,, నాను ఈళ్ల నందఱిని యిస్త్రీ శేస్తానురా కొండన్నా.

,, నాను శింపేస్తానురా యెల్లన్నా.

,, నానీళ్ల నందఱిని యెల్లాయిలో యేస్తానురా నాగన్నా.

జనా.—ఎవరక్కడ ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారియాజ్ఞ ?

జనా.—పోయినచోట వీరికి హిందూస్తానీ యేమైన వచ్చునేమో అడిగిరా.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ. [అని నౌకర్లవైపు వచ్చును.

మంగలియొకడు.—నానీతురకోళ్ల నందఱిని డొక్కేస్తానురా.

,, నా నీళ్లబుఱ్ఱలు రసగుండ్లలాగ తళతళ మెరిసేలాగ డోకేస్తానురా పుల్లన్నా.

,, నాను కోమటిశ్యామర్ల మామిడికాయి వూరగాయి లాగ యీళ్లబుర్రకాయల్ని గీశేస్తానురా పీసన్నా.

,, నాను మల్లీ యెంట్రిక మొలవకుండా తరిమెన పెడతాన్రా నాయినా.

మంగళ్లు కొందఱు.—[పాటమాని అతిత్వరగా] నాను చెక్కేస్తా; నాను తరిగేస్తా; నాను కోశేస్తా; నాను తవ్వేస్తా.

ప్రతీ.—[కొంచెము సమీపించి] ఒరే యేమిరా ? మహామంత్రిగారొకమాట అడగమన్నారు.

చాకలి ఒకఁడు.—[అనాకర్ణితకముగ, మరల పాటగా నా నీళ్ల గడ్డాల్ని దియిటీలు శేస్తానురా.

,, నానీళ్లబుర్రలతో డోర్యాలసిద్దెలు శేసుకోంటానురా.
,, నాను యీళ్లశెవ్వులని యిలాయి శేస్తా.

మంగలి యొకఁడు.—నానీళ్లబుర్రలు ఉడు కోయిస్తా.
,, నానీళ్ల బొర్రలు నగారా తాసామరపా బేరీ వోయిస్తా.
,, నానీళ్ల పీకలన్నీ ఊదేస్తా. [అని యొకని మెడ పట్టుకొని చెవిలో కీ కీ కీ అని యూఁదును.

ప్రతీ.—[ఆగ్రహముతో మరల] ఏమిరా యీయల్లరి ?, ఇదేమి దివాణ మనుకొన్నారా, రే వనుకొన్నారా ?

నౌకర్లు.—[తిరిగిచూచి] ఏంటయ్యా? మామీద కోపం శేసుకుంటావు?

ప్రతీ.—పోయినచోట మీకు యిందూస్తాని వచ్చునా ?

మంగళ్లు.—[పాడుచు] యీ సాకలోళ్ల దయిటీ లన్నీ యెలిగించి యెతికినా, మా పొట్లల్లో యెంట్రికముక్కంత యిందూస్తానీ దొరకదయ్యా దరమశింగూ.

చాకళ్లు.—[పాటగానే]యీమంగలోళ్ల కత్తు లన్నిటితోటి మాపొట్ట లన్నీ కోశి యీళ్ల శిప్పాలతోటి యెత్తినా గుడ్డ పేలికంత యిందూస్తానీ వుండ దయ్యా దరమశింగూ.

ప్రతీ.—ఏమిరా యీతలపొగరు మీకు ?

నౌకర్లు.—ఏడవమంటావా మారాజా? మాపని యెక్కడయినాపావే. యెల్ల కుంటే మీరు సంపుతారు. యెత్తే ఆళ్లు శెప్పాలిశిందే లేదు. గుండె నిబ్బరం శేస్కున్నాం. ఆడతా పాడతా యెల్లిసస్తాం. ఆయెన్క మాపెళ్లా లేడుస్తారు, మీరు నవ్వండి.

మంగళ్లు.—[చాకళ్ల వీఁపుమీద తాళము వాయించుచు]

పాట.

లాయిరే గంజాయిరే సారాయిరే మాహాయిరే,
లాయిరే గంజాయిరే సారాయిరే మాహాయిరే.

సాకలోళ్లు సచ్చి పోతే, మంగలోళ్లు మాశి పోతే,
శిల్లిగవ్వ శెల్లనంత శీమ శేశేసామి కంత. లాయిరే,

చాకళ్లు.—మీ మంగలి డబ్బంక బుద్ధి పోయింది గాదురా! 'సచ్చి పోతే' అని రా పాట్టం? [మంగళ్ల వీఁపుమీఁద తాళము ఉదుకుచు]

లాయిరే ... ... ... మాహోయిరే.
సాకలోళ్లు సావకుంటే, మంగలోళ్లు మాయకుంటే,
శిల్లిగవ్వ శెల్లినంత శీమ శేశే సామి కంత. లాయిరే

మంగళ్లు.—మీసాకలి బుద్ధికాలా, యీపులు యిరిగి పోయినయిరా, శేవుతాళం యేశినార్రా గాడిదలూ! [అని వీఁపు తడవుకొందురు.

ప్రతీ.—కానీండి మీతాళం పట్టిస్తా.

నౌకర్లు.—అయ్యకి కోపం వొచ్చింది, యిక సంపేయిస్తాడు, పారి పోదాం రండిరా రండి. [అని నిష్క్రమింతురు.

ప్రతీ.—[మరలి మంత్రిని దఱిసి] దేవరా, వాళ్లకు హిందూస్తానీ ఏమీ రాదన్నారు. మఱివాళ్లు పెంకితనం వేళాకోళం వెక్కిరింతగా జవాబు చెప్పినారు దేవరా.

జనా.—నీవు వారలను చీవాట్లు పెట్టలేదా?

ప్రతీ.—'మా కెక్కడయినా చావే, అందుకోసం ఖుషిగానే పోయి చస్తాం' అన్నారు దేవరా.

జనా.—[ఆత్మగతము] పక్కాగడుసువాండ్రు. పరిచితుఁడైన ప్రతీహారియుం గనిపట్టనేరని యట్లుగా వేషభాషలు మార్చుకొని యిట నిట్లు వ్యవహరించుటచేత అట నిజకార్యములందు మిగుల జాగరూకతతో మెలఁగుదు మని తెలిపికొన్నారు. [ప్రకాశము] నీచవృత్తిమూర్ఖులు. నీపని నీవు చూడుము. [ప్రతీహారి నిష్క్రమించును.

జనా.—ఈ సమయమున మా సహాధ్యాయి చెరుముకిశాస్త్రులతోడ్పాటు నలవఱచుకొనవలసినదే.

[నేపథ్యమున శంఖధ్వని.]

జనా.—అహో! లేవ సమయ మైనది!

చ. సరసిరుహాస్యకీలుజడచందమునన్, [1]మరువింటిభాతిఁ, [2]బ్రే
ము రమణఁ, [3]కీచకంబువలె, భోగివరేణ్యుని మేనిచాడ్పునన్,
వరుసను శంఖరావము దివంబునఁ బర్వెడుఁ దొల్లి తొల్లి వి
స్తరిలి కృశించి [4]యేచి సమతం బరిపాటిగఁ దగ్గి సన్నమై. 10

ఇఁక నిప్పటికి కచ్చేరి సరి. [అని అందఱు నిష్క్రమింతురు.



10. సరసిరుహ ఆస్య=తామరవంటి మోముగలది-సుందరియనుట. 1. చెరకుగడవలె. 2. బెత్తమువలె. 3. బొంగువెదురువలె. భోగివరేణ్యుని=అనంతునియొక్క. రావ...దున్=ధ్వని ఆకాశమందు వ్యాపించుచున్నది. 4. ఎదిగి.

# ద్వితీయాంకము.

స్థలము:—ఓరుగల్లు, పఠాణీశిబిరము, వలీఖానునిడేరా.

[అంతట వలీఖాను, ఖుస్రూఖాను ముస్తఫాఖాను, ఫిరోజ్‌ఖాను, ప్రవేశింతురు.]

వలీ.—ముస్తఫాఖాన్, ఏలాగ యీదేశం పట్టడానికి నీకీ యిష్టం?

ముస్తఫా.—సర్దార్ సాహేబ్, రాజా వచ్చేతల్కి, మన్ము పట్నం పట్టి వేస్తే రాజా యిటువైపు మరి రానేరాడు. ఖజానా మన చేతులో పడి పోతుంది, యెల్పలి దండూకి డబ్బులేక లడాయి శెయ్యడానికి వీలు వుండదు. అడ్డుఅడ్డుగా మన్ము అన్ని పర్గణాలు కొట్టవచ్చును.

వలీ.—ఖుస్రూఖాన్, నీకీ యిష్టం యేలాగ వుంది ?

ఖుస్రూ.—సర్దార్‌సాహేబ్, నాకీ యిష్టం ఇది. పట్నంలో దండూ విస్తారం వుంది, ఖజానా విస్తారం వుంది, రస్తు విస్తారంవుంది. వఖుషంవచ్చర మైనా బైటిది దమ్మిడి సామాను అక్కర్లేకుండ ముట్టడికి నిలుస్తుంది. అనుమ కొండలమ్కర్ ముట్టడి దండూకీ చుట్టుకొంటుంది. నూటికి తొంబైతొమ్మిది దాన్కి రాజా వ్వయం నడిపిస్తాడు. అప్పుడు మనఘతి హాదకత్తులో వక్తగతి అవుతుంది. అందుచేత సాహేబ్ నాకీ యిష్టం యేమంటే, మన్ము దండంతా నడ్పుకొని, రాజా యెక్క వున్నాడు అక్డ వెల్లి, రాజాకివేటశిబ్బంది కొంచెం వుంటుంది గన్క, ఖుశిభంగా రాజాకి పట్టుకొని, దేషం హాంతా స్వాధీనం పుచ్చుకొని, యిక్డ యీదండుతో తమరు నబాబ్ మేము గులాంవుండవచ్చును.

వలీ.—ఫిరోజ్ ఖాన్, నీకీ యిష్టం యేమి ?

ఫిరోజ్.—ముందు రాజాకి పట్టి సఫాయి శేస్తే తర్వాత ఓరంగోలుకి పట్టవచ్చును. రాజా హాసలే లేకుండా వుండే తప్పుడు, తమ్ముడు కూడా లేనప్పుడు, పెద్దమంత్రి కూడా లేనప్పుడు, యెవడూ యెవడికికోషంయుద్ధం చేస్తాడు ? మనకీ రాజధాని పరగణాత్ దేషం షర్వం ఛణంలో స్వాధీనం అవుతుంది.

వలీ.—మీరు వఖ్రు చెప్పినదానికంటే వఖ్రు చెప్పింది ఫ గా వుంది. నామతం యేమంటే—

దౌవారికుఁడు.—[ప్రవేశించి] సర్దార్ సాహేబ్, బొమ్మణ్ వఖ్రు దర్శనానికి వచ్చివున్నాడు, 'కొంచం వుండు' అంటే, 'వుండడం లేదు' అని గడ్బిడా చేస్తాడు. నేను అడ్డం నిలిస్తే నాకి బైటిదర్వాజా అవతలపడేలాగ విసిరివేసినాడు. సాహేబ్, వాడు చూడడానికి బొమ్మణ్, తొయ్యడానికి సింహం వున్నాడు! నేను పాడిచెయ్య వాలా వుంటాను గానీ...

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

చెకు.—పోరా, పూర్వసువాసినీ! నీవా నన్ను పొడుచువాఁడవు? [ఆత్మగతము] నేనే చెకుముకి నఁట, నీబోంట్లను వేన వేలను భస్మీకరింపనా? [సైనికులను జూచి, వలీఖానునిఁ జూచి, ఆత్మగతము] వీండ్రందఱు నన్నుఁ జూచుటయు వీనిముఖము చూచుటయు. వీఁడే వీరిలో ప్రభువు. [వలీఖానుని నిర్దేశించి, ప్రకాశము] సలాము వలీఖాను బహద్దరుగారు, మీకు అఖండ దిగ్విజయ మున్నది.

ఉ. సాహెబ, 1నీకు జంద్రుఁడు మషాలు, దినేంద్రుఁడు డాలు, వాలు నా
లోహితుఁ, 2డుక్తిగీష్పతి, 3యలుప్తవిలుప్తదృశుండు మంత్రముల్,
రాహువు 4పట్టుఁ, గేతువపరాజిత 5కేతువు, 6సౌమ్యుఁడాప్తుఁడుల్,
సాహస 7మర్కజుండు, నయి 8శాశ్వతిక ప్రభుతల్ రచించుతల్. 1

---

1 1. చంద్రునికన్న వేఱు దివిటీ లేక అల్లాడెదవని ధ్వని. ఇశ్లేషపద్య మంతటను గూఢాభిప్రాయము నూహించుకొనవలయును. లోహితుఁడు=అంగారకుఁడు. ఆలోహితుఁడు కొంచెము ఎఱ్ఱనివాఁడు, కొంచెమే నెత్తురంటినట్టిది. సరిగా శత్రుసంహారము చేయఁ జాలనిది— అని ధ్వనితము. 2. మాట బృహస్పతి-వాక్పటిమయే గాని క్రియా కౌశలము ఉండదని గూఢ భా. 3. పోయిన కన్నొక్కటి పోని కన్నొకటియు ఎవనివో ఆతఁడు-శుక్రాచార్యులు-మంత్రాంగము అరగ్రుడ్డిగా నుండు నని గర్భితార్థము. 4. నిన్ను

వలీ.—[ఆత్మగతము] అరే, ఇత నెవరు ? నాకీ యేలాగా తెల్సు కొన్నాఁడు? జనార్దనమంత్రి యేమయినా పంపినాడా? [ప్రకాశము] ఎవరు పంతులూ, మీరు ?

చెరు.—మేము పంతుళ్లము గాము. మేము జోస్యులము, శాస్త్రుల వారలము, పేరు యమధర్మరాజశాస్త్రులు. నాబాల్యములో,

క. ఆట నరఁటిపండుగ నా
ప్రేటుఁబిడుగు వడినప్రాణి వెంటనె నీల్గున్ ;
సాటికి విబుధులు నను నవ్వు
లాటగ యముఁ డనఁగ నాకు నదె పే రయ్యెన్. 2

వలీ.—మీకి మంత్రిగారు పంపినారా యేమి?

చెరు.—వాఁడెవఁడు నన్నుఁ బంపుటకు? వాఁడుపంపిన నే నేలవత్తును? నే నేమి వానినౌకరనా? నేను నాస్వబుద్ధి చేత నే వచ్చితిని.

వలీ.—[ఇతరులం జూచి] దివానా క్యా?

చెరు.—దివానా కచ్చేరి తీరి యున్నాఁడు.

ఇతరులు ముప్వురు.—[నవ్వి] మనభాత్ తెలియదు. దివానా అంటే, దివాన్ అనుకున్నాఁడు.

చెరు.—ఉన్నమాటకు నవ్వ నేల ?

వలీ.—[మరల నవ్వి] కూర్చోండి సాస్తుర్లూ, మీరు చాలా తమాషా మనిసి వున్నార్. మీకి మేము ఫలానా యేలాగ తెల్సింది ?

చెరు.—మఱి నా దేమి వంకాయల జోస్యము బెండకాయల జోస్యము అనుకొన్నారా?

---

పట్టు నని గూఢ భా. అ+పరాజిత = ఓడినది కాని - అ+పర+అజిత=ఇత రులచే జయింపఁబడనిది కానట్టి, 5. కేతువు=జెండా, 6. బుధుఁడు=మెత్తని వాఁడు-యుద్ధమునకు పనికిరాఁడు-అనిధ్వని, 7. అర్కజుండు=శని-శని వంటి వాఁడు గాన సాయెబు సాహసము లంటువడు నని ధ్వని. అర్కజుఁడు యముఁడుం గావున, 8. నీవు నీసాహసముచేత చత్తు వనియు - భావము.

వలీ.—మీరు సెలవు లేనిదీ మాసభలోకి రావడం న్యాయమా? .....

చెరు.—ఓహో! ఏమి పరోపదేశపాండిత్యము! మీరు ఎవరి సెలవు మీఁద వచ్చినారు ఈ ప్రతాపరుద్రుని రాష్ట్రములోనికి? ఎవరిపని [illegible] వారు ఆలాగే అనుకొండి. చూచినారా నాజోస్యముదెబ్బ?

వలీ.—[ఆత్మగతము] ఆరే 'ప్రతాపరుద్రుని' అంటాడు. 'గారూ' చెప్పలేదు. 'రాజా' చెప్పలేదు. ఇత డేమి అనుకొన్నాఁడో? [ప్రకాశము] అయ్యా, మీరు సామాన్యప్రజోస్యులు, ఏకాకి, మీకి యింత సాహసం మంచిది వుంది లేదు. పహారా జవాన్ పాడిచేసివుంటే మీపని యేమై వుండును?

చెరు.—నేను ఏమాన్యప్రజోస్యుఁడనుం గాను. నాకు మాన్యాలు లేవు. సంపాదించుకొనుటకే మీదగ్గఱకు వచ్చితిని. నేను ఏకాకినిం గాను, హోష్ అన్న పోను. పాడి చేసిన పొట్లము దమ్మిడి. నేనే యమధర్మరాజనే నన్ను పాడిచేయువాఁ డెవఁడు? నామీఁద మొదట ఆయుధములు ప్రయోగించువారు అయిదుగురు నాచే చత్తురు, వారిచే నేను చావను అని నాజాతకము. ఆపైమాటచూచుకొందము. పంజా పట్టిన, నేను విఱిచినచేయి ఎప్పటికి కుదురునో నేనే చెప్పవలయుఁగదా.

వలీ.—[కుతూహలముతో] అయితే సాస్త్రుల్లూ, మీరు వచ్చినపని యేమో తచ్ఛనం చెప్పివెళ్లండి, మేము జరూర్ పనిలో వుంటాం.

చెరు.—ఇంతేగదా మీశక్తి? నాపని మీకు తెలియదు మీపని నేను చెప్పెదను, చూడుఁడు—'రాజును ముందు పట్టుదుమా, రాజధానిని ముందు పట్టుదుమా?' అని మంత్రాంగము చేయుచున్నారు. [ఖానులు ఒకరిమొఁగ మొకరు చూచుకొనుచున్నారు.

చెరు.—మఱి నేను వచ్చినపని చెప్పుదునా?

వలీ.—చెప్పండి సాస్త్రుల్లా చెప్పండి.

చెరు.—[ద్వారికుని నిర్దేశించి] [illegible]నుఁడు. లేదా, నేను పంపుదునా?

వలీ.—జావు రే జావు. [దౌవారికుఁడు నిష్క్రమించును.

చెకు.—[దౌవారికు నుద్దేశించి] ఓరీ, ఇఁక సెప్పుడును నన్నడ్డకు. తమరు ముందుగా నాకొకఖరారు చేయవలయును. నాకు ప్రాణముమీద ఆశ లేనేలేదుగాని,

ఖానులు.—[ఆత్మగతము] అది తెలుస్తూనే వుంది.

చెకు.—మానముమీఁదమాత్రము ఆశ బలిష్ఠము.

ఖానులు.—[ఆత్మగతము] అదిన్ని తెలుస్తూనే వుంది.

చెకు.—జోస్యము రెండుభాగములు, సిద్ధాంతము విద్ధాంతము అని, అందులో నేను మొదటిభాగముమాత్రమే చదివితిని. ఈ ప్రతాపునిజోస్యుఁడు రెండవభాగముమాత్రమే చదివినాఁడు.

వలీ.—[ఆత్మగతము]మల్లీ 'ప్రతాపుడు' అని బలేహగౌరవం చెప్తాడు!

ఫిరోజు.—మీరెందుకు రెండుభాగాల్ సద్వుకుండా జోస్యం చప్డాన్కి వస్తారు హూకాడికి?

చెకు.—రెండవభాగము చదివినయెడల మీదగ్గఱకు ఎవరు వత్తురు?

ఖుస్రూ.—అరెండో బాఘం మాకీ పన్కిరాదా?

చెకు.—మఱి అదేమో దానిస్వరూపము చెప్పెదను, పనికి వచ్చునో రాదో మీరే తెలిసికొండి.

వలీ—క్యారే! చాపఅని ముసలినోట చెయ్యిపెట్టినాం. [శాస్త్రి నుద్దేశించి]మీ రెండోబాఘం అంతా ఇక్కడ నప్పగిస్తారా యేమి సాస్తుర్లూ?

చెకు.—ఆరెండవభాగము నాకు రాదయ్యా అనుచుండఁగా దాని నప్పగించెదనని భయపడెద రేమయ్యా!

వలీ.—పోనీపోనీ, అయితే చాల సంతోషం. అది మాపుణ్యం.

చెకు.—ఆ రెండవభాగ మే మనఁగా?

వలీ.—మల్లీ ఆరెండోబాఘం ఆరంభించినావే సాస్తుర్లూ!

చెకు.—అయ్యా, రెండుమాటలు విని తర్వాత ఆక్షేపింపుము.

వలీ.—మఱి యేమిగతి? కాని.

చెరు.—ఆరెండవభాగము మొదటిభాగమును ఖండించును, మొదటి భాగము రెండవభాగమును ఖండించును, రెంటును చదివినవానికి మొత్తము జ్యోత్స్యము సున్న.

వలీ.—హల్లా! హల్లా!

చెరు.—శివ శివా! శివ శివా!

వలీ.—సాస్తుర్లూ, మాకీ ఆమొత్తం సున్న చెప్పి వెల్లండి చాలును.

చెరు.—అట్లే చేసెదను. ఒకటొకటిగా చెప్పి మొత్తము చేసి సున్న చేసి పోయెదను. కనుక, విను, ఆరెండవభాగము మరల రెండుభాగాలు.

వలీ.—హల్లా! హల్లా! ఏమి గహచారం వచ్చిందిరా యీరోజ్ !

చెరు.—శివశివా ! శివశివా! ఏమియోగదినమురా యీదినము ! ఆరెండుభాగాలు ఏవనఁగా—(1) ఉన్నది లేనట్టు చెప్పుట, (2) లేనిది ఉన్నట్టు చెప్పుట.

ఖానులు.—[ఆశ్చర్యపడి, కడుపులు పట్టుకొని నవ్వుచు] ఆరే బలే తమాషా బామ్మణ్! బలే తమాషాబామ్మణ్!

చెరు.—తమాషా బ్రాహ్మణుఁడను నేను గాను, తమాషాబ్రాహ్మణులు మీదేశపు గౌడబ్రాహ్మణులు,

ఖానులు—కౌనీ పండత్ సాబ్.

చెరు.—మొదటిభాగ మే మనఁగా, అదియు రెండుభాగాలు,

వలీ.—(1) ఉన్నది ఉన్నట్టు చప్పడం, (2) లేనిది లేనట్టుచప్పడం, అదేనా సాస్తుర్లు సాబ్?

చెరు.—సందేహ మేమి? ఆహా! ఆవులించినఁ బ్రేవులు లెక్కపెట్టు బుద్ధిగాని సామాన్యమా! మఱి మొదట అవసరపడ్డారే? ఇది సిద్ధాంతము, అది విద్ధాంతము.

ఖానులు.—అచ్ఛా! అచ్ఛా!

చెరు.—మఱి యిప్పుడు చెప్పుండు, మొదటిది మాని రెండవది మాత్రము చదివి వచ్చిన మీకు పనికి వచ్చునా?

ఇత. ముష్వ.—నకో నకో.

చెకు.—మఱి నేను కోరుకోరికను మీరు నెరవేర్చినను మానినను సరియే గాని, నేను మీకడకు వచ్చుట ఈపట్టణమువారి కెవ్వరికిని ఈదేశపు హిందూప్రాణికి ఎవ్వనికిని మీరు తెలియనీయఁగూడదు. ఇది నేనుకోరినఖరారు. ఈఖరారు మీరందఱు చేసిన, నాకథ నేను క్షణములో ముగించిపోయెద. మహారాజవానును నేనే సర్దుకొనెదను లెండి.

ఖానులు.—ఖరార్ సాస్త్రుల్గా, ఖరార్. మేం ఎవరికి చెప్పం.

చెకు.—మఱి వినుండి. ఆస్థానపుజోస్యుఁడు అది చదివినాఁడు. ఈస్థానపుజోస్యుఁడను ఇదిచదివితిని. ఇందువలన అతనికి నామీఁద బద్ధద్వేషము కలిగినది; మనస్సులో నే దాఁచుకొన్నాఁడు. 'యాచకో యాచకః శత్రూ' తెలియదా? నేను ఆఱుసంవత్సరాలు అతని నాశ్రయించితిని, రాజదర్శనము చేయింపు మని. చేయించినాఁడు గాఁడు. ఒకనాఁడు తెగఁబడి రాజునెదుటికిఁ బోయి ఆశీర్వచనశ్లోకము పలికితిని. అంత నతఁడును ఈజోస్యునిమాటమీఁద నన్ను 'ఏమి యీబోడిబాపనవాని సాహసము!'అని లిట్టినాఁడు. అంత నేనును 'బోడియే నీపాగ రణంచును లే!'అని ప్రతిజ్ఞ చేసి వెడలి వచ్చితిని. బ్రాహ్మణుఁడ నని రాజు నన్ను మఱేమియు చేయలేదు. యమధర్మరాజనని బంట్లెవ్వరును నామీఁదికి రాలేదు. మీరు మహాప్రాజ్ఞులు, 'ముందు నీ కీయవమానప్రాప్తి జోస్యమువలన తెలియలేదా?' అని యడుగ రేమి?

ఇత. ముష్వ.—అచ్ఛా! అచ్ఛా! అదే అడ్గవాలా వుంటాం.

చెకు.—ముందు తెలిసినందున నే తప్పదుగదా అని పోయి అనుభవించితిని.

ఇత. ముష్వ.—అచ్ఛా ! అచ్ఛా ! వహావ్వా ! వహావ్వా !

చెకు.—నా ప్రతిజ్ఞకూడ జోస్యమువలన చేసినదే.

ఖానులు.—అచ్ఛా ! అచ్ఛా !

చెకు.—మఱి నాప్రార్థన యేమనఁగా,

క. మీ కేఁ జెప్పెద జోస్యము,
నాకున్ సుల్తానుదర్శన మిపుఁడు మీరల్,
లోకేశు నతనిఁగాని చే
నీ 1కుటిలమతుల 2ఖల్తారు నిర్భర 3తుడిలోన్. 3

ఇత. ఖుష్వ్య.—[సచమత్కారము] మీకి మేం జోస్యులూవుంచుకొంటే మాకిషిద్ధాం,జోస్యం చెప్తారా, తెక్సైతేదానిషేర్ రాలేదు. ఆరెండో భాఘంచెప్తారా?

చెకు.—ఆహా! అహా! మీకే మహా క్షణములోనే యింతపరాకు? ఆరెండవ భాగము నాకు రాదయ్యా!

ఖుస్రూ.—ఔను; ఔను, అచ్ఛా, అచ్ఛా.

వలీ.—మంచిదీ. మీకీ మేం అవలంబిస్తే మాకీ యేమీ ప్రయోజనం? మీరు జరిగేది చెప్తారు. దానిచే ముందు మేం ఎర్గినా అదే జర్గుతుంది. ఎర్గకా పోయినా అదే జర్గుతుంది. మీజోష్యంవల్ల మాకీ యేమి కిఫాయత్?

చెకు.—అటయిన జరుగనిదానిని చెప్పవలయునా? ముందు తెలిసిన అసంతోషమే అధైర్యమే ఫలము. మఱి,

మ. నను రక్షింపుఁ డటంచు డాయును మిము, న్నాకింక మేలేయగున్,
బనిగొందు న్నృపు భక్తుఁగా, నతఁడు న న్బాటించుఁబో వేల్పుఁగా,
మును మున్వానికి నన్ని జోస్యపువహిన్ బోధించి యాప్తుండ నై,
వెనువెంటన్ మెడఁబట్టి గెంటెడఁ జమీ విద్ధాంతి రాద్ధాంతినై. 4

వలీ.—అప్పటికి మీ ప్రతిజ్ఞ అబ్ధం కావా?

చెకు.— అదెట్లు? నాకు పాదాక్రాంతుఁ డయిన, బోడివలన పాగ రణఁగుట కాదా? బోడిబాపనవాఁ డని నన్ను తిట్టలేదా? నాకు విద్ధాంతము రానిమాట క్షణక్షణములో మీకు పరా కౌనుగాని, మీరు ప్రశ్నలుమాత్రము

---

3 1. దుష్టబుద్ధులను. 2. నాశముచేయుదును. 3. మాటలో-క్షణములోననుట.

కడు చాకచక్యముగా వేయుచున్నారు. చెప్పుడు మఱి, 'బోడి పాగరణఁచు' ననఁగా ఎవ రని యర్థము చేసెదరు ?

వలీ.—ఊర్కే మాటవరసాకి చెప్తాం, ఎవరైనా తురకలే యెందుకు కాదు?

చెకు.—బోడిబాపనవాఁడను గాన మొదలు నేనొక బోడిని! నాకన్న మీరుబోడి, నాకు జుట్టున్నది, మీకు అది లేదు; మీకన్న మా సన్న్యాసులు బోడి, మీకు గడ్డమున్నది, వారికి అది లేదు; అందఱకన్న మాపూర్వసువాసినులు బోడి. వారికి గడ్డము మొలవనే మొలవదు. ఇందఱిలో ఆజ్యపుబోడి యేబోడి గారాదు?

వలీ.— మీతో మేం మాటాకి మాటా చెప్పలేం సాస్తుర్లూ.

చెకు.—కనుక, నాతో వాదము పెంపకుఁడు. ఏబోడియో నే నిప్పుడు చెప్పను. నన్ను మీ రవలంబించెద మని ఖరారు చేసిన, అప్పుడు మీనము మేషము గుణించి చెప్పెదను; చేయనియెడల రెండవమార్గమును చెప్పనే చెప్పితిని. ఆయన మీకు ఓడినను మిమ్ము గెలిచినను నాకు పాదాక్రాంతుఁడగుట తప్పదు.

వలీ.—[జనాంతికము] ఖుస్రూఖాన్, ఇతడు మనకీ పనికి వచ్చునా?

ఖుస్రూ.—[జనాంతికము] బలే సామర్థ్యుడు, రాజాకి ద్వేషి. మన వల్ల గొప్పకార్యం కోరినాడు, మనం ఖరార్ చేస్తే మనపచ్చం వుంటాడు, ఆక్కడివి సంగతులు శీదా మనకీ చెప్తాడు. ఈ దోబీలు హాజామ్లు ఇతనిముందరా ఏపాటి?

వలీ.—[జనాంతికము] ఆ టయితే వుంచుకొందుమా?

ఖుస్రూ.—[జనాంతికము] నామతం అదే.

ముస్తఫా ఫిరోజులు.—[జనాంతికము] మామతం కూడా అదే.

చెకు.—సమ్ముఖమున రాయబార మేమి? ఇఁక మీ యాలస్యమే గాని నా యాలస్యము లేదు. నన్ను పంపివేసి మీపని మీరు చూచుకొనుఁడు.

వలీ.—పాస్తుర్లూ, ఏబోడి అయితే మాకి యేమి? మేం మహారాజా వారితో చ్ఛేహానికి వచ్చినాంగాని లడాయికీ రాలేదు.

చెరు.—సొదగ్గఅనా టక్కులు? పాపము! మీరు రాజమిత్రులు, రాజద్వేషిని నన్ను చేర్చుకొనఁ సంకోచించుచున్నారు! నన్ను తమాషా బ్రాహ్మణుఁడన్నారు, మీరెంత తమాషా సాయెబు లయ్యా?

వలీ.—[జనాంతికము, ఖుస్రూతో] ఇతడు బలే దుర్మార్గుడు, బలే పగపట్టేవాడు, మనం తిరస్కారం చేస్తేమన సరంజాం లడాయికి అని యితనికి యిప్పుడే తెలిసేవుంది గన్క వాళ్ళకీ చెప్పి వాళ్ళకీ మస్నీదికి తయార్ చేస్తాడు; అందు కోసం యితనికి మనపచ్చంలో వుంచుకోవడమే సరి, అని మాకీ తోస్తుంది.

ఇత. ముష్యు.—అచ్ఛా. అచ్ఛా.

వలీ.—పాసుర్లూ, మీరు మాతో భాయిభాయి వుండవాలా. మీరు అడ్గినదంతా మేం చేస్తాం, మీరు సరీ జోష్యం చప్తే మీకి బంగారంలో పాతీ యేస్తాం, ఝూటాజోష్యం చప్తే మట్టీలో పాతి యేస్తాం.

చెరు.—'నిప్పులో' అనుఁడు. మట్టిలో పాఁతుట తురకలనే.

వలీ.—పోనీ, అలాగే కానీ.

చెరు.—నేను మీబంగారముకోసము రాలేదు. మఱి నేను సరిజోస్యము చెప్పిన నాకు సుల్తానువారిదర్శనము మీరు చేయింపకపోయిన,మీ కేమి నియమము? నా రాక నిచట బయలుపుచ్చినను, అందుల కేమి నియమము?

వలీ.—మీరే కోరుకోండి.

చెరు.—కోరినట్లు ఒప్పుకొందురుగదా, మాట తప్పరుగదా?

ఖానులు.—మేము మాటా తప్తామూ?

చెరు.—అటయిన మీరయిదుగురు ప్రత్యేకముగాని కలసిగాని నాతో కత్తి యుద్ధము చేయవలసినది. [ఖానులు మొగములు చూచుకొందురు.

చెరు.—మఱీ తప్పదు.

వలీ.—ఖరార్, అలాగే మీతో యుద్ధం చేస్తాం.

చెరు.—వారినోట రాలేదే ఆమాట.

ఇత. ముప్వ.—ఖరార్, అలాగే మీతో యుద్ధం చేస్తాం.

చెరు.—మతి రండి, భాయి భాయి భాయి భాయి. [అందఱచేతను చేతఁ జేయి వేయించుకొని] మఱి యీచాకళ్ళకు మంగళ్ళకు నేను తెలియఁ గూడదు. సగము దారిలో వేషము మార్చుకొని తురక వేషమున వచ్చి తురక వేషముననే వెడలెదను. నాకు తురకదుస్తు తెప్పింపుఁడు భాయి.

వలీ.—అచ్ఛా బహద్దర్! అచ్ఛా బహద్దర్! మేమే ఆపని చెయ్య వాలా వుండింది, మాకీయాగడ్బడాలో ఏమితోచలేదు, బాగా జ్ఞాపకంచేసె నార్ సాస్తుర్లూ.

చెరు.—శాస్త్రులు అనకూఁడు, భాయి అనుఁడు.

వలీ.—అచ్ఛా అచ్ఛా! బాగా జ్ఞాపకం చేసినార్ బడాభాయి. [అని స్వయముగా పోయి మేలు తురకదుస్తు తెచ్చి చెరుమునకిశాస్త్రికి తొడుగును.

చెరు.—[ఆత్మగతము] ఇట్లు సద్యఃఫలముండవలయును. [ప్రకాశము] ఇఁక మీకు నావలన నాలస్యము కలదు. నేను మీకు భాయినే గాని నౌకరను గాను గదా, నాయిష్టమైనప్పుడు మీదర్శనాలకు వచ్చెదను. ఇప్పటికి సెలవు. సలాము, సలాము, సలాము, సలాము.

ఖానులు.—సలాం.

వలీ.—ఖరార్ చేసినాం, భాయి అయినాం; ఆజోష్యపుబోడి యెవరో చెప్పండి బాయి.

చెరు.—[సోత్ప్రాసము] మీరు సఖ్యానికి వచ్చినారుగదా. జోస్యపుబోడి యేబోడి యైన మీకేమి? [అని నిర్గమించుచు, పహారాజవానుం గని] ఏమిరోయి, [తన దుస్తు చూపుచు] నాదెబ్బ చూచితివా? ఇం కొకమాఱు పంజా పట్టెదవా? పోనీ, నాతో కొంచెము కత్తి త్రిప్పెదువా? విక్రమార్కునిబుఱ్ఱ ఉజ్జయినిలోఁ బడిన, నీబుఱ్ఱ గిఱగిఱ తిరుగుచు, నన్ను వెక్కిరించుచునే లే, పోయి ఢిల్లీలో నీపెండ్లాము నోడిలోఁ బడును.

జవాన్.—సలాం పండత్ సాబ్ సలాం.

చెను.—ఆ, అట్లు పలుకు. ఇప్పుడు బుద్ధిమంతుఁడవు. [ఆత్మగతము] అబ్బ !!

క. తెలివి నభినయించెద రీ
తులువలు, వీరలను గంట దుమ్మున వైతుఁన్,
గులగుల జెక్కలు దూసిన
[1]పులుఁగులఁ గావింతు, [2]గడిఁదిబూ మొల నొంతుఁన్. 5

[అని నిష్క్రమించును.

ఇత. ముప్వ.—ఇత డెవరో అషాధ్యుడు సర్దార్సాహెబ్ !

వలీ.—ఔను. మనపచ్ఛం వుంటే జనార్దనుడికి షాధించవచ్చును. ఇతడు మళ్లీ వస్తే మనపచ్ఛం వుంచడాన్కి జాగర్తగా చాలాష్నేహం చెయ్యండి. ప్రస్తుతం యితని జోష్యంవల్ల మనకి యేమీ ప్రవోజనం లేకొపోయింది. ఇతడు యెప్డువస్తాడో, వస్తాడో రాడో కూడా తెల్వదు. ఇతనికియెదుర్చూచి మనయేర్పాట్లు మానడం మార్చుకోవడం బాగాలేదు. గన్కా మాయేర్పాట్లు యేమంటే.—

ఇత. ముప్వ.— సర్దార్, శెలవియ్యవాలా,

వలీ.— పట్ణం పట్టడం మనకీఅషాధ్యం. కనక మేం కొంచెం దండుతో జంగుల్కి వెల్లి రాజాకి ఖైదీపట్టి ఢిల్లీకి వెళ్లిపోతాం. మీకీ కభుర్ చేస్తాం. మీరు తచ్ఛనం ఖుస్రూ సర్దార్ వుండి పట్ణం పట్టుకొండి, పర్గణాల్ పట్టుకొండి; రాజా వచ్చి మేము రాకొపోతే ఆ రాయభారం జరపండి. పైయాలోచన మీకే తెల్సును. ఇంతలో మేం కల్సుకొంటాం.

ఇత. ముప్వ.--అచ్ఛా, సర్దార్జీత్తం.

వలీ.— మేం లేనప్పుడు ఖుస్రూ సర్దార్, దేవం గీవం పడ్తే ఖుస్రూ

5. 1. పత్తులనుగా. 2. గట్టిమాయలచేత బాధించెదను.

నబాబ్. మా ప్రయాణాన్కి సరంజాం చేయించు ఖుస్రూఖాన్. ఇక కచేహారి మర్తబ్.

ఖుస్రూ.—ఇప్పుడే సరంజాం సిద్ధం చేస్తాన్.

ఇత. ముల్వు.—సలాం సలాం సలాం.

[అందఱు నిష్క్రమింతురు.

ద్వితీయాంకము సమాప్తము.

---

## ప్రవేశకము.

స్థలము.—ఓరుఁగల్లు, కోటలో రావనగరు.

అంతట ఇద్దఱు చేటికలు ప్రవేశింతురు.

ప్రథమ.—అక్కా జయా, యేమే నీ వేమో దిగులుపడుచున్నావు?

ద్వితీయ—వోశే కళావతీ, నీతో చెప్తే నీవు కూడ దిగులుపడుతావు.

కళా.—అటయితే నీదిగులు సగం తగ్గుతుంది. కనుక మఱి చెప్పకుంటి వావోట్టు.

జయ.—వొట్టెందుకే, చెప్తాను విను.

కళా.—యిదుగో నాగస్వరాన్ని పామాలకించేలాగ ఆలకిస్తూ వున్నాను.

జయ.—రాణీగారికి దుస్స్వప్న మైయింది. దానివల్ల యేలినవారికి కీడవు నని రాణీగారు దిగులుపడుతున్నారు; అందుచేత నేనున్ను దిగులుపడి వున్నాను.

కళా.—యీ రెండింటిచేత నేనున్నుదిగులుపడుతూ వున్నాను.

జయ.—నన్ను తక్షణం వెళ్లి, శాంతిచెయ్యించడానికి పౌరోహితుఁడు మహాదేవయ్యని తీసుకొని రమ్మన్నారు.

కళా.—మహాదేవయ్యని పిలుతాం రా మరి.

జయ.—పిలిచివొస్తిని, పద వొస్తా నన్నాడు.

మఱియొక చేటి రోజుచు ప్రవేశించును.

జయ.—వోశే కాశీ, యెక్కడినుంచే యీ రోజుతూ రావడం?

కాశి.—ఓహో జయాకళావతులా!

జయ.—నే నడిగిన మాట చెప్పు.

కాశి.—యీ యడావిడిలో రహస్య మేమి? చెప్తాను. దేవిగారు మంత్రిగారికి కభురు పంపినారు: 'యీతురకరాణువను చూస్తే మాకు తల

కంటగిస్తూ వుంది. దీన్ని యిక్కడికి రానియ్యడ మేమి? యిన్నాళ్లు యిక్కడ వుండనియ్యడ మేమి ? దీన్ని మా దేశం వెళ్లగొట్టవలసింది.' అని.

ఇతరులు.—మంత్రిగా రే మన్నారు ?

కాశి.—పెద్దాయన వూళ్ళో లేరుగదా. చిన్నాయన యీమాట చెప్పినారు:—'నేడో రేపో అన్నగా రొస్తారు. వా రొస్తూనే వీళ్లని యీ లోకంనుంచే పంపించేస్తారు. అందాకా వోపిక చెయ్యండి.' అని. మరి నేను మసలర్దాదు; ఆవిడకు తక్షణం జవాబు చెప్తాను.

జయ.—అల్లదుగో కలకి శాంతి చెయ్యడానికి మహాదేవయ్య వొస్తున్నాడు. అందఱం వెళ్దాం రండి ఆవిడదగ్గిరకే. కన్నతల్లి ఋణమైనా తీర్చుకో గలంగాని యీతల్లి ఋణం తీర్చుకోలేము, రండి రండి.

[అని నిష్క్రమింతురు.

ప్రవేశకము ముగిసినది.

---

# తృతీయాంకము.

స్థలము 1:—గోదావరిదక్షిణతీరమున అడవిముఖము.

ముగ్గురు తురకసిపాయిలు ప్రవేశింతురు.

ప్రథముఁడు.—[చూడ్కి నిగిడించి] అరే! బలారె! ఆ మైదానంలో యెట్వొంటి గోడా వుందిరా!

ద్వితీయుఁడు.—[చూడ్కి సారించి] ఔరా! అ దేమిరా అంతా ఆకుపషర్ వరణం వుంది?

తృతీయుఁడు.—అది యేమి హాందం వుందిరా! నెమ్మిపిట్టలాగా వుంది సవార్ యత్తే అదీ షేఘూత్మే యెగ్రి పోతుంది నాకీ తోస్తుంది భాయి.

ద్వితీ.—ఇదిరాజాగుఱ్ఱం కావాలా యేటాయేమం, అంతా ఆకుపషర్, జీన్ అడే, పచ్చల్ నగల్ వేసి వుండవాలా భాయి; లేదా—

తృతీ.—ఏమి పచ్ఛాంతరం?

ద్వితీ.—పచ్ఛాంతరంలో మనకీ ఖిలో, ష్వప్నమో, షన్నిపాతమో, కావాలా: లేదా—

ప్రథ.—లేదా, అదీ దయ్యం, జిన్, పిసాసీ, సైతాన్, కావాలా.

తృతీ.—అదీ దేవుడీ హావతారం కావాలా.

ద్వితీ.—అదీ దాటితే బొమ్మాఖోరడ్ అయితుంది భాయ్!

తృతీ.—దాన్కి రెక్కల్ వుంటే అదీ చిల్కా అయితుంది, కల్కా ల్కల్క ల్పల్కుతుంది. దాన్కి పరికిణీ కట్టి తాబొందూ కుడితే అదీ కంచెన్ అయి తైతైతైతై తకతైతకతై నాట్యమాడుతుంది. అదీ షక్లిస్తే షంగీతం అయితుంది బే!

ప్రథ.—మొహంతో షక్లిస్తే మొహానా.

ద్వితీ.—నోటితో షక్లిస్తే నౌరోజ్.

ప్రథ.—కంఠం ధుల్పితే ఖమాజ్.

ద్వితీ.—కాలితో తంతే ఘంటా.

తృతీ.—అదీ రస్తామే ఖదం తొక్కితే రస్తా అంతా ఖంగ్ ఖంగ్ ఖంగ్ ఖంగ్ మోర్ఛంగ్ వాయిస్తుంది; దాన్కి భూమీ అంతా వీణా పాడుతుంది.

ప్రథ.—అవంతోషానికి ఆశ్చర్యానికి చెట్లూఅంతా తలాఆడించడం.

ద్వితీ.—అవంతోషానికి ఆశ్చర్యానికి మన్ను అంతా గడ్డం ఆడించడం.

తృతీ.—అరే యిదీ సుల్తాన్ వారికి నజర్ చెయ్యవాలా.

ద్వితీ.—[తృతీయునితో] అరే సర్దార్ బహద్దర్‌తో తచ్ఛనం వెళ్లి నీవు చెప్పరా. నీవైతే బాగా చెప్పగల్తువు.

తృతీ.—నేను తచ్ఛనం వెళ్లి, "సర్దార్ సాహేబ్ ఘోడా, అరబ్బీ గాదు, పార్సీ కాదు, అజాన్ గాదు, తుక్షార్ గాదు; హిందూ కేపాతాళంలో నా ఘేంద్రుడు వుంటాడే, వాడిదీ నడిమితల్కాయమణీ చెక్కి ఘోడా చేసి, దాన్ని వాళ్ల బెంహా దేవుడు ముక్కులో వూధి ప్రాణంచేసింగి; మైధానంలో మేస్తా వుంది; ఏమిహుకుం?" అని అడ్గుతాన్.

ప్ర. ద్వి.—హా రే నీవు ఫెర్దూషికన్నా యెక్వా కవి. జల్దీ పోరా.

[తృతీయుఁడు తెరలో, ఘోడా ఘోడా అని

అఱచుచు పోవును.

వెంటనే చుఱియిద్దఱు సిపాయీలు ప్రవేశింతురు.

చతుర్థ పంచములు.—గోడా క్యారే? గోడా క్యారే?

ప్రథ.—అల్లవ్గో చూడు.

చతు. పంచ.—[చూచి, ఆశ్చర్యపడి, మఱియొకవైపున చూడ్కి నిగిడించి] అరే, అక్డా, చెట్టుకింద మన్సీ వఖ్‌డు పరుండి నిద్రపోతూవున్నాడు భాయ్. వాడుకూడా అంతా పచ్చల్ దుస్తు; జిగ్ జిగ్ జిగా మెరుస్తాడూ.

ద్వితీ.—అరె నాకీ తోస్తుంది, వాడు రాజా, ఇది వారిదీ ఘోడా, అంతా యేటాయేషం.

అందఱు.—[కలయం గని] దండు గిండు లేదుభాయ్. [హర్షాశ్చర్యములతో] అరే మన్ము రాజాకి పట్టవచ్చును !

తృ. ద్వి.—మీరు పోయి సర్దారుకు చెప్పి చేసి హుకుం పుచ్చు కొనిరండి. మేము వారికి పోకుండా చూస్తా వున్నాం,

చతు పంచ.—అచ్ఛా, అచ్ఛా. [అని నిష్క్రమింతురు.

తృతీ.—[ప్రవేశించి] మన్ని యెవరైనా దగ్గిర వున్నారో చూడ మని సర్దార్ చెప్పినార్.

ప్రథ.—వఖ్తన్నీ వున్నాడు. ఇద్దరు సిఫాయీలు చూచినార్, చెప్ప డానికి పోయినార్.

చతు.—[ప్రవేశించి] పత్యేఖం పత్యేఖం ఖయిద్ చెయ్య మని హుకుం,

చతు.—[మొదటి త్రయము నుద్దేశించి] మన్ము నల్గురు రాజాకి పట్ట వాలా, [పంచముని నిర్దేశించి] నీడు వఖ్ తుఙ్గీతో పోయి గుఱ్ఱాన్కి పట్ట వాలా. [పంచముఁడు నిష్క్రమించును.

అంత మఱ్ఱిచెట్టుక్రింద నిద్రితుఁడు రాజు ప్రవేశించును.

[ఆనలువురు సిపాయీలు రాజునకు కాలుసేతుల బంగారు సంకెలలు తగిలించి ఆయుధములను తీసి వైతురు.

రాజు.—[చేతులు కాళ్లు దులుపుచు మేల్కొని లేచి కూర్చుండి] ఏమీ యీకల! మా కాలుసేతులు నాగుఁబాము చుట్టుకొన్నట్టు స్వప్న మైనది. [చేతులు కాళ్లు చూచుకొని మహాశ్చర్యముగా] ఏది యిది! పాము గాదు, బంగారుసంకెలలు! ఏమి యిది! ఇంకనుంగల మేఁ? [కలయఁజూచి సిపాయీలం గని] ఏమిరాయిది? మీరెవరు?

సిపాయీలు.—[దద్దరిల్లి వెనుకకు విఱుగఁబడి సరుదుకొని] మహారాజా సాహేబ్, హేం వలీఖాన్ సిఫాయీలం. మాసర్దార్ హుకుంచేత ఈపని చేసినాం.

రాజు.—ఏమి! [కత్తిదూయం బోయి, బాకు తీయం బోయి, లేమిని చేతులు రామిని ఎఱిఁగి] ఏమిరా ఆఁడుదానిపని చేసినారు? మీఖాను ఉన్నాఁడా యిక్కడ?

4

సిపాయీలు.— ఉన్నారు మాసర్దార్.

రాజు.—ఇక్కడికి రమ్మను.

తృతీ.—సర్దార్తో చెప్తాఁ మహారాజాసాహేబ్.

[అని నిష్క్రమించును.

రాజు.—మాగుఱ్ఱ మేదిరా?

సిపాయీలు.—గుఱ్ఱాన్ని పట్టి ఖయిద్ చేసినార్ మహాప్రభో.

రాజు.—ఖయిదు పడదే అది ?

సిపాయీలు.—మాకీ తెల్వదు మహారాజ్.

రాజు.— ఓరీ, ఈవలీని కొలిచిన మీకు పిడికెఁడు రొట్టెకన్న నే మున్నది? [సంకెలలను సూచించి] వీనిని వదలించి, మాతో రండి, చాటు దారులఁ బోదము. మీకు చెఱియొకపరగణా యిచ్చి మిమ్ము నబాబులను చేసెదము. [సిపాయీలు మొగమొగాలు చూచుకొనుదురు.

తృతీ.— [మఱి నలువురు సిపాయీలం దోడ్కొనివచ్చి] రండి మహా రాజ్, రండి మాసర్దార్ దగ్గ్రాకి,

రాజు.— మేము రాము మమ్ము పొడిచి వేయుఁడు.

తృతీ.—మాకీ పొడ్వడాన్కి హుకుం లేదు. తీస్కొని రమ్మని హుకుం.

అందఱు.— రండి మహారాజ్ రండి. వచ్చి అక్కడ సర్దార్కు అడ్గితే వారు విడిచిపెడ్తార్,

రాజు.—మీ సర్దార్ దొంగ, మీసర్దార్ ఆఁడుది; వాని ముఖము చూడ మాకిష్టము కాదు.

తృతీ.—ఇష్టం లేకొప్తే కష్టం వుంది. మీరు తిర్గబాట్ చేస్తే ప్రయో జనం లేదు. మీ ధౌలత్ పోయింది. మీరు మాఖయిదీ, మేం రమ్మంటే రావాలా. పొమ్మంటే పోవాలా. మీరు రాకొప్తే మేము ఇర్వైనల్భై మంది జులుం చేసి మీకీ పట్టి యీడ్చుకొనిపోతాం; అది మహారాజాకి బలే గౌరవం? మర్యాదాగా రండి. తమరికి అక్డమర్యాదా సర్దార్ ఖుషి, తమరి అధృష్టం.

రాజు.—మీరం మనిషికి ఒక్కొక్కఁడు తెచ్చెదము. [కొందఱు సిపాయిలను చూపించి] వీనిని వదలించి మాతో రండి.

[సిపాయీ లందఱు మొగమొగంబులు చూచుకొనుచుండురు.

[దూరమున చెట్లచాటునుండి వలీఖాను తొంగిచూచు చుండును.

తృతీ.—[వలీఖానుం బొడగాంచి] అక్కే సర్దార్ దేఖ్తాహై.

అందఱు.—[వలీఖానుం గని, రాజుతో] మేము నమక్ ద్రోహం చెయ్యం మహారాజ్.

రాజు.—అట్లైతే మా గుఱ్ఱమును తెండి, దానిమీఁద వచ్చెదము.

నలువురు.—అచ్ఛా! అచ్ఛా!

తృతీ.—[సతిరస్కారము] గిచ్ఛా! గిచ్ఛా! ఆగుఱ్ఱంమీద ఈయ్న యెక్తే ఛణంలో అది వోరుగల్లుమే వుంటుంది, మన్ము యిక్డ జంగల్మే వెతుకుతూ వుంటాం. వేరేగుఱ్ఱం తెండి [ఆలోచించి] వద్దు, టాంజాన్ తెండి.

[నలువురు పోయి టాంజాన్ తెత్తురు. రాజు అందులో కూర్చుండును.

తృతీ.—అరే మన్ము హార్థత్ చేస్తే ఈయ్నదండూ వస్తుంది. ఈయన తప్పించుకొంటాడు; యెత్తండిరా, యెత్తండి, యెత్తండి.

[సిపాయీలు రాజును టాంజానులో గొనిపోవుదురు.

రాజు.—[స్వగతము] హా! ఈపాటు నాకుఁ బాటిల నేమి కారణము!

ఉ. కల్ల వచించినాఁడనొ? నిఘాత మొనర్చితినో సురార్చకుల్ ?
దల్లిమనంబు నేచునొ? యదండ్యుల దండన వెట్టినాఁడనో ?
[1]యుల్లము నొంతునో ద్విజునకు? [2]కోమనొ యార్తుని? వింటినో ఖలుల్ ?
బల్లిదమైన వైశసము పాటిలఁగాఁ గత మేమి యీ క్రియల్? 1

అట్లు గాదేని,

క. అటవి నిరపరాధుల మృగ
ఘటలం బొరిగొన్న పాతకము దాఁకెనొకో?

1. [1] హృదయమును బాధింతునో, 2. ఓమనొ = రక్షింపనో, 3. చేటు.

కటకటఁబడిరో కోటకుఁ
బటుయోగాదృశ్యులై తపము సేయుమునుల్ ? 2
హా! లక్ష్మి యఁట! యెంత మోసగత్తియ!
ఉ. అంచెల వైరులన్ దునుమున ప్డసిధారను దోడు నిల్పి, ప్రే
మించి, కవీంద్రభాషణల మెచ్చుతఱిన్ గనుసన్న గొల్చి, న
మ్మించి, యఖండ మిప్డు విషమించి, త్యజించెను సుప్తుఁ గానలోఁ;
[1]జంచలకన్నఁ జంచల నిజంబుగ లచ్చి, యిదే గ్రహించితిన్. 3
ఉ. నాకిథ విన్న నే మగునో నా [1]జనయిత్రి? [2]మదీయరక్షణే
చ్ఛాకలితవ్రతాకృతి కులాంగన యేగతి నొంది డిందునో?
రే కిడుతమ్మిమొగ్గ [3]కెలరేదొరబుగ్గకు నాదుపట్టికిన్
గాకతివంశవీరునికి [4]గంజజుఁ డేమిగతిన్ లిఖించెనో? 4
ఆ. కూలినాలి చేసి కుడుచు పేదసుఖంబు
దక్కదిలను [1]మకుటధారి కెపుడు;
తలఁకుఁ దాఁక కున్నఁ దన కేమి తెలియదు,
ఫలముఁ గంటి రాజభావమునకు. 5
హాహా! ఏమి తోఁచుచున్నది! నాగతి ఢిల్లీనడివీథులలో బోనులో ఊరే
గింపు! మరణము మేలుగదా? ఆహా! ఎట్టి కులపాంసనుండను బుట్టితిని! ఓరి
వల్లీఖానుఁడా!
చ. శుకముల, గోరువంకల, వసుంధర లాతివిహంగమంబులన్,
[1]మెకములఁ బంజరాన నిడు మిక్కిలిపేఁటరు లుందు రెందఱో,

---

3. అసి ధారన్=కత్తి వాదరయందు, 1. మెఱపుఁదీఁగకంటె.
4. 1. తల్లి, 2, నా సేమమందలి కోరికచేత నోఁచఁబడు నోముతే
ఆకారముగాఁగలది, 3. బాల చంద్రుని చెక్కిటివంటి కోమలాంగునికి,
4. బ్రహ్మ.
5. 1. కిరీటము దాల్చినవానికి - రాజునకు.
6. 1. మృగములను.

విగలితవైరి నేకశిలవీరనరేంద్రుఁ బంజరంబులోఁ
ప్రకటితశక్తి నిట్లుడిగ విద్విషదాఖువిధానుఁ జేసి వోకుండవే? 6

అహా! మాతృభూమీ! తురుష్కులు నాకిట్టి గతి చేకూర్చిరయ్యా!

క. తోళ్లలు, వ్రేళ్లలు, చేతులు,
జెలువలఁ జెలుచుటయు, జాతిఁ జెడఁగొట్టియు నా,
1మలకలచే నాప్రజలకుఁ
గలుగవె, యీపాప మెల్లఁ గలుగదె నాకున్? 7

అహాహా! దుర్విధి నెల్ల నాశనము చేసెను. అనఘుఁడయ్యుండి ధరదేవుని పలుకుఁ బాటింపక పోఁబట్టి కలిగిన ఫల మిది. మహానుభావా, మీ తలంపుచేఁ కదు లజ్జించుచు, నాతప్పుచే విధి బలీయమైనది. విధి నడచు పురుషకారము తమదే! ఇప్పటి కితి కర్తవ్యతాజ్ఞానము కలుగుచున్నది.

ఉ. చింతిల నేమి గల్గు? విధి 1చేఁత బలీయము! తొంటికర్మముల్
శాంతిలు 2భుక్తిమాత్రమున; 3సత్త్వవిహీనత నొంది యీక్రియన్
4వంతలఁ బొక్క యింతులకు 5వాటము, తేఁకువ నూపు మార్గమున్
సంతతధైర్యవృత్తి నిట 6శత్రువశంవదనై మెలంగెదన్. 8

[చూడ్కి సారించి] అహా! గోదావరి అగపడుచున్నది! నమో నమస్తే సాగరసహధర్మచారిణి!

జమాదార్.—అరే! యేమి గుబ్బుంరా యిది! ఇప్పట్కి నూరుతల్కాయల్ బద్లల్ చేసింది. కాళ్లు చేతులూ లెక్కలేదు. అరే రాజాకి పట్టడం ఛణం. దీనికి పట్టడం యుగం. యేమైనా సరే, యెందరు సచ్చినా సరే. దీన్కి సంపకూడదు అని సర్దార్ హుకుం. దీన్కి సంపకుంటే మన్మంతా దీనిచేత

6. 2. వేఁటరులలో శ్రేష్ఠుఁడవు.

7. 1. తురకలచేత.

8. 1. కృత్యము, 2. అనుభవముచేత మాత్రమే, 3. ధైర్యము లేమిని, 4. దుఃఖపడుట, 5. తగినది. 6. శత్రువులకు స్వాధీనుఁడనై.

సస్తాం. సంపితేనా మన్సంతా సర్దార్చేత సస్తాం. ఈ గవాచారంలో యేమి శెయ్యమంటార్ భాయ్?

దేహ ప్రణితుఁడు,—ఇద్గో భాయ్ [గాయాలుచూపుచు] నావొళ్లంతా గాయాల్.

పాద „ [కాళ్లుచూపుచు] ఇద్గో నా కాళ్లు నహీ.

బాహు „ [చేతులు చూపుచు] ఇద్గో నా చేతులు గయా.

నాసికా „ [మొగాన చేయి యుంచుకొని అనునాసికోచ్చారణగా] అల్లా! అల్లా! నాముక్కు పోయింని; ఎజిరి పోయింని,

నేత్ర „ [చీకరించుకొని చూచుచు] అల్లా! అల్లా! నా కన్ను పోయింది.

ప్రణితు లందఱు.—మే మిక దాని మొఘానికి చూడంభాయి, సచ్చిపోతాం గాని.

రాజు.—ఓరి సిపాయీలు, మీరు దానిని పట్టలేరు, చంపలేరు. దాని యొద్ద నయినను మమ్ము సెలవు పుచ్చుకోనీయరా. మేముపిలిచిన అది వచ్చును, మామాటకు నిలుచును. మాతోకమాఱు దానిని చూపి మీరు దానినగలుతీసి కొండి; తన్నదు, ఎగురదు, సమ్మతమేని టాంజాక్ దాని వైపు త్రిప్పుడు.

జమాదార్.—[సిపాయీలతో] అలాగ చేతామా భాయి? చేతాం. నగల్పుచ్చుకొని పోయి సర్దార్ యొద్ద పెడ్దాం. మన్సు తినే నగ ల్యావ్, మనకీ చాలా తన్నులు తప్పాను.

దేహ.—[ముక్కుపోయిన వానిం జూచుచు] శానా ముక్కులు నిలుచును. [కన్నుపోయిన వానిం జూచుచు] శానా కన్నులు దక్కును.

జమాదార్.—తిప్పండిరా టాంజాక్ తిప్పండి. [త్రిప్పుదురు.

రాజు.—[గుఱ్ఱముం గాంచి] రారా బాబా, రారా నా యింద్రాయుధమా, [గుఱ్ఱము వచ్చి రాజుప్రక్కనిలిచి తల ఆడించుచు కాళ్లు జాడించుచు ఉండును.

రాజు.— బాబా, నీవగలు పరికింప్పి చేయుము.

[అని గుఱ్ఱము మెడను తట్టుచున్నాఁడు. గుఱ్ఱము కపటక నిలుచును.

సిపాయీలు.—[ఆశ్చర్యముతో] అహా యేమి దీని విస్వాసం! యేమి యీవిస్వాసం! [అని గుఱ్ఱము నగలన్ని పరిచివైచి] అరే, మన్సి నామి ప్రోషు, వాల్లు కొల్లజంతూ హామిరత్తు బాయ్.

[అని కొందఱు దానికి 'సలాం గోడా సాహేబ్' అని సలాము చేయుచు కొందఱు దానిని తట్టుచు, కొందఱు ముద్దుగొనుచు, ఉందురు.

ముక్కుపోయిన సిపాయి.— నామజ్గు, నెజనన్నవానికి యీముక్కా జోణుజు సిపాయీలు సలాముల్ ముస్సుల్ జేస్తావున్నార్.

కన్ను పోయిన సిపాయి.— లేదు, నాకన్నూకి తెగ తన్నినందుకోసం వీళ్లు దీనికి సలాముల్ ముద్దుల్ చేస్తావున్నార్.

ముక్కు.— [కోపముతో] అరే, నిజుజ్నెజన్నూ యెజ్వారే నాము జ్గార్ ముజ్గూజక్టే?

కన్ను.—[కోపావేశముతో] అరే బనాసీ, నితో ముక్కులెక్కావే నావజ్రం నీలం అఖీకంలే?

రాజు.— బాబా మాకు సలాము చేయుము. [గుఱ్ఱమును సకిలించి తల ఆడించును.

రాజు.—

ఉ. మాదశ నీ వెఱుంగక [1]హాలుమాదొర, డస్సితివయ్య నిరిచేశ్?
మాదశఁ జూడు, నీవలన మానదు; నీ [2]పొర గాదు; [3]మన్న నో
వేదివి, ప్రాణదాత, విట వేఱులు నీకును మాకు నయ్యెఁ; [4]గుం
దేది [5]పయోదవీథిఁ బురి కేఁగుము; వెండియుఁ గాంతువో మముఁ? 9

[అని గుఱ్ఱమును ముద్దుగొని చిటికవైచును. గుఱ్ఱము పరారి యగును. రాజు సబాష్పము చింతాజడుఁడై గుఱ్ఱముపోయిన దిక్కు చూచుచుండును.

---

9. 1. గుఱ్ఱము, 2. తప్పు, 3. నామనస్సును ఎఱింగినవాఁడవు, 4. దుఃఖమును మాని, 5. మేఘమార్గమున.

సిపాయీలు.—[పరస్పరము] క్యారే! క్యారే! గోడా ఏదిరా! గోడా ఏదిరా! [రాజుతో] ఏం మహారాజ్, ఈలాగ చేసినార్?

రాజు.—నన్నుఁ దప్ప ఎక్కనీయదు. ఒకరిచేత చావదు, పట్టు పడదు. అది పోయినందున మీతలలు నిలిచినవి, సంతోషపడుఁడు.

జమాదార్.—అరేభాయి, ఈనగల్ సర్దార్సాహెబ్కు అప్పగించి, యీమాట సర్దార్ సాహెబ్కు చెప్దాంరండి. దాన్కి పట్టి తెమ్మని ఆయన ఖుస్రూఖాఁ బహద్దరుకు కభర్ చేస్తాడు. [అని నిష్క్రమించి మరల ప్రవేశించి నిగిడి చూచి] అరే! పడవల్! పడవల్! పడవల్!

దేహ.—పడవల్, డింగీల్, దోనెల్, వాడల్, అన్నీ వున్నయి! మనకోసం హల్లా పంపినార్రా యివి! ఈమిరా మన హద్రుష్టం, మన సర్దార్ హద్రుష్టం!

రాజు.—[ఆత్మగతము] సత్యము సత్యము! మీకాలము! మంచిది!

దేహ.—సర్దార్కు చెప్పి వేస్తాఁ. [అని నిష్క్రమించును.

అంత వలీఖానుఁడు కొంత పరివారమును ప్రవేశింతురు.

వలీ.—అరే జల్దీ! జల్దీ! గట్టుకు ధవుడు! ఆపడవలకీ అపండి ఆపండి!

[అందఱు త్వరగా పరిక్రమింతురు.

స్థలము 2. గోదావరిగట్టు.

సిపాయీలు.—[ఎక్కడివాఁ డక్కడనుండి] ఓపడవ! ఓపడవ! పడవోయిపడవ, అరే కళాసుల్, ఓహోయి సరంగ్, ఈలాగారండి ఈలాగా రండి, పడవల్ దరికి తెండి.

అంతట పడవలు గడలతో నడుపుకొనుచు పాడుచు పడవవాండ్రు ప్రవేశింతురు.

తండేలు.—[ముందుగడ వేయుచు]

గంగమ్మ తల్లికి శెంగల్వ పూదండ,
కాళింది కీ తెల్ల గల్వాదండా.

కళాసులు.—[పానిపెడుత నడపేయుచూ] గంగమ్మ ...

అందఱు.— జోర్సెయ్. హాస్సెయ్, జోర్సెయ్, హాస్సెయ్.

తండేలు.—గోదారి గట్టుక గొజ్జంగి పూదండ,
సరసాలకీ సన్న జాజిదండా.

కళాసులు.—గోదారి ... ...

అందఱు.— జోర్సెయ్ ...

సిపాయీలు.—పడవనోయి పడవ. ఓయిసరంగ్, కళాసుల్, అరే మీకి చెవ్వులూ లేవా? దరికి రండి అంటే.

పడ.—[చూచి, గడలు నిలిపి] ఏంము కలయ్యా!

జమాదార్.—మాకి దాటేండీ, కే ఇస్తాం.

తండేలు.—ఎక్కడైనా బల్లగట్టు చూసుకొని దాటండి, మేము నిలము.

[అని మరల గడలు వేయుదురు.

రాజు.—[ఆత్మగతము] ఇక్కడ నయిన కొంచెము విలంబము కాఁగూడదా? మాదండు వచ్చి కలసికోరాదా? ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో?

జమాదార్.—అరే మేము ఎంత కెవయినా యిస్తాం.

తండేలు.—ఏ మిస్తారు?

జమాదార్.—మీ రడ్గండిరా.

తండేలు.—మీరు శెప్పండి.

జమాదార్.—నూరుశరాలు యిస్తాం. మేము ఐదువందలమందిమి. అందర్ని వఖటే ఛణంలో దాటెయ్యాల.

తండేలు.—దండా యేంటి?

జమాదార్.—అవును. మరి మాట్లాడకండి, హర్కత్ శెయ్యకండి. మీపున్నెం పండింది పొండిరా యీవేళ.

తండేలు.—దాటేశినాక యెగయ్యరు గందా సాయబుమారాజులు?

జమాదార్.—యెర్రివాడా నీడబ్బు మేము యెగేస్తాం? నీకీ యింకా యినాం యిస్తార్ సర్దార్. యిద్గో కేవు ముందే పుచ్చుకో.

[అని సంచి గలగల లాడించును. పడవవాండ్రు కలయఁ బలికికొనుదురు.

రాజు.—[ఆత్మగతము] వీరికి మమ్ము తెలిసిన వీరు దాఁటవేయరు. అంతట సిపాయీలు ఈఁది పోయి వీరిని చంపి పడవలను గట్టునకుఁ దెచ్చి, యెక్కించుకొని తామే నడుపుకొని దాఁటి పోదురు. మా దండెక్కడను దృష్టిపథములో లేదు. మాకై వీరల చావవలయును.

తండేలు.—[పడవలను దగ్గఱకు తెచ్చుట కభినయించి] మ ఱెక్కండి.

దేహ.—[ప్రవేశించి] రాజాకి దోనెకడ్పులో పెట్టమని సర్దార్ హుకుం.

[అట్లే చేయుదురు. అందఱు తెప్పెక్కి కూర్చుందురు. వలీఖాన్ కొంత పరివారముతో మఱియొక పడవ యెక్కును. సిపాయీలు సర్దుకొని కూర్చుండి కొందఱు పరుండి చుట్టలు గుడాకులు త్రాగుచుందురు.

స్థలము ౩. దోనెతట్టు.

దేహ.—అరేభాయి, యీగోజ్ ఎంత ప్రాణానికీ సాలి వచ్చిందిరా యీ పాడు గోడాచేతి? ప్రాణం బీజారైంది భాయి.

నేత్ర.—[అంగరక్కా విప్పుకొనుచు] అరే పోయిన ప్రాణం వస్తా వుందిరా యీ చల్లా గాలికీ.

పాద.—అరే గోధారిలో పడ్డా నన్ను లేపకండి; యేంగాని సరే, నేను నిద్రాపోతాన్. [అని మూటకుఁ జేరగిలఁబడి నిద్రించును.

బాహు.—యీ చల్ల నీళ్లలో పడి చచ్చిపోవడానికి నాకి సర్దార్ శెలవు యిస్తే బాగా వుంటుంది భాయి.

పాద—అరే సావడాన్కి శెలవూ యెందుకూ భాయ్?

పడ.—[గడలు వేసి] ఏలెస్సా, ఓలెస్సా, ఏలెస్సా, ఓలెస్సా,
ఏలెస్సాబో బేలెస్సా, ఏలెస్సాబో బేలెస్సా. [మరల మరల అదే.

ప్రథమ ద్వితీయులు.—అరే పడవవాళ్లు, పాడండిరా పాడండి.

పడ.—యేలా యేలా యేలా యేలా యేలా యేలా యేలేలా,
యేలా యేలా యేలా యేలా యేలా యేలా దండేలా.

(ప్ర. ద్వి.) సిపా.— ఇందాకటి పాడ్తావుండినారే అదే పాడండిరా.

తండేలు.— పాడతాం. ఇనాం యియ్యాల సాయిబులు.

గంగమ్మ ... ...

గంగమ్మ... గంగమ్మ ... ...

అందఱు.— జోర్స్యెయ్ ...

(ప్ర. ద్వి.) సిపా.— వహవ్వా! వహవ్వా! బలే ఘనంగా వుంది.

ప్రథ.— అరే మాకీ కూడా చెప్పండి, మేమూ పాడ్తాం.

ద్వితీ.— వాళ్ళు పాడనీరా భాయ్. మనకీ రాదూ అది,

తండేలు.— గోదారీ తల్లికి ... ...

కళాసులు.— గోదారీ తల్లికి ... ...

అందఱు.— జోర్స్యెయ్ ...

(ప్ర. ద్వి.) సిపా— జోర్స్యెయ్ ...

తండేలు.— కిష్టాయో అమ్మాకి గేదంగి పూదండ,
కావేరి కీ చంద్ర కాంతిదండా.

కళాసులు.— కిష్టమ్మ తల్లికి ... ...

(ప్ర. ద్వి.) సిపా. పడ— జోర్స్యెయ్ ...

తండేలు.— సుళ్లు దో పుళ్లు ము సళ్లు ద ప్పించి, మ
మ్మిళ్లు సే ర్సండి వో తల్లులారా.

కళాసులు.— సుళ్లు ... మ్మిళ్లు శెర సండివో ...

(ప్ర. ద్వి.) పడ.— జోర్స్యెయ్ ...

తండేలు.— పిల్లా జెల్లా అంతా సల్లంగా వచ్చించి,
యిల్లూ సేర్సండి వో తల్లులారా,

కళాసులు.— పిల్లామేకా ... యిల్లు శెరసండి మా ...

(ప్ర. ద్వి.) సిపా. పడ.— జోర్స్యెయ్ ...

తండేలు.— శిక్కాలూ నిండించి శింగాలూ నిండించి,
యిల్లూ సేర్సండీ వో తల్లూలారా,

కళాసులు.— శిక్కాలా ... మాతల్లూలారా.
(ప్ర. ద్వి.) సిపా. పడ.— జోర్నాయ్ ...
తండేలు. — గోదారీ తల్లికి కొట్టారా టెంకాయ
కోరి దణ్ణా లెట్టి కుంకూ మెట్టి.
కళాసులు.— గోదారీ ... కోటిదణ్ణా ...
(ప్ర. ద్వి.) సిపా. పడ.— జోర్నాయ్ ...
పడ.— యేలా యేలా ... ... ...

తృతీ. సిపా.—అరే, యింకొక పాటా పాడండి. యిదేమ్టి గంగమ్మ యెల్లమ్మా? పడుచుపిల్లమీాదా పాడండి వోయ్.

తండేలు.—ఆలాగే పాడతాం సాయిబులు. [కళాసులతో] యేది పాడదాం రా? పాడండి రా?

బజారు యెంటా మిటాయి తింటా
రాయే గుంటా నాయెంటా

కళాసులు.— బజారు ... ... ...
కళా సొకఁడు.— అది పచ్చిబూతురా, లో నొవరో మారా జూన్నాడ్రా.

తండేలు.—మ రేదిరా? 'మళ్లీ వొచ్చిందాకా' పాడదాం.

పడ.—అచ్చెర్రా! అచ్చెర!

[తండేలు పాడినదానిని కళాసులు అనువదింతురు. సిపాయీలు కూడ 'జోర్నాయ్ బార్నాయ్' పలుకుదురు.

మళ్లీ వొచ్చిందాక మర్తూ మ రవ నంటూ,
శేతూలో శెయ్యేశి శెప్పాలే శెంచు. జోర్నాయ్ ...
కూడొండి పెడతాను, గొడ్డుదికి పెడతాను,
కూడా తోడక పోవా జోడుగా మామా? జోర్నాయ్ ...
నీమణుఁచు నామణుఁచు నిరకూ దప్పా కుంటే,
యెడబాశి సెల వుంటె నే మోలే శెంచు? జోర్నాయ్ ...

పిల్లగాడ నీపల్లె నేమిరా చెప్ప బోవోయ్
యేమంటావ నన్నునీవు తుంటారి మామా  జోర్సెయ్ ...
కోకాజరీ తెస్తా, కొప్పుపిల్లా తెస్తా,
నవ్వుతా తల విచ్చి నన్నంపే సెంచు.  జోర్సెయ్ ...
కోకాజరీ వొద్దు, కొప్పుబిల్లా వొద్దు,
కానీవా నీతోటి కాపీ వో మామా?  జోర్సెయ్ ...
సెంపాము క్కట్టుకొని, కొల్లో బాదక, పోదవకు,
అల్లాడే నా రంభ, యెల్ల్పో సెంచు.  జోర్సెయ్ ...

సరంగు.—[చూడ్కి సారించి] మావా! అల్లదుగో ఎంతముసలో.

తండేలు.—[చూడ్కి సారించి] ముసలి గాదు. మనిశావలా వుందిరా.

సరంగు.—కాదు మనిసిరా; బలే యీతగాడ్రా.

తండేలు.—అవునురా. తెగబడ్డాడు. అలిసిపోయినాడు, సావుబదుకుల్లో వున్నాడు, సైగ శేస్తున్నాడు.

సరంగు.—ఆడు తనుకులాట్టంనూ స్తే ముసల్ని తప్పించుకొంటావొస్తున్నాడ్రా.

తండేలు.—నారాయణా? వొకరో బాపనయ్యరా పాపం!

[నేపథ్యమున]

ఓరి పడవవాండ్రూ, ఓసాయబులూ, పుణ్యము కట్టుకొండి! చచ్చితిని చచ్చితిని! మొసలి! మొసలి! మొసలి!

పడ.—యేమి సాయెబుగార్లూ, ఆయ న్నెక్కించుమా? అయ్యవోరు. అమాంతంగా ముసలి సంపేస్తది?

అంతట విద్యానాథుఁడు ఈఁదుచు ప్రవేశించును.

విద్యా.—ఓరి పడవ వాండ్రూ ... మొసలి!

జమాదార్.—పోనీ, పాపం! బతికించండి.

[పడవవాండ్రు త్రాడు వేయుదురు. విద్యానాథుఁడు దానిం బట్టుకొనును. పడవవాండ్రు చేఁదుకొనుదురు.

విద్యా.—[పడవ యెక్కి, వడవడ వడఁకుచు, మహాభీతి నభినయించుచు, చీఁదుచు, బట్టంతయు తడిచేయుచు, గుడ్డలుపిండుచుకొనుచు, తల తుఁడుచుకొనుచు] ఓరిపల్లెవాండ్రారా, మీధర్మాన బ్రతికితిని, ఆచంద్రార్కము మీయిండ్లు వర్ధిల్లుఁగాక. సాయెబులారా, మీదయవలన బ్రతికితిని. ఎంత మొసలి! ఎంతమొసలి!

(ప్ర.) సిపా.—[నోటినుండి చుట్ట తీయకయే] అయ్యా బామ్మన్, నీవు నీళ్లలో బలే నాట్య మాడినావు!

విద్యా.—నాట్యమా? త్రుణము తప్పిన ఈపాటికి మీయెదుటఁగాదు యమధర్మరాజునెదుట నాట్యము చేయుచుందును.

[అని కూర్చుండి సరుదుకొనును.

(ద్వి.) సిపా.—[నోటినుండి చుట్టతివిసి] ఎందుకయ్యా పంతులూ, అంతసాహసం శేచినావు?

విద్యా.—[ఆత్మగతము] పెద్దబొంకు బొంకవలయు; ప్రాణవిత్త మాన భంగములలోఁ జేరవచ్చును. [ప్రకాశము] ఎందునకా? అద్దరిని మాగ్రామము, మాయమ్మకు ప్రాణముమీఁదికి వచ్చియున్నది. వైద్యుఁడు పచ్చిగరళము తెమ్మన్నాఁడు! దాని కోసము ఇక్కడికి రెండుక్రోసుల క్రింద డింగీమీఁద గోదావరి దాఁటి, అన్నము నీళ్లు లేక యెకాయెకి అయిదామడ రావులూరికి పోయి, గరళము సంపాదించుకొని, భోజనము లేకయే, వాయువేగమనోవేగముల, మరల, గోదావరి దాఁటుటకు వచ్చునప్పటికి, ఎక్కడను బల్లగట్టుగాని డింగీగాని ఏమియు లేదు.

(ద్వి.) సిపా.—మొదటా దాటినావే అదీ యేమైంది?

విద్యా.—ఇరువది రేవులు తిరిగితిని, అన్నిటను పగులఁగొట్టివేసినారు. ఈఁతకాయతో దాఁటించినను, దాఁటించినవారికిని దాఁటినవారికిని తల పోవు నన్నారు.

సిపాయీలు.—ఏమి హాశ్చర్యం! ఏమి హాశ్చర్యం!

విద్యా.—వాఁ డెవ్వాఁడో [illegible] ఈయాజ్ఞ చేసినాఁడేఁటి. ఎందుకొ [illegible], ఎం[illegible] ఎక్కైన [illegible] గుదురా!

సిపాయీలు —[illegible] బల్లకట్టుక పగ్గాలొట్టుక పోతే [illegible] యికి పగల్లాట్టుకో రాదా?

(ద్వి.)సిపా.—తర్వాతా చెప్పు పంతులూ.

విద్యా.—తర్వాత. ఏలాగయిన ఈపా [illegible]లోపల మాయమ్మ కీమందు చేయవలయు నని ఏటి కడ్డమీఁద తెగఁబడితిని. ఇక్కడ మడుఁగు, మొసళ్లపుట్ట, నావ్యాకులతలో ఆమాట మఱచితిని. గడియదూర మీఁదునప్పటికి మొసళ్లు లేచుసాగినవి. అయ్యో! తలఁచుకొన్న ఇప్పటికి ఒడలు జలబరించుచున్నది సాయెబూ. [అని జలబరించుట నభినయించును.

(ద్వి.)సిపా.—[జలబరించుట నభియించుచు] వాటితో లడేయిచేశిన వాడికి నీకి జలబరించడం హాశ్చర్యమా, పూర్కే వినేవాడ్కి నాకీ జలబరిస్తూ వుంటే!

[మఱికొందఱు సిపాయీలు జలబరింతురు.

విద్యా.— ఈ మొసళ్ల నన్నిటినితప్పించుకొని రెండు బాటకలలో దాఁటి పోయియే యుందును గాని—

(ద్వి.)సిపా.—అంత యీతపన్నీవా బామ్మణ నీవు?

విద్యా.—మీదయ యున్న, దేవుఁడు మేలు చేసిన, నేను కాలు సేతులు కట్టించుకొని మొగముమీఁద గుమ్మడికాయ పెట్టించుకొని గట్లకడ నేలయంటక యేడుమాఱులు గోదావరి కడ్డమీఁదినవాఁడను సాయెబూ.

పడ.—మూ జెల్లకిఁకం యేడుతూర్లు దాటి యెయ్యివరాలు గెలిశిన సామ్సుల్లవా బాబూ నువ్వు?

విద్యా:—ఔనురా.

పడ.—నిన్ను సూశినాం బ్యామ్మడా మేము. దండ మెడతాం.

విద్యా:—నూజేండ్లు బ్రతుకుఁడు.

(ద్వి.) సిపా.—అయ్యో, నీకి యేలాకోలం చేసినవాళ్లకీ బుద్ధిలేదు. నీతల్లికి నీవు మందిచ్చి బతికించకపోయినా, తీ తల్లిరుణం నీవుతీర్చుకొన్నావు పంతులూ.

(ప్ర.) (వేళాకోళముచేసిన సిపాయి)—ఈపద్వా దొరక్కపోతే యీపాటికి మీతల్లికి చావు అబ్దం నీకి చావునిబ్ధం అయి వుండీని లే.

విద్యా.—[ఆత్మగతము] పూర్వసువాసినీ, ఇంకను హేళనమేనా ? [ప్రకాశము]సందేహ మేమి! మీదయవలన బ్రతికితిని.[ఆత్మగతము]ఇక్కడ నందఱు మహామ్మదీయులే. విశేష మేమియు లేదు. దోనెకగుపులో శేము న్నదో? [అని తట్టంత తడుపుచు,వడవడ వణఁకుచు]జ్వరము జ్వరము! అయ్యో! గోరుచుట్టుమీఁద రోఁకటి పోటైనది! చలిచలిచలి!ఉహుహుహుహుహుహుహు.

(ద్వి.) సిపా.—పండత్, ఇక్కడ తడి చెయ్యకు. లోపల్కి పో. అక్కడ వేయిగా బైటో, చలి వుండదు. ఇద్గో దారి.

విద్యా.—[లేచి] ఏది? ఊ, ఊ, ఊ. హుహుహుహు. [అని కని దిగి మరల పైకి లేచి] ఓయి నాయనో! అంతయు చీకటికోణమే!

పడ.—చణముంటె శీకటుండదులే సామీ.

స్థలము 4. దోనెకడుపు.

విద్యా.—అలైన సరియే.

[అని దిగి క్షణముండి కలయఁజూచి, డబ్బీలోనుండి విభూతి తీసి, చలిపోవునట్లు విస్తారముగా ధరించి, పుస్తక మొకటి తడి తుడిచి చక్కఁజేసికొనును.

రాజు.—[విద్యానాథుం గాంచి ఆత్మగతము] ఏమి! అగ్నిదేవునివలె వెలుఁగుచున్నాఁడీబ్రాహ్మణుఁడు! ఈయనరాకవలన జనార్దనమంత్రి తురకలను గోదావరి దాఁటనీయక ఇచటనే హుళిక్కి గావించుటకై చేయుప్రయత్నము తెలిసినది గదా. నా మంత్రులయందు దోషము లేదు. ఇది కేవలము దైవగతి. దీనికి ప్రతివిధానము యుగంధరులే చేయవలయును. [సవిమర్శనము] ఈయనవలన నావృత్తాంతము మంత్రులకు తెలియును.

విద్యా—[పుస్తకము విప్పి రాగముగా]

*శ్లో. కతిపయదివసైః క్షయం ప్రయాయాత్
కనకగిరిః కృతవాసరావసానైః,
ఇతి ముద ముపయాతి చక్రవాకీ,
వితరణశాలిని వీరరుద్రదేవే.

రాజు.—ఆహాహా! ఏమిశ్లోకము! ఏమిగ్రంథము శాస్త్రులవారూ అది?

విద్యా.—ఇంటులో పిశాచము లేమయిన నున్నవా? [అంతటఁ గలయఁ జూచి] ఈమూల నింతవెలుతు రేమి? [అని రాజుం గాంచి] ఈడోనె కడు పుతో న్నున్నదా యేమి? అయ్యా మీరొక రున్నారా ఇక్కడ నాకుఁ దోడు?

రాజు.—ఆగ్రంథ మేమి?

విద్యా.—[ఆత్మగతము] ఎవ రితఁడు? బాలభాస్కరునివలె జేకటిం జీల్చుచున్నాఁడు! కానీ. [ప్రకాశము] అయ్యా, ఈగ్రంథమా? ఇది అలంకారశాస్త్రము. ప్రతాపరుద్రమహారాజుమీఁద నేను కవనము చేసితిని.

రాజు.—వారిమీఁద నేల చేసితిరి?

విద్యా.—ఏమయిన సమ్మానము కలిగిన కొమారితకు పెండ్లి చేసికొంద మని.

రాజు.—సమ్మాన మేమయిన జరిగినదా?

విద్యా.—సమ్మాన మేది? దర్శన మే పూర్ణానుస్వారము.

రాజు.—అదేమి?

విద్యా.—రాజు నగరములో లేఁడు. నెలదినములు వేచి యుంటిని, రాలేదు.

రాజు.—ఏ మయినాఁడు?

---

*ప్రతాపరుద్రమహారాజుయొక్క యీవిని కని చక్రవాకి తనకు పగటిని అంత మొందించి ప్రియునితో ఎడఁబాపు కలిగించుచున్న బంగారుకొండ త్వరలోనే క్షయించునుగదా యని సంతోషపడుచున్నది.

విద్యా.—ఏమైనాఁడో? ఛీఁట కని కొందఱు, కాశి కని కొందఱు? తెలియ దని కొందఱు, నోటికొకమాట. అంతట ప్రాణము విసిగి, చాలు రాజాశ్రయ మని వచ్చినదారి నే యింటికి మరలితిని.

రాజు.—పోనీ మఱియెవరికైన దాని నంకితముచేసి, సత్కారము పొందరాదా?

విద్యా.—అయ్యా, అంతపుణ్యమా? అంతటను దాని నే తగులవేసితిని.

రాజు.—[ఆత్మగతము] ఆహాహా! ఇట్టిమాట వినవలసిన యీదశలో నిరి రొట్లుండును! [ప్రకాశము] శాస్త్రులవారూ, దయ చేసి ఒకటిరెండు శ్లోకములు చదువుఁడు విని యానందించెదను.

విద్యా.—ఆహా! రసజ్ఞులు వినుటకన్న మా కేమి కావలయును? వినుఁడు.

స్రగ్ధర.

*శ్లో. దూరా దాకర్ణ్య విశ్వప్రసృమరమహసో వీరరుద్రస్య జైత్ర
ప్రస్థానారమ్భభేరీనినద మరినృపాః పూర్ణకర్ణజ్వరార్తాః
ఆరు హ్యాద్రీ న్విశన్తో గహన మతిమహత్ కణ్టకాకృష్టకేశాః
త్రాయధ్వం ముఞ్చ తేతి ప్రతినృపతిధియా పాదపా న్ప్రార్థయన్తే.

రాజు.—ఆహాహా? ఆహాహా! అమృతమా కవనమా యిది?

విద్యా.—దీనిని వినుఁడు.

స్రగ్ధర.

†శ్లో. ఉద్యద్దోస్తమ్భఖడ్గత్రుటదరిమకుటాటోపసంజాతరాహు
భ్రాన్తిభ్రశ్యత్పతఙ్గాభయకరణచణః స్ఫారనాసీరరేణుః

---

*జగద్వ్యాపక తేజుఁడైన ప్రతాపరుద్రుని దిగ్విజయయాత్రా భేరీభాంకారమును దూరమునుండి విని శత్రురాజులు కర్ణజ్వర పీడితులై కొండ లెక్కి కాఱడవులం జొచ్చుచో ముండ్లకొమ్మలు జుట్టుపట్టి లాగఁగా ప్రతాపరుద్రుఁడే లాగుచున్నాఁడనుకొని 'మమ్ము రక్షింపుఁడు, వదలుఁడు,' అని ఆముండ్లచెట్లను వేఁడుకొనుదురు.

† ప్రతాపరుద్రుని కత్తివ్రేటునకు తెగి యెగసిన శత్రురాజుల

ఆధ్రిక్షౌభర్తు రాసీ దధికరణముఖాభిన్న మత్తేభకుమ్భ
ప్రోద్యన్ముక్తౌఘతారానికరపరివృతాః స్వర్వధూనాం శ్చచన్ద్రాః.

రాజు.—మీరు సాక్షాత్తు విద్యానాథులరయ్యా. స్వామీ, ఇచ్చుటకు లేవుగదా నమస్కరించుటకైన నాకు చేతులు లేవు. నాదుస్తులో జేబులో మొహరుంగరమున్నది. దానిం బుచ్చుకొని, కవి గానని దేమున్నది, ఉపయోగింపుఁడు.

విద్యా.—[పుచ్చుకొని, 'ప్రతాపరుద్రమహారాజు' అని పేరుఁ జదువుకొని, ఆశ్చర్యముతో] మహారాజా,

క. నాపేరు నీవు పల్కితి,
నీపే రేఁ గంటి, దీని నీవ్రేలను నే
నే పెట్టువాఁడ, ధర్మ
శ్రీపాలిత, యొరుఁగంటిసింగపుఁభీతిక. 10

[అని యుంగరమును మూటకట్టుకొనును!

రాజు.—[ఆత్మగతము] ఆహా! విద్యానాథుఁడా యీయన పేరు! మహాకవి. ఈయన ప్రతిజ్ఞ చాణక్యప్రతిజ్ఞయే యగును. ఈశ్వరుఁడు చేయూఁత యిచ్చినాఁడు.

విద్యా.—ఇదిగో తరలితిని.

రాజు.—సాష్టాంగనమస్కారములు.

విద్యా.—అభ్యుదయోఽస్తు. [పుస్తకము కట్టుకొనుచు మూటలోఁ బెట్టుకొనుచు ఆత్మగతము] ఏఱు దాఁట వచ్చి సాధనములు లేక వెనుకకు

---

కిరీటములం గాంచి రాహువు అనుకొని సూర్యుఁడు పలాయనమునకు ఉంకింప, సూర్యునికి ప్రతాపరుద్రుని సేనాధూళ్యంధకారము అభయ మిచ్చినది; ప్రతాపరుద్రుఁడు చీల్చినయేనుఁగుల కుంభస్థలములనుండి ఎగసిన ముత్తెము లనెడు నక్షత్రములు(యుద్ధము చూడను, యుద్ధవీరులను వరింపను, వచ్చిన)సురాంగనల మోముచందురుల చుట్టును ఒప్పారినవి.

మరలు వాఁడనై యిచట వాకస్మికముగా గుట్టుపు మెఱపు మెఱసినగతిం బలాయమాన మకుటం గని కుతూహలితుండనై యిటు నడచి, హిందూప్రభువును తురకలు గొనిపోవుటగా శంకించి, ప్రవేశార్థమై నాపన్నినమాయలు నాపలికిన బొంకులును ఎట్లు ఫలించినవి! ఆహా నా మఱపు గలుగుచున్నది. దాలి త్రవ్వఁగా గనియు పుట్టయు నైనది. మఱి ప్రకృతము.

స్థలము. 5 దోనెతట్టు.

[అని తట్టుకొని] అబ్బబ్బబ్బబ్బ! అయ్యో? అయ్యయ్యో! అయ్యయో! అమ్మా అమ్మా అమ్మా! పోయె! చేయి పగిలిపోయె. ఈశ్వరా! ఈచేయి యిక్కడి కెవ్వరును తెగఁగొట్టరేరా? అయ్యో! అప్పుడే బుజ మెక్కినది. ఓయి నాయనా! వెదురుబొంగు చీల్చినట్టు చీల్చుచున్నదిరా! [అని తన్నుకొనుచు కొట్టుకొనుచు ఉండును.

(ప్ర. ద్వి.) సిపా.—[చూచి ఉలికిపడి] అరే యేమిరా యీబూడిదాభూతం!

పడవవాండ్రపిల్లవాఁడు.—ఓయిబాబో! బేతాళుడ్రా మామో !

[అని కన్నులు మూఁతపడి తండేలును కౌఁగిలించుకొని నిలుచును.

(ప్ర. ద్వి.)—కాదురా అసాస్తుల్లురా.

తండేలు.— బయం లేదు లే అమ్మా, బయం లేదు లే, బేతాళుడుగాదు, సాస్తుల్లు. [పిల్లవాఁడు ఆశ్వసిల్లును.

(ప్ర. ద్వి.) సిపా.—ఏమి పంతులూ నీ కీ గహచారం?

విద్యా.—[ఒకచేతితో రెండవచేయి పట్టుకొని మిక్కిలి శ్రమతో] అబ్బా, అబ్బా, అబ్బా. తేలు సాయెబూ, తేలు!

(ప్ర. ద్వి.) సిపా.—ఏమి గహచారం !

విద్యా.— కడుపునొప్పి, దిగవలయును, మూత్రము.

సరంగు.—సామీ, యీమూల నీలలో కూకోండి,

విద్యా.—అయ్యో అయ్యో! నేను గోదావరిలో ఆపని చేయను.

సరంగు.—సరి ! మ రెలాగ మరి!

విద్యా.— [పొడుముపొట్లము నీట జారవిడిచి] అయ్యో అయ్యో! నామందు పడిపోయినది! అయ్యో! మునిఁగిపోయితిని! ఏమి పాడుదినమురా! ఎవరి మొగము చూచితినోరా! ఈగ్రహచారము చూడఁగా, నాయమ్మ చచ్చియే పోవునేమో! పడవవాండ్లారా, సాయెబులారా, పడవను దరికి పట్టింపుఁడు.

జమా.— దరికిపట్టింప్రదా? నీళ్లలో పడిపోవ నీ, మాప్రాణాలు తినడానికి వచ్చినావ్.

విద్యా.— నామందు పడిపోయినది, నామందు పడిపోయినది. అబ్బబ్బా! విషము, కడుపునొప్పి, మూత్రము. నేను మరల మందు తెచ్చుకొనెదను, ఈ దక్షిణపుదరికే పట్టుఁడు.

జమా.— అరే బొమ్మర్ పిసానీ, నీకోసం మల్లీ రెండూమూడూ గడియల్ యెన్నాకీ యెల్తాం?

విద్యా.— అయ్యో చచ్చిపోవుచున్నాను! చచ్చిపోవుచున్నాను!

[అని మొదట పడుక వేసిన సిపాయికడ(పాదప్రణీతునికడ) రోద పెట్టును.

పాద.— [దద్దిరిల్లి లేచి, చింతనిప్పులవంటికన్నులతో] ఎవఁడ్రా యీ పనేశ్వరుడు పైతాన్ ముండాకొడుకు?

[అని విద్యానాథుని నీళ్లలోనికి త్రోయును.

విద్యా.— శివశివా!

[అని నీటఁబడి మునిఁగి తేలి తన్నుకొని మరల మునుఁగును.

తంజేలు.— [చూచి] బుటకేసినాడు. తెప్పిరిల్లినాడు గాని, మల్లీ మునిగినాడు. ఈపాలి మునఁతే సంపేస్తదో, నీలు దాగే సస్తాడో? ఇంతీతిగాడికే నీటిగండమైతే యింతకంటే యేంటింత!

పాద.— ఈపాలి వాడియీత గడ్డపార యీతే. అముండాకొడుకు యేమైతే యేం? తొరగా పోనిండి పడవ.

తండేలు.—యెయ్యండ్రా గడెయ్యండి. [వేసి] ఏలెస్సా, బేలెస్సా, ఏలెస్సా, బేలెస్సా, ఏలెస్సాబో బేలెస్సా, ఏలెస్సాబో బేలెస్సా, యేలా...
[పడవ నిష్క్రమించును.

స్థలము 6. గోదావరి గట్టు

విద్యా.—[గట్టెక్కి ఒడలు తుడుచుకొని, గుడ్డలు పిడుచుకొని చెట్లకు ఆఱవేసికొని] ఎంతశీఘ్ర గాలికి తుణము. [నిక్కి నలుగడం జూచి] ఎక్కడను ఊరు రగపడదు. [నీటివైపు మరలి] ఇంత సేపు నీళ్లలో నే ఉన్నను, ఏమి దప్పి! [సవితర్కము] దప్పియో, చిత్తవికారమో, కార్యభారమో? [విభూతి దాల్చి] అహో! వస్త్రము లాఱినవి, ధరించెదను. [విప్పి పుచ్చుకొని ధరించి] అస్తమయము కానున్నది. చీకటి పడిన గడియదూరమే అమడ యగును, [పరిక్రమించి, పడవలదిక్కు చూచి] శివశివా! దాఁటించిరి గదా తురకలు మహారాజును గోదావరిని, యమకింకరులు యాతనాప్రాణిని వైతరణిని దాఁటించునట్లు! హా! దైవమా! హా! దైవమా! ఎట్టి ప్రభువున కెట్టి గతి పెట్టితివి.

ఉ. కట్టిఁడిదైవమా, యెటులు [1]కాఱియ పెట్టితి రాజశేఖరుఁ
గుట్టెనె కన్ను చెంపపయిఁ గొట్టెనె తన్మహిమాతిరేకముల్?
[2]చెట్టలు లేరె నీ చెనఁటిచేష్టల కగ్గము సేయ? నిస్సిరో!
దిట్టవు, మొండికట్టియవు, తిట్టుల కే యొడిగట్టె దెప్పుడుఁ! 11

ఆ. ఈఁగకూన చెనకు నింక [1]విష్ణురథంబు,
శరభరాజు నణఁచు సాలెపురువు,
పార్థివేంద్ర, నిన్ను బ్రందిఁ జేసెఁ బటాణి,
తరము గాని దొకటి ధరణిఁ గలదె! 12

చ. పరముఁడు వేదపూరుషుఁడు పాదలిసోమకుచేతఁ జిక్కఁడే!
హరిహరపద్మభూములయుఁ డహస్కరుఁ డాఁగఁడె వింధ్యుఁడాఁపఁగా?

---

11. 1. బాధ, 2. దుర్మార్గులు. అగ్గము=పాలు.

12. 1. గరుత్మంతుని. శరభము=ఎనిమిది కాళ్లజంతువు. సింహమును కొట్టునది.

ధరఁ గలయప్రదేవకప్ర దక్కాతి పివ్రు ?టా పటాణికిన్!
¹వరశిఖిధిప్రతారణలు దప్పునె మేదిని నెట్టివారికిన్! 13

ఉ. ప్రోదకశాసులున్, దెలివి ప్రో వపమాలిమి, మాత్తురకా యను
¹క్రోడము సేర్పుబంట్లు, ²తెరకోకలు, గ్రాలఁగ ఏల సేఁగుచున్.
ఓడ విరుద్ధవాయుహతి నుత్తర ³వార్నిధిఁ జొచ్చి వ్రేల్మిడిన్
బూడెను బో ⁴శిలాహిమసమాహముఁన్! విధి యెంత ఘాత్రమో. 14

[మరల నలుదెసల చూడ్కి నిగిడించి] ఎక్కడను మనుష్యప్రాణి యగపడదు. [మఱియొక దెసఁ గని] ఆహా! ఏమి యిది, అడవి మొఁగాళమున అందఱు జనులు! దండు; తురకలు గారు, వేఁట సిబ్బంది. అయ్యో! రాజపరివారము! రాజును వెదకుచున్నారు. ఆహా! యిందాఁకటిగుఱ్ఱము ముందు దుముకు చున్నది. ఆదండును రాజు దోనియం బడినచోటికిఁ దెచ్చుచున్నది.అక్కటా! రెండు గడియలకు ముందు ఈదండు వచ్చియుండరాదా! ఏమి హతవిధివిలసితము! ఏమి యీగుఱ్ఱము విశ్వాసము! కాలకూటము హరుని కంఠమున, బౌర్వానలము సముద్రుని కడుపున ప్రతాపరుద్రమహారాజు కార్యము నా హృదయమున. తిర్యగ్జంతు వింత యుపకరించినదఁట, మహాకవి నఁట,ఎంత యుపకరింపరాదు! బార్హస్పత్యౌశనస చాణక్య తంత్రాధ్యయనము పందలకడ సందడింపనా! ప్రతిభకు ఏయుల్లిక కష్టము? కావ్యధోరణిని కార్యధోరణిం

13. పాడుసోమకుఁడు వేదమును దొంగిలించినాఁడు, త్రిమూర్త్యాత్మకుని సూర్యుని వింధ్యపర్వతము అఁపివైచినది... 1. చపలమయిన దైవము యొక్క వంచనలు...

14. 1. అోమ్మున, 2. తెరచాఁపలు, 3. సముద్రము, 4. రాతిమంచు మొత్తములో. సేనానాయకులు, దండు, మహామంత్రి, విజయధ్వజములు, లోనగుసంగములు బలిష్ఠముగాఁగలిగియు, ప్రతాపరుద్రుఁడు, దుష్టదైవప్రేరణచే వేఁటకై గోదావరీతీరారణ్యమున కేఁగి కఠినాత్ములైన తురకల రాఁబవలో చెఱలోఁ బడెను.—అని ప్రస్తుతము.

జేసెద. ఈదండుం గలయుదునా? కవలదు. ఈమూఁకనోట నువుగింజ నానదు. ఇల్లేపోయి యేదేనొక గ్రామముచేరి కావ్యప్రబంధము నిబంధించెదఁగాక. అమ్మాయి పెండ్లి కేమి తొందర? రాజకార్యధురంధరునకు నాకు ఇఁక యోగ కాలము. అమ్మాయి పుట్టకమునుపే ఈకృతిని సంకల్పించితిని. కావున ఈ కృతియే నా పెద్ద కొమారిత. దీనిని ఓరంగోలు సింహాసన వివాహపీఠమున రాజునకు పెండ్లిచేసి పిమ్మట పురందరగురు విభవముతో చిన్నమ్మాయికి పెండ్లి గావించెదను. [గోదావరి యుత్తరతటముదెస దృష్టి సారించి] రాజప్పుడే తన రాష్ట్రముం బాసెఁ గావలయు. ఉజ్జృంభితమైన తదీయహృదయాంధకారమా లోకమెల్ల నాక్రమించుచున్నది! [నలుదెసలం గని] ఆహా! ఎటు గన్నను లోకము రాజుకై వగలఁబొగులుచున్నది.

ఉ. దండితవైరివీరునిఁ బ్రతాపనరేంద్రుని ముల్లెమూటగాఁ
గొం డని దైవ మీతురకమూకల కీఁ గనుఁగొన్నమింటికిన్
గుండియ వ్రీల నెత్తురుల గుజ్జుకండలు రెండునుం బతే
చండగభస్తిమండలము, శైవలినీకనితార్కబింబమున్! 15

ఓ గోదావరీ,

ఉ. వేసర కేడ్చె దేల, యరవిందసఖప్రతిమారుణాస్యమున్
మూసికొనంగ శైవలపుమూర్ధజముల్, గడు గాలి నూర్చుచున్.

---

15. శత్రువీరులను దండించిన ప్రతాపరుద్ర మహారాజును ధనపు మూటగా 'ఇదిగో పుచ్చుకొండి' అని దైవము క్రూరులగునీతురకలకు ఇయ్యఁగాఁ చూచిన యాకాశమునకు గుండె పగులఁగా నేర్పడిన నెత్తుటిగుజ్జుతోడి రెండు బ్రద్దలువుమా ఆకాశమందలి (యీసాయంకాలపు) సూర్యబింబమును గోదావరిలోని (యీ) తత్ప్రతిబింబమును.

16. సూర్యప్రతిబింబ మనెడు కందిన ముఖమును నాఁచనెడు తల వెండ్రుకలు క్రమ్ముకొనఁగా, (ఈసాయంకాలపు) గాలియను మిషచేత నిట్టూర్పులు నిగుడ్చుచు, ప్రకాశమానములయిన సుడులనెడు వళిత్రయము మాటి మాటికి పయిపయి అగపడుచుండఁగా జక్కవదంపతు లనెడి పాలిండ్లయు

భాసురవీచికాత్రివళి పైపయిఁ బోఁప, రథాంగయుక్స్తనో [illegible]ము,
చ్ఛ్వాసముమీఱ, మాఘకరసంక్రుతిమూల్గున, నంచ యెల్గునన్? 16

తే. ఆహితవిధి కిట్లు రోషానుడాత్ముఁ డగుచుఁ,
కుతలపతిపాలునకుఁ 1గాక, క్రుంకుమెట్టఁ
జరమ కాష్ఠా చిత సమిద్ధ సాంధ్యరాగ
వహ్నికుండానఁ బడె 2లోకబాంధవుండు. 17

క. కువకువ 1వాహోవుఁ 2దరుల్,
సవసవ 3బాష్పాంబువృష్టిఁ 4జవలుం గురియున్,
5శివలవిరుతి నేడ్చు దిశల్,
6పావని నవసి పేదవడియె భువినెమ్మొగమున్. 18

ఆ. 1జ్యోత్స్న గలుగ వెలిఁగి జోత్స్న వీడి చనంగ
విన్నవైనపూర్ణ 2విధునిపగిది,
సిరి గలుగ వెలింగి సిరివాయ క్షణములోఁ
దేజ మెడలె రుద్రదేవుముఖము. 19

---

బుకు అతిశయిల్లుచుండఁగా, తుమ్మెదల ఝంకారమనెడు మూలుగుతోను హంసకూఁతలనెడు, కంఠధ్వనితోను విసువక ఏల యేడ్చెదవు?

17. కుతలపతి=రాజుయొక్క, 1. ఓపక, 2. సూర్యుఁడు. చర... మిద్ధ—చరమ=కడపటి-కాష్ఠా=దిక్కునందు-చిత=పేర్పఁబడిన (కాష్ఠ=కట్టెలతో-ఆచిత=పేర్పఁబడిన) సమిద్ధ = మండిన - సా ...డానన్=సంజకెంజాయ యనెడు నిప్పుల గుండములో.

18. 1. ఏడ్చెడును, 2. చెట్లు, 3. కన్నీటివర్షమును, 4. ఆకాశము, 5. నక్కల యూళలచే, 6. భూమియొక్క యందంపుమోము పొగలుగ్రమ్మి కృశించి కళదప్పినది. పక్షులు చెట్లలో చేరి కూయుట, సంజమంచు పడుట, నక్కలు అఱచుట, రాత్రి వంటలకై నిప్పు రాజవేసికొనెడు పొగలు వ్యాపించుచుండుట, చీకట్లు పడుటయు, ఇట్లు వర్ణింపఁబడినవి.

19. 1. వెన్నెల, 2. చంద్రునివలె.

జేగ॰ క. కత చేయుట, కత చెప్పుట,
కత వ్రాయుట, కతను నాటకం బాడుటయున్,
గత నెఱుఁగుటయును, చేటే;
కతయ యగుట చేటె; దైవగతి యింత గదా! 20

క. కతగా చేసినయది నీభూ
పతిగతి యాలింప నుండె పట్టున స్త్రీలన్,
వెతకు మితియె కంటెఁ గనన్?
మతి వాఱున్ భ్రమియించుఁ జడియు మఱచుం బఱచున్. 21

క. తబ్బిబ్బాయెను బని చెడు;
నబ్బురపా టైన నీతి యొందకుదు, లగున్;
మబ్బు తొలఁగించుకొని యిదె
గబ్బితనము దాల్చి రాజకార్య మరసెదన్. 22

అహహా! నా హృదయము *జగన్మిథ్యాత్వ రాద్ధాంత నిశాంతం బయ్యె నిట వహాహా! పిండంబువోలె చేలవతా భాజనం బైనది, దీనిం గాంచి నను క్షణములో నగవు క్షణములో వగపును గలుగుచున్నవి. అరాజకలక్షణమా? మంచిది; †విషాదము ‡స్త్రైణము, §వ్యవసాయము ¶పౌరుషము, అనభ్యస్తరాజకార్యుండను ఎట్లు కార్యధోరణిం బాటింతును! [ఇంచుక ఆలోచించి] ఇట్లగుంగాక:—ఈ కొణతివాడ కరిగి కరణప్రభృతిరాజకీయుల సిడి ద్రిప్పి రేపు మధ్యాహ్నము మంత్రిసన్నిధి నుండెద. కరణమునింటు అతని గ్రామాధికరణకప్రభృతులం జేరం బంపివేసి, అతఁడు వారిం దోడ్కొని వచ్చునంతలో రాజదత్తములుగా శ్రీప్రతాపరుద్ర మహారాజ నియుక్తత్రిలింగ రాష్ట్రసర్వధర్మవిచారణాధ్యక్షుండనియధికారమును నిర్దేశించుశాసన మొకటి, స్వగ్రామములమంత్రి సమానముగా సన్మానము జరిపిపిలిచినవారిమునుపులో

* ప్రపంచము అసత్య మనెడు సిద్ధాంతమునకు చోటు, †దుఃఖించుట, ‡స్త్రీలది, §ప్రయత్నించుట, ¶పురుషులది.

వ్యయము వ్రాసికొనవలసినదిగా గ్రామాధికారులకు రాజశాసన మొకటియును, వ్రాసి, కాలముల్లు గ్రుచ్చుకొన్నదని జేడిగింజ తెప్పించి, రెంటికిని రాజముద్రికలు వేసి యుంచుకొని, గ్రామాధికారులకు చూపెదను. సన్నాహశాసనమునకు నిరువదిప్రతులు వ్రాయించెద. అందులోనే ప్రతిగ్రామాధికరణునకును తనశాసనము తానుపుచ్చుకొని కడమవానిని పైగ్రామాధికరణునికి తత్క్షణమే పరుగుపరుగున మీఁద పంపునట్లు వ్రాయించెద. అన్నిటికిని ఇతరులను కనుమొఱఁగి రాజముద్రికయే వేసెద. ఈ ప్రయోగముచే గ్రామగ్రామంబునను సవారి, పమనార్థము బోయీలు, వెంబర బంట్రౌతులు, జోడు దివ్వటిగాండ్రు, వీరినెల్ల నేను చేరకముందే పుట్టించియుంచెద. అహహా! రాజముద్రికాప్రభావము! ఈ కరణముపేరు కోణకంచి బుచ్చన్నయఁట. ఈనియోగి కనులకు మెఱఁగువగా గంత వేయవలయును. ఆవులించినఁ బ్రేవు లెన్నుజాతి యిది. నాకవనమునకు మెచ్చి రాజిచ్చిన యీయధికారమును చెల్లింపక ముందుగా అద్దరిని తల్లింగనఁగోరి వినీతవేషాభిలాషినై నిష్పరివారముగా వచ్చి, ఏయుదాఁట సాధనములు లేక, మరలితి నని బొంకి కరణమును సమాధాన పెట్టెదను.

క. కుదిరెఁ బదక మిప్పటికిన్,
బదిలముగా మంత్రి కొఱుకపడు లేపటికిన్;
సదమదము గలుగు పిమ్మట;
మది కరఁగదో యింక నైన మలఁకల విధికిన్? 23

గట్టు దిగి అయూరిదారి వెదకెద. [అని నిష్క్రమించును.

# చతుర్థాంకము.

స్థలము:—ఓరుగల్లు, యుగంధరమంత్రిహవేలి, కచ్చేరిశాల.

అంతట యుగంధర జనార్దనులు ప్రవేశింతురు.

యుగం.—వత్సా జనార్దనా, నీజాగ్రత్తకు సంతోషమే, కాని,

ఉ. ఏల చొరంగనిచ్చితివొ యాతురకణ్ మనసీమలోనికిన్ ?
చీలుప వేమి యిట్లుగడు సేసినవీని నెఱింగినప్పుడ?
ఏల పటాణి సేతలకు నీసులు పెట్టి పరస్పరంబు ఖూ
నీ లొనరింపఁ జేయవు? మనీషివి, నీతలఁ పేమి బాలకా?

జనా.—వారియందు సప్రయత్నుఁడను గానే యున్నాను.

యుగం.—చెకుముకి దొరకినాఁడా యేమి!

జనా.—అవును.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి, సేనాపతి బేతాళరావుగారు వచ్చియున్నారు.

యుగం.—రమ్మను.

ప్రతీ.—మహామంత్రిగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

యుగం.—[చింతించుచు ఆత్మగతము] చీలినతురకదండు రాలేదు, పోయినప్రభువు రాలేదు. ఆదంటేమియిన ప్రభువుతు పట్టుకొనిపోయియుండునా? [వామాక్షిస్పందనము సూచించి] అక్కటా! వామాక్షి పట్టువడెననుచున్నది!

అంతట బేతాళరావు ప్రవేశించును.

బేతా.—జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—బేతాళరావూ, కూర్చుండుము. నీజాగ్రత్తకు మిగుల సంతోషము, తమ్ముఁడు నీపనిని సులభపఱుచుచున్నాఁడు.

బేతా.—దేవరవారు పెట్టినంతపనికే మిక్కిలి కృతజ్ఞుఁడనయ్యెదను.

యుగం.—మాసేతికి శేషించినది నీది, నీచేతికి శేషించినది మాది.

బేతా.—తమ రక్షు చెప్పటమే. తమరు రాఁగానే మాకేమియు శేషింప దని నిరాశ చేసికొంటిని.

యుగం.—న్యాయ్యమే.

క. మానులకుఁ దపము తెల్గో
భూనాథుల కట్లె సైన్యములు, కరణీయం
బైనవి, వ్యయ మొనరింపఁగ
గానివి, మఱి తీఱనికొలఁగాములఁ దక్కన్. 2

అయినను ఈనాఁటి మాయాజ్ఞ కాఁగానే నీదండు అనుమకొండదండు రెండు ప్రక్కలం బోదివి, యీతురకదండును రూపు మాపవలసినది.

బేతా.—మహాప్రసాదము.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి. శిరస్తా విశ్వాసరావుగారు, సురపురం జమీన్దార్ విజయరామరెడ్డిగారు, రెడ్డిసముద్రం జమీన్దార్ నాయణరాజుగారు, చెకుముకిశాస్త్రి, ఇంక ననేకమంది జమీన్దారులు, ఉద్యోగస్థులును, వచ్చియున్నారు. అందరు దర్శనానికి మామూలుగా సెలవు గలవారే.

యుగం.—అందఱను రమ్మను.

అందఱు.—[వచ్చి] జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—కూర్చుండుఁడు. [వచ్చినవారు కూర్చుందురు.

యుగం.—మీరందఱు సప్రయత్నులే. నేను వచ్చి విశేష మేమి?

జమీన్దారులు.—తమరాక రాజ్యాంగముల భయసన్నిపాతమునకు దివ్యౌషధమైనది.

బేతా. విశ్వా.—తమరాక వాడినచేనికి వర్షమైనది.

యుగం.—[ఆత్మగతము] మఱి ప్రభువుస్థితి?

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

[అని చేతికి చీటి యిచ్చును.

యుగం.—[ఆత్మగతము] ప్రభుపుస్థితి జయమఁట. హామాక్షీ పట్టుబడె వన్నది. ఇంక నా ప్రయత్నము ఫలయునా? [దక్షిణబాహుస్ఫురణమును సూచించి] అహో! సర్వము నా ప్రయత్నముననే సాధనీయ మని దక్షిణ బాహు వెచ్చరించుచున్నది! [చీటిపుచ్చుకొని చదివి ఆత్మగతము] "మంత్రి సహాయుఁడను, కార్యము చెడినది, తత్క్షణము దర్శన మీయవలయును." అని చీటి. విద్యానాథమహాకవి అని చేవ్రాలు. బళి! ఇతఁడెవరో పరమనిపుణుఁడు,- రాజుస్థితిని ఎఱిఁగి వచ్చినాఁడు, కార్యము చెడినది? నా యూహ తప్పలేదు. [ప్రకాశము] ధర్మసింగ్ ఆయనను తోడ్కొనిరా.

ప్రతీ.—[విద్యానాథునిం దోడ్కొని వచ్చి] వారుగో మహామంత్రి గారు.

యుగం.—[విద్యానాథుని పరికించి స్వగతము] మంచి వర్చస్వి. మహాకవి, మంత్రరత్నకుఁడు, ప్రయోగభంగము చేయఁడు. [ప్రకాశము] ఇక్కడ ఇక్కడ. [అని దగ్గఱకు పిలిచి] ఎవరురా అక్కడ? కుర్చీ కుర్చీ!

[నౌకరు కుర్చీ తెచ్చి యుగంధరుని ప్రక్క నుంచును.

యుగం.—[విద్యానాథుని నిదానించి చూచి లేచి] విద్యానాథ మహాకవి యనఁగా నెవరో అనుకొంటిని. నాప్రాణమే. [అని కౌఁగిలించుకొనును.

విద్యా.—[కౌఁగిలింతలోనే చెవిలో] రాజును తురక ఢిల్లీకి కొని పోయినాఁడు.

యుగం.—ఎన్నాళ్లకు! ఎన్నాళ్లకు! [అని మరల కౌఁగిలించుకొని చెవిలో] వేఁటగాయములతో రాజు బెడఁదపూడిలో రామావధానులయింట నున్నట్టు జాబు తెప్పింపుము.

విద్యా.—[కౌఁగిలింతలోనే చెవిలో] చిత్తము.

యుగం.—కూర్చుండు తమ్ముఁడు కూర్చుండు.

[విద్యానాథుఁడు కూర్చుండును.

యుగం.—జనార్దనా, ఎవరో ఎఱుఁగుదువా?

జనా.—[హర్షాశ్చర్యములతో] ఆహా చిన్నన్నయ్యా!

[అని లేచి వచ్చి పాదముల వ్రాలును. విద్యానాథుఁడు,
లేచి కౌఁగిలించును జనార్దనుఁడు హర్షించును.

యుగం.—ఇరువదియేండ్లకా అన్నజ్ఞప్తికి వచ్చుట?

విద్యా —అఖ్యాతి సంపాదించుకొనిగదా సన్నిధి నుండవలయును .?

యుగం.—తమ్ముఁడు తిరుగవేయుచు లేఖపత్రము సాక్షరము ఇఁక లేదుగదా?

విద్యా.—అంతయు తమయాశీఃప్రభావము, తమకు నెల పట్టినవిద్య నాకు సంవత్సరము పట్టినది.

యుగం.—పదేండ్లు నీవార్తయే తెలియక అమ్మ పడినదుఃఖము చెప్ప లేము. నీవు కటకములో ప్రభాకరజ్యోతిషికుల తోడాలు లాగుకొన్నప్పుడు గదా మాకు ఏ వార్త తెలియుట?

విద్యా.—ఏమో బాల్యచాపలము.

యుగం.—ఇప్పుడు ముసలివైతివి గాఁబోలు ? నీ ప్రథమోపాధ్యాయులు ఘనపండా దిగ్విజయజ్యోతిషికులు క్షేమమా?

విద్యా.—క్షేమముగా నున్నారు. దర్శనముచేసికొని వచ్చితిని.

యుగం.—ఆతోడాలు చేతుల నున్నవా? [అనిచేయిపట్టుకొనఁబోవును.

విద్యా.— ప్రయాణములో తీసిపెట్టి వచ్చితిని.

యుగం.—పదునెనిమి దేండ్లకు పదునెనిమిది విద్యలు ముగించి, రెం డేండ్లు దేశాటన రాజసభాప్రవేశములు గావించి యిప్పుడు అన్నకడకువచ్చి తివి. [జనార్దనునితో] తమ్ముఁడూ మీ చిన్నన్నయ్యను అమ్మకు చూపింపుము.

ఆ. అమ్మ నేఁడుముడుపు లంపుఁ బో చెటి లక్ష
విశ్వనాథునకును వేంకటాద్రి
నాయకునకు రంగనాయకునకు రామ
నాథునకును సోమనాథునకును.

చిన్నన్నయ్యను భోజనాదికము విచారించుకో, మరల పొఱపోకుండ సేవించుకో, భోజనము కానిచ్చి తీసికొనిరా, జ్యోతిషవినోదము కొంచెము చూడవచ్చును. [జనార్దన విద్యానాథులు నిష్క్రమింతురు.

యుగం.—[సభ్యులతో] ఇతఁడు మా పినతల్లి కుమారుఁడు.

క. ఈతని జన్ననితోడన్
మాతల్లియె పెంచెఁ గవలమాడ్కిన్; మహా వి
ఖ్యాతి గలజోస్యు; డీతని
చేత మనము దెలియవచ్చు క్షితిపతివిధమున్. 4

సభ్యులు.—తమదర్శన మైనపిమ్మట దారి యేర్పడక తప్పునా? ఇఁక మేము గోలీలు బొంగరములు ఆడుచుండవచ్చును.

యుగం.—ఏమి చెకుముకిశాస్త్రీ, వీరాంజనేయు మేమి చేసినది?

చెకు.—తోఁక జాడించి కన్నులలో మన్నుకొట్టుచున్నది.

యుగం.—ఎంత సేపు కావలయు మన్నుకొట్టుటకు?

చెకు.—గరుత్మంతుని దృష్టి గద్దలకుఁ గలుగునా?

[విద్యానాథ జనార్దనులు వచ్చి కూర్చుందురు. వేరిగాఁడు
ను వచ్చి యుగంధరునికి విసనకఱ్ఱతో విసరుచుండును.

యుగం.—విద్యానాథా, కొంచెము వీరికి జ్యోతిషవినోద మొసంగుదువా?

విద్యా.—తమయాజ్ఞ. [బేతాళరావును జూచి] మీచేయి చూపుఁడు.

[బేతాళరావు చూపును.

యుగం.—మీరు కానిచ్చుచుండుఁడు. [అని వ్రాయుట నభినయించును.

విద్యా.—మాది ఓఢ్రజ్యోతిషము. మాకు చేయి చాలు, జాతక మనావశ్యకము. వేయేండ్లక్రిందటివారి దైనను సరియే, సరిగా చేతితస్వీరు తీసియుంచిన వారి దినచర్య యావత్తు చెప్పఁగలము. మీకిప్పుడు సూర్యునిలో అంగారకుఁడు. మీ నామధేయము?

బేతా.—వే [అని సగములో]

విద్యా.—మీరు చెప్పకుఁడు, బేతాళరాజా.

సభ్యులు.—ఏమాశ్చర్యము! ఏమాశ్చర్యము!

విద్యా.—యుద్ధము, జయము, జేపు.

బేతా.—సంతోషము. గతము చెప్పుఁడు, తార్కాణగా.

విద్యా.—[చెవిలో] మీరు అయిదేండ్లక్రిందట విజయనగరమునుండి దండుతో వచ్చుచు తుంగభద్రకడ విడిసి గట్టుమీఁద ఒంటిగా నిశాకిపోయి నప్పుడు గొల్లపడుచుచే చీవాట్లుపడిన చరిత్రము చెప్పుదునా?

బేతా.—స్వామీ, ఈయన యెవరో దేవుఁడుగాని మనుష్యుఁడు గాఁడు, ఇది దివ్యదృష్టిగాని జోస్యముగాదు. స్వామీ, ఇఁక నాకుచాలును.

విశ్వా.—ఆహా అంతటివాక్సిద్ధియేని నాజాతకము కొంచెము చెప్పుఁడు.

[అని చేయిచూపును. పేరిగాఁడు తెఱచిననోరు మూయక ఆశ్చర్యపడుచు పరికించుచుండును.

విద్యా.—[విశ్వాసరావుచేయి చూచి] పంతులకు గురువు ఉచ్చ, వాక్స్థానమున; మహాయోగజాతకము, మహావాగ్మి.

బేతా. ప్రభృతి సభ్యులు.—బళిబళి, ఏమి విశ్వాసరావుగారు? అనుభవసిద్ధమా? ఇప్పుడైన మామాట ఒప్పుకొందురా? [విశ్వాసరావు నవ్వును.

విద్యా.—బహుసమర్థుఁ డీయన. గుండెలు తీసిన బంటు. ముగ్గురు కుమారులు. పెద్దవానిజాతకమున మీనలగ్నములో గురువు. వాఁడును ఇంతటి నోఁటివాఁడే. భార్య మహాపతివ్రత. పంతులకు కూడ ఏమయిన తార్కాణ గావలయునా?

విశ్వా.—చెప్పుఁడు.

విద్యా.—[చెవిలో] పంతులూ, నీవు మూఁడేండ్లక్రిందట సురపురము జమీనును కాపాడుటకై మాయన్నగారిచేవ్రాలు చేసి పెద్దసెట్టికడనుండియొను బదిలక్షల వరహాలు తెప్పించి సర్కారుఖజానాకు చెల్లించి మూఁడవనాఁడు మరల మాయన్నగారే పంపినట్లు అతనికి పంపలేదా?

విశ్వా.—[తటాలున కుర్చీనుండి దుమికి విద్యానాథుని పాదములుపట్టుకొని] మహానుభావా, నాగుట్టు దాఁచి నాతల కాచెద నని వర మిచ్చిన యీపాదములు వదలెదను. [పేరిగాఁడు ఆశ్చర్యముతో తెఱచిననోరు మూయక చూచుచుండును.

విద్యా.—వర మిచ్చితిని పో.

విశ్వా.—[తనకుర్చీలో కూర్చుండి ఆత్మగతము] ఇతనిజోస్యము ప్రాణోపద్రవముగానున్నదే! పోయెడుభూత మీచెట్టుకొమ్మను విఱుచుకొని పోవునుగాక. [ప్రకాశము] సర్వజ్ఞమూర్తీ, బ్రహ్మవాక్కయినను తప్పనుగాని మీవాక్కు తప్పదు. పోనీ కేనధికప్రసంగినని తమరు ముందే సెలవిచ్చినారు గదా. వీనిచేయి చూడుఁడు. [అని పేరిగానిని చూపును.

విద్యా.—రారా.

పేరి.—[వణఁకుచు తబ్బిబ్బుగా వచ్చి] యిదుగో సూసుకోండి నే నేమెరగను. [అని రెండుచేతులు బోరగించి చూపును.

విద్యా.—[ఆత్మగతము] ఈమహానుభావుఁ డేమో వేతే దారితీయుచున్నాఁడు. [ప్రకాశము] వీఁడు చాకలి, పేరు పేరిగాఁడు; వీని పెండ్లాము ఎల్లి.

పేరి.—[భయముతో వడఁకుచు వెనుకకుఁ బోయి తనతావున నిలిచి] మహాప్రెబో, నాను సత్తెప్రెమానకంగా చెప్తా. నాను తీలేదుండి, ఆదీ తీలేదుండి.

జనా.—ఏమిరా నీవును అదియు తీయలేదు!

పేరి.—వుంగరం మారాజా?

జనా.—ఏ యుంగరమురా?

పేరి.—[విద్యానాథుని చూపుచు] ఆమారాజు పోంగొట్టుకున్నా వుంగరముండి.

జనా.—నీవు తీయకపోయిన, ఆయన యుంగరము పోఁగొట్టుకొనె నని నీ కెట్లు తెలిసినది?

పేరి. — అరిశేతులోది ఉంటదేమో అని, యీరిశేతులోది ఉంటదేమో అని, ఒకరొకరి శెయ్యా సూడటం, [విద్యాసరావును చూపుచు] యీమా రాజు అయన కాళ్లట్టుకొని 'నాగుట్టు దాసండి నాతల కాసండి' అని, సామి దెట్టి నన్ను సూపటం, యిదంతా నాను సూల్లేదండీ!

బేశా. జమీన్దార్లు. — [నవ్వుచు] ఏమయ్యా ఉంగరము చోరీ చేసి, పాపము! లోఁకువ యని వానిమీఁద పెట్టుట న్యాయ్యమా?

విశ్వా. — నే నేఁటరా నీమీఁద పెట్టినాఁడను?

పేరి. — రచ్చించండి మారాజా, నానెరగనండి. [అని వంగి దండాలు పెట్టును.

జనా. — ఓరి మూర్ఖుఁడా. ఉంగరము గాదురా, జోస్యము చెప్పుచున్నారురా చేయి చూచి.

పేరి. — తెలక సూశినా, నన్ను కాశుండి మహాప్పెబో.

విశ్వా. — ఈమాఱు మన్నించితిమి. ఇంకొకమాఱు ఇట్టితప్పు చేయుము, తెలియును.

జనా. — మన్నించినారులే భయపడకు. చేయి చూపించుకొనెదవా?

పేరి. — పెబువుల మణుచు. [అని యెడమచేయి చూపును.

విద్యా. — కుడిచేయి చూపరా.

పేరి. — యేశెయ్యైతే యేమని పుట్టశెయ్యి సూపిస్తి సామీ. తెలనోణ్ణి. [అని కుడిచేయి బోడిసినట్లు చూపును.

విద్యా. — అఱచేయి చూపరా? [పేరిగాఁడు అఱచేయి చూపును.

విద్యా. — [చూచి] ఈనడుమ వీఁడు ఎవ్వరితో జగడమాడినాఁడు. అంతట అది [అనఁగానే సగములో]

పేరి. — [వంగి దండ మిడుచు] అది శెప్పకుండి సామీ, అది శెప్పకుండి, నాను శిత్తగించుకొన్నమాట పెబువులు మనివి శేసుకోండి.

జనా. — మీకు జగడమేల వచ్చినదిరా?

పేరి.—నానుండి దాన్ని 'మామా' అని పిలమన్నానుండి. 'నాను పిల్నా' అన్న దుండి.

విశ్వా.—మరేమని పిలిచినదిరా?

పేరి.—'పేరిగా పేరిగా పేరిగా,' అని పిలిశిందుండి. ఇదేనుండి, నాను శెప్పొద్దని శిత్తగించుకొన్నదుండి.

విద్యా.—దీని నేనెంతమాత్రము చెప్పను.

విశ్వా.—దానిచేత ఆలాగు పిలిపించుకొని ఊరకున్నావా? నీవు అన్నములో ఉప్పువేసికొనుట లేదఁటరా?

పేరి.—[సగర్వము] నానుండి, ఆపాట్కా, [సవ్రీడము] ఒక్కాని మాటన్నానుండి.

విశ్వా.—నీమాట పడి ఊరకున్నదిరా అది?

పేరి.—అదుండి ఆపాట్కా మైలగుడ్డలమూ ఎత్తి నానెత్తిమీ దేశిందుండి.

జనా.—జోస్యులవారు, ఇది కూడ వాఁడు చెప్పవల దని చిత్తగించుకొన్నదే. చక్కఁగా మనవిచేసికొండి.

పేరి.—ఇది శెప్పొద్దని నాను మరీ అగిత్తెంగా శిత్తగించుకొన్నానుండి.

విద్యా.—ఓరీ, ఇందుకోసము ఎల్లిమీఁద నీకు కోపమా?

పేరి.—...పం లేదుండి. ఒకపాలి గశిరివా ఒకపాలి మంచిమాటాడుద్దుండి.

విశ్వా.—వాఁడు వలదని చిత్తగించుకొన్నది మాని కడమ ఏమయినఁ జెప్పుకు, పాపము!

పేరి.—అప్పును మహాప్పెబో.

విద్యా.—[చేయి నిదానించి చూచి] అయ్యో! [అని వానిముఖముం గనుచు] పాపము! ఏమి గ్రహాచారమురా! ఇఁక నిప్పుడు చెప్పఁగూడదుపో, [పేరిగాఁడు దూరముగాపోయి దిగులు పడుచు గుటకలు మ్రింగుచుండును,

విశ్వా.—[జనాంతికము] ఏమి విశేషము ?

విద్యా.—[జనాంతిక మభినయించి శేషిగానికి వినంబడునట్లుగా నే] వీనికి రేపు ఈవేళకు మరణగండ మున్నది. తప్పె నేని ఘయిము. విడిచిపెట్టుండు వాని సంగతి, రసము లేదు.

యుగం.—[వ్రాంత ముగించి] విద్యానాథా, ఒకానొక యవశ్యవిషయమునఁ బ్రశ్న చూడుము.

విద్యా.—రాజానుమతించి యడుగుచున్నారు. నాజోస్యమే నాజోస్యమును పూర్వపక్షము చేయుచున్నది !

యుగం.—ఎట్లు ?

విద్యా.—ఏలినవారియొద్దనుండి తమ్మునికి జాబువచ్చుచున్నది, అంచెల మీఁద; గడియదూరములో నున్నది, మఱి నాజోస్య మేల ?

యుగం.—సారాంశము. రెండుమాటలు.

విద్యా.— (మత్తకోకిల)

దండుఁ బాయుట, యొంటి నొక్కటఁ దాఁకఁ గైదువు లేక యే
రెండు బెబ్బులుల న్వధించి [1]కిరి స్థిర న్బడఁ జేఁతయుఁ,
కండ నెత్తురు మెండు వోవుట, కానలోపల మూర్ఛయుఁ,
దండలో నొకపల్లి య న్వయసంబు విప్రగృహంబునన్. 5

వచ్చినది జాబు. [అందఱు ఆశ్చర్యముతో ద్వారమువైపు చూతురు.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి. [అని యుగంధరుని చేతికి జాబిచ్చి] అంచెమనిసి జడివానలో తడిసినట్లు జోరుచెమటలతోటి చాపరవున ఇది నాచేతబెట్టి నేల బడిపోయినాఁడు.

యుగం.—పోయి వానిని దేర్పుము.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

యుగం.—[జాబు విప్పి చూచుకొని] విశ్వా[illegible]

విశ్వా.—[లేచి పుచ్చుకొని [illegible]]

5. 1. పందిని.

"శ్రీమజ్జగద్విఖ్యాత లోకాతీత నీతిప్రతాప దేదీప్యమానులకు శ్రీమత్కాకతీయ రాజ్యలక్ష్మీసారధ్యులకు జనార్దనమహామాత్యులకు.—

రచితాంజలిబంధుండై ప్రతాపరుద్రమహారాజు విన్నవించుట:— వేటలో నొంటిఁజిక్కి వ్రణితులమై బెడఁదపూడిలో బ్రహ్మశ్రీ రామావధానులవారియింట నున్నారము. తమరు వచ్చి మమ్ము వేవేగ నగరు చేర్పవలయును.

[మొహరు "ప్రతాపరుద్ర మహారాజు."

[అందఱు విద్యానాథుని, యుగంధరుని, పరస్పరమును, చూచుచు హెచ్చరిక సంజ్ఞలతో ఆశ్చర్యపడుదురు.

విద్యా.—[పరమానంద మభినయించుచు] మఱేమి భయము లేదు. కొంచెము కాలయాపనగాని కుదిరి స్వస్థ మగును.

యుగం.—మఱి యేలినవారివార్త వచ్చినదిగదా. అస్వాస్థ్యమునకు ఖేద మగుచున్నది. దైవగతి! జనార్దనా, చిన్నదండుతో నీవును విద్యానాథుఁడును పోయి వారిని తెండి. [సభ్యులతో] మీయందఱయెదుటను మా పెద్దతమ్ముని విద్యానాథుని మాతో నొక మంత్రిగా నియమించితిని, మీకు సమ్మత మగునా ?

అందఱు.—మహాప్రసాదము.

యుగం.—అటయిన నిదిగో ఫర్మానా.

[అని తానువ్రాసిన ఫర్మానా యిచ్చును.

విద్యా.—మహాప్రసాదము. [అని పుచ్చుకొని కన్నుల నద్దుకొనును.

యుగం.—ఏలినవారియస్వాస్థ్యముచే చిత్తము వ్యాకులముగానున్నది. మఱి యిప్పటికి సభ చాలింతము. [అందఱును లేతురు.

చేతా. ప్రభృతులు.—ఏలినవారికి క్షేమము కలుగవలయును.

[అని మంత్రులకు నమస్కరింతురు.

మంత్రులు.—స్వస్తి స్వస్తి స్వస్తి. ఇతరులు నిష్క్రమింతురు.

యుగం.—కూర్చుండుఁడు. [ముగ్గురును కూర్చుందురు.

యుగం.—మీరు ఈ పేరిగానిని యోగిప్రతాపరుద్రమహారాజును చేయవలసినది. ముందుగా, మహాకవీ, నీవు ఈరాత్రి వీనిని రామావధానుల చావడి చేర్పవలయును. జనార్దనా, నీవు సపరివారముగా పోయి ఏలినవారి బంగారపు సవారిలో వీనిని తెచ్చి రేపు నగరు చేర్పవలసినది. రామావధానులకు పేరిగానిచేత ఈ శ్రోత్రియ మిప్పింపవలసినది. ఇదే దానశాసనము. [అని జనార్దనునిచేతికి కాగిత మిచ్చుచు] కృత్యవిశేషములు వచ్చి చేసినపిమ్మట తెలియును.

విద్యా.—

ఉ. రాజు నొనర్చె [1]విక్రముఁ జిరంబుగ దేవత వేయివర్షముల్,
భ్రాజితబుద్ధి దాని నలభట్టి రచించెను రెండువేలుగా;
నా [2]జనయిత్రి యొక్కనినె నన్గనియెన్; మహనీయ, యుష్మద
వ్యాజకృపాకటాక్షమున నైతిని ముువ్వుర [3]మాశ్రితావనా. 6

నవీనునియం దుంచిన నమ్మకమునకు అర్హుఁడ నగుచున్నాను.

యుగం.—నీ ప్రజ్ఞకు ఫల మిది. నీవు కవిని గావు, కవిని అనఁగా ఉశనుని మించినవాఁడవు. నానమ్మకము అపాత్రన్యస్తము గాదు.

విద్యా.—ప్రీతివిస్రంభముల కర్హుఁడ నయ్యెదను.

యుగం.—సరి. [పేరిగాఁడు తొంగిచూచును.

యుగం.—[జనాంతికము] వీఁడు నిన్ను వదలఁడు. వీనిని పేనుము. [ప్రకాశము] మఱి లోపలికి పోదము. [పోవుదురు.

పేరి.—[ప్రవేశించి విద్యానాథుని కాళ్లకడఁబడి] మహాప్పెబో ఆ గండమేంటో శెప్పండి సామీ, తప్పించుకొని బతుకుతా.

విద్యా.—లేవరా, లే.

యుగం.—విద్యానాథా, నిలిచి చెప్పి రా, పాపము! తప్పింపుము సాధ్యమైన. వాఁడు మాకు మిక్కిలి నమ్మకమైన నౌకరు.

[అని ఇద్దఱు నిష్క్రమింతురు.

---

6. 1. విక్రమార్కుని, 2. తల్లి, 3. ఆశ్రితులను రక్షించువాఁడా.

విద్యా.—ఇటు రారా. ఇక్కడ ఏకాంతమునకు రా.

[అవి పరిక్రమించును. పేరిగాఁడు పరుగునఁబోయి కుర్చీ తెచ్చి విద్యానాథునికి వేయును. విద్యానాథుఁడు కూర్చుండును. చాకలి మరల పరుగునఁ బోయి విసనకఱ్ఱ తెచ్చి విద్యానాథునికి విసరుచుండును.

విద్యా.—ఓరీ, తురకసర్దారుని డేరాకడ నుండు పహరాసిపాయి నిన్ను నజీకిపేసి యెల్లిని తీసికొని ఢిల్లీకి పాఱిపోఁ దలఁచియున్నాఁడు.

పేరి.—ఓయి బాబో, తాతల్లో! అమ్మల్లో! నన్ను నరికేశినా నాను బదుకుతాను గాని, యెల్లి లేకపోతే నాను బదకలేను మారాజా, రచ్చించాల, రచ్చించాల.

విద్యా.—అల్లరిచేయకు మూర్ఖా, నిన్ను బయటికి పోనీక ఇచటనే నిలుపుటచే నీచావు తప్పినదిగదా. నీవు సదా మాతోనే ఉండుము, నిన్నెవఁడును ఏమియుచేయలేఁడు.

పేరి.—బుద్దిబుద్ది, మ రెల్లిగతి యేలాగ సాసామే ?

విద్యా.—ఎల్లిని మేము కాపాడెదము. మేము నీకు సెలవిచ్చినప్పుడు నీవు ఎల్లిని గలసికొనుము.

పేరి.—నాగండం తప్పింది బాబూ! నాగండం తప్పింది నాగురుడా!

విద్యా.—గండము తప్పిన యోగము పట్టవలయునురా.

పేరి.—గుడ్డ లుదుక్కొనే ముండావోడికి నా కేమి ఓగం సామీ!

విద్యా.—అటయిన మామాట తప్పునఁటరా?

పేరి.—అమ్మో ! బెమ్మదేవుడిమాట తప్పటమే ! మరి శెప్పు సామీ ఆ ఓగ మేంటో పట్టించుకొంటా.

విద్యా.—రాజయోగమురా.

పేరి.—అట్టంటే తెలీలేదు మారాజా.

విద్యా.—నీవు రాజ వవుదువురా.

పేరి.—నిజమేనా సామే? నిజమేనా? వోల్లు దెలలేదు సామీ! వోల్లు దెలలేరు! [అని నిశ్చేష్టుఁడుగానుండి] మరి నాను రాజునైతే యెట్లె మాద్ది మారాజా?

విద్యా.—రాణి యగును.

పేరి.—[మీఁదఁ జూచుచు ఆత్మగతము] వవ్వా నారంగా! [విద్యానాథుని వైపు] రాసోల్ల గిసోల్ల ఆడోల్లూ, వోల్లూ, నాకాడికి రారుగందా! ఆల్లని సూస్తే నాకు బయి మేస్తది మహాప్పెబో.

విద్యా.— నీయెల్లియే నీకు రాణి యగును. అదే నీతో సింహాసనము మీఁదఁ గూర్చుండును.

పేరి.—శింవాసోనంకాడి కెత్తే నాకేమో బయి మేస్తదండి స్తుల్లుగారూ.

విద్యా.—ఇఁక నేమి భయము?

పేరి.—అవును. ఇంకేం బయిం? ముంగటిమాట శెప్పినా. [ఆత్మగతము] సింవాసోనం మీద టక్కు సేశి వోరికీ తెల్నికుండా యెల్లిని లంజెని ముద్దేస్కొంటా నారంగా. [అని ముద్దుగొనుట నభినయించును.

విద్యా.—[ఆత్మగతము] పురి యెక్కినది. చాలును, [ప్రకాశము] ఓరీ, నేను గురునాథుఁడను గదా, గురువునాజ్ఞ తప్పవుగదా?

పేరి.—తప్పను సామే, గురునాదుడా, నీయాగ్గితప్పను గురుడా. నాసత్తెప్పెమానకం శేస్తా.

విద్యా.—మఱి చీఁకటిపడునందాఁక ఎవరితోను మాటలాడక మౌనముగానుండు. మౌనము తప్పిన యోగము పట్టదు.

[పేరిగాఁడు చేతులతో మాత్రమే దండము చూపును.

విద్యా.—ఆ! అది సరి, యోగము పట్టించుకొనులక్షణము.

[అని నిష్క్రమించును.

పేరి.—నాను రాజయ్యేవోణ్ణి, ఇక అందరూ నాగులాములే

అవుతారు. ఈళ్లతోటి నా కెందుకు పలకటం? అయ్యవోరు అయ్యవోరు గాదు, గురునాదుడు; ఆయ్యోరు శెప్పినమానం బతే చరే.

యెల్లి నా తో గద్ది యెక్కుంటదీ!—జాజి
మల్లి నాతో గద్ది మానుంటదీ!
పేరయ్య రాజంట! పే రెల్లి రాణంట;
తనకు మా మావోళ్లు దండ పెడ్తారంట! యెల్లి నాతో...
సందుట్లో సమయాము శేస్తానురా!—నాను
అందుట్లో సడసాము లాడ్తానురా! యెల్లి నాతో...

ఇం కేమి గావాలరా నాగురుడా! శీక టోడ్డదాకా నరమానవుడితో మాటాణ్ణు. [అని దుముకుచు ఆడుచు నిష్క్రమించును.

# పంచమాంకము.

స్థలము 1.—ఓరుగంటికడ ఖుస్రూఖానుని డేరా.

అంతట ఖుస్రూ ఉపవిష్టుండై ప్రవేశించును.

ఖుస్రూ.—రాజా వచ్చినాడని నావేగుల్ చెప్పినార్. ఆమహాక్షేత్రల్ హజాములున్ను, అలాగే చెప్పినార్. వలీఖాన్ రాలేదు. ఆయన రాజాకి కల్సినో లేదూ కావాలక? మరి నేనే రాజ్యాభరం జర్పవాలా. వలీఖాన్ యింకా రాక్పోవడాన్కి కారణం యేమి?

సిపాయి యొకఁడు.—[చాకిమూట మోచికొని ప్రవేశించి] సర్దార్ సాహేబ్, ఇద్గో తమ్మి దుస్తు.

ఖుస్రూ.—అరే. యి దేమి! యిది ఉతకనే లేదే?

సిపా.—మనచాకల్దానీ లేదూ యెల్లి, అదికి మొగుడీకి వలీఖాన్ సర్దార్ పట్టుకొని ఢిల్లీకి పోయినార్, అంటుంది, అందుకోసం అద్ది తన్ను సంపీయేశినా మనకీ నౌకరీ శెయ్యడం లేదూ అంటుంది, యేడుస్తావుంది ముండా! నేను యీదుస్తులు ఎవరిశేతానైనా ఉత్కుదామ్కు తెచ్చినాను. ఊరంతా యిదే పుఖార్.

ఖుస్రూ.—ఏం పుఖార్?

సిపా.—బడామంతిర్ యుఘుందర్ వచ్చినార్, వలీఖాన్ సర్దార్ పోయే దారీమే జంగల్మాగాళంమే మనపేరిగాడ్కి రాజావేషం వేసి బైటో చేసినార్. రాజాగోడాకి కూడ వేటావేషం వేశి మైధానంలో వుంచినార్: వలీఖాన్ సర్దార్ మోపంపోయి మహల్వాలా పేరిగాడ్కి రాజా తల్చి పకడ్లైవు చేసినార్; తీస్కాని పోయినార్. ఇదే ఊరంతాపుఖార్.

ఖుస్రూ.—[ఆత్మగతము] ఆహా! యేమి హాశ్చర్యం! యేమి యుఘుందర్ మంతిరి బుద్ధిశక్తి! అలాగైతే వలీఖాన్ యీదేశంలో లేడు. హా! హా! హా! తెల్సింది! బడామంతిరి వచ్చినాడు మొదల్ పేరిగాడు మానౌకరికి రానే లేదు! ఆహా మంతిరి యుఘుందర్ ఎంతయుక్తిచేశినాడు! మాసర్దార్ గయా, రాజా అయా! హా! యుఘుందర్! యుఘుందర్.

సిపా.—సర్దార్సాహేబ్, ఆఘోడా వోళ్లంతా ఖానా గాయాల్పడి తప్పించుకొని వొచ్చి రాజా తబేలా మే చేరింది అని మాట. ఈరోజ్ వుధ యమే మహారాజాకూడా వొచ్చినార్ అని పుఖార్.

ఖుస్రూ.—[స్వగతము] యిక మంతిరి యుఘందర్ మాకీ మాలక్కుర్కి ఛణంలోనో ఛణంలోనో సఫాయి చేస్తాడు. బడామంతిరికి మారాయభారం మోసం తెల్సిపోయింది. [ప్రకాశము] అరే. ఇంకా యేమీ తెల్సునా నీకీ?

సిపా.—రాజాకి వేటాలో ఘాయం అయింది, ఖాయిలా చెప్తార్.

ఖుస్రూ.—హా! యీసమయంలో యంధరంరాజ్ సాస్తురుల్ భాయి వుంటే యెంతా సహాయం వుండును!

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

చెకు.—సాయముగా సుండుసెడల సిద్ధముగా నున్నాను.

సిపా.—సలాం. [అని నిష్క్రమించును.

ఖుస్రూ.—సాస్తుల్లుభాయి, సర్దార్ వలీఖాన్ యెక్డావుండేదీ జోష్యం చెప్పండి. మాకి అపాయం వుందీ లేదు, జయం వుందీ లేదు కూడా జోష్యం చెప్పండి.

చెకు.—వలీఖాను గోదావరి దాఁటి ఎనిమిదామడ నడచినాఁడు. ఢిల్లీకి మేఘాలమీఁద ఎగిరి పోవుచున్నాఁడు.

ఖుస్రూ.—అంత జల్దీ పోవడాన్కి కారణం యేమి?

చెకు.—రాజనుకొని చాకలిని ఇక్కడ నౌకరీచేయుచున్నవానిన్నే పేరిగానిని పట్టుకొన్నాఁడు. వెనుకనుండి రాజుసిబ్బంది తఱుముకొని వచ్చునని భయము. త్వరగా సుల్తానువారికి ఆఖయిదీని అప్పగింపవలయు నని కోరిక.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్సాహేబ్, వలీఖాన్ సర్దార్సాహేబ్ దగ్గరనుంచి తురఫ్ జవాను కబుర్తెచ్చినాడు.

ఖుస్రూ.—తచ్చనం రమ్మను.

ప్రతీ.—చిత్తం. అని నిష్క్రమించును.

జవాను.—[ప్రవేశించి]సలాం సర్దార్ సాహేబ్. సర్దార్ కలీఖాన్ ఈ దేవం రాజాకి పట్టివార్, ఢిల్లీకి తీస్కాని యెల్లీ పోయివార్. తనకే చెప్పి వార్—ముట్టడీయేసి వోరంగోలు పట్టవల్సింది, రాజాఘోడాకి పట్టి ఢిల్లీకి మాకాడిక్కి పంపవల్సింది. దాన్కి మేము సుల్తానువార్కి నజర్ చేస్తాం.

ఖుస్రూ.— ఏమి సాస్తుల్లు భాయి? జవాన్ యీలాగ చెప్తున్నాడు?

చెరు.—ఇతని కేమి తెలియును! ఎవఁ డేమి చెప్పినను సరియే, మా జోస్యము తప్పదు.

జవాన్.—[ఆత్మగతము] ముసల్మానీ వేషం, బామ్మన్ మాట! ఎవరీఁ? [ప్రకాశము] ఏమి మీజోస్యం బామ్మన్ సాబ్?

చెరు.—రా జనుకొని చాకలిని మీసర్దార్ పట్టుకొనిపోయినాఁడు.

జవాన్.—ఛీ ఛీ ఛీ ఛీ! జూటాభాత్ జూటాభాత్! నా శేతుల్తో నేను రాజాకి సంకిళ్లు వేసినాను వోయి?

చెరు.— థూ థూ థూ థూ! డోబీకి పేరిగాడిక్కి నీచేతుల్తో సంకిళ్లు వేసినావు రోయి.

జవాన్.—అరే నీవు యిట్లా మాటా చప్తే నాకీ బలే మంటావస్తుంది.

చెరు.—గోదావరిలో పడు చల్లార్చును.

జవాన్.—కబడ్దార్ బామ్మన్.

చెరు.—బామ్మన్ కబడ్దారే. నీవే డబక్దార్, బడక్దార్, బకడ్దార్, ఒకనిఁ బట్టి ఒకనిఁ జెప్పుచున్నావు.

జవాన్.—మేము రాజాకి......

చెరు.—మీరు పేరిగానికి......

జవాన్.—సర్దార్సాహేబ్, ఈబామ్మన్కు పొడీచేస్తాం,

చెరు.—తురకపొడుము మేము తాఁకము.

ఖుస్రూ.— ఆయనమాట నీవు వినకు. నీమాట నీవు చెప్పు.

చెరు.—వీనిమాట చెప్పె.

జవాన్.—మేము రాజాకి ...

చెకు.—మీరు పేరిగానికి ...

జవాన్.—[చెకుముకిని రోషరూక్షముగా చూచుచు] మేమూ రాజాకి టాంజాన్ మే మోస్కాని పోయి పడ్యాలో పెట్టినాం.

చెకు.—[బిగ్గరగా నవ్వుచు] అరే జవాన్ నీవు చాకలికి సవారి మోసితివిరా.

జవాన్.—[బాకు దూసి] మేము చాకలికి సవారీ మోస్తాం?

[అని పొడువఁబోవును. చెకుముకిశాస్త్రి అలక్ష్యముగా నవ్వును.
ఖుస్రూక త్తిదూసి జవానును నఱకఁబోవును.
జవాను అల్లా అల్లా అని పాఱిపోవును.

ఖుస్రూ.—మాభుద్ధి చాలా గంధర్ఘోళం అయింది జోష్వాలు భాయి. యీముండాకొడుకుల్ యీ ముస్తఫా ఫిరోజాలు మేము లడాయి అంటే వీళ్లు రాయ్భారం చెప్తార్, మేము రాయభారం చెప్తే వీళ్లు లడాయి మెఁగ్గతార్. క్యాకర్నా భాయి?

చెకు.—వారిద్దఱు కేవలభ్రష్టు లని నేను మొదటనే చెప్పలేదా?

క. వారికి హుక్కా, [1]కంచెన్,
సారాయి రహస్యగోష్ఠి, [2]షామాత్, భంగీ;
వారికి లడాయి తెలియునె?
వారిమొగంబులకు రాయబార మెఱుకయే? 1

ఖుస్రూ.—యీముండాకొడుకులబుఱ్ఱల్ తీయించివేతునా?

చెకు.—వారివలననే యీ యాలస్యము, లేదా, వలీఖాన్ పోయిన మఱునాఁడే మీరుకోటను పట్టియుండవచ్చును. మఱి యిప్పుడైననో? నీ సేనావధూటిని,

---

1. 1. వేశ్య, 2. చదరంగము అని భా.

ఉ. ముందు ఫిరోజి ముస్తఫ [1]సముత్థకుచాకృతి [2]మొగ్గఁజేయఁగా,
మందత వెన్క [3]శ్రోణియుపమన్ [4]దుమదార్థొరవీవు [5]నిల్పఁగాన్,
[6]అందువు గల్లుగల్లు రన నట్టిటు లొట్రిలు కామపీడితన్
[7]మందవిచార [8]నంధ్రపృతనాపతి [9]కౌఁగిటిలోఁ [10]గరంచుఁబో! 2

ఖుస్రూ.—హా! అల్లా! అల్లా!

చెకు.—మఱియొకమాట, దిగులుపడకలదు. యుగంధరునికి మీరు గడియకాల మిచ్చినది కూడ తప్పే.

ఖుస్రూ.—యేమి చేసినాడు! యేమిచేసినాడు! యేమిచేసినాడు!

చెకు.—మీమీఁదికి రెండువైపుల రెండు లక్షలు పంపినాఁడు, మిమ్ము రూపుమాపుటకు మఱి,—

ఖుస్రూ.—మఱి యింకాయేమి ?

చెకు.—శ్రద్ధగా వినవలయును. మఱి, కోటలోనుండి మీశిబిరము క్రిందికి సొరంగాలు త్రవ్వించి వానినిండ తుపాకిమందు నిండించినాఁడు. ఇఁక గడియలో మీశిబిరము గుర్తుండదు. పాఱిపోయిన లక్షలు లక్షలు దండు పొదివి నలుకనున్నది.

ప్రతీ.—[ప్రవేశించి] సర్దార్ సాహేబ్, రాజావారిదుబాసి.

ఖుస్రూ.—రమ్మను.

ప్రతీ.—సర్దార్సాహేబ్ హుకుం. [అని నిష్క్రమించును.

దుబాసి.—[ప్రవేశించి] సలాము ఖుస్రూఖాన్ బహద్దరువారికి. మా యేలినవారు ప్రతాపరుద్ర మహారాజుగారు వేఁటనుండి ఈ యుదయమే

---

2. 1. నిక్కఁజన్నులవలె, 2. ముందఱికి వాల్పఁగా, యుద్ధమునకు పురికొల్పఁగా నని భా, 3. పిఱుఁదులవలె, 4. సేనయొక్క వెనుకటిభాగమును నడుపువాఁడవు, 5. యుద్ధము వలదని మాన్పఁగా, 6. ఏనుఁగుల కాళ్లకు కట్టుగొలుసు. కామ=జయేచ్ఛ-సంభోగేచ్ఛ, 7. ఆలోచన చాలని దానిని, 8. ఆంధ్రసేనానాయకుఁడు=బేతాళనాయఁడు, 9. అన్నిప్రక్కలం బొదివి, 10. రూపుమాపును జుమా.

వచ్చినారు. వారికి మహామంత్రులు మీరాక కార్యభారము తెలిపినారు. వారు మీరాయభారము మోసమని తలంచినారు. 'కావలెనంటేని చాకలిని ఏల పట్టుకొనిపోవలయును?' అన్నారు. ఇప్పుడు మహామంత్రి యుగంధరులవారు మీకు తెలుపుట యేమనంగా—"మా చాకలిని మరల మాకు సురక్షితునిగా అప్పగింపుమని మీరు మీసుల్తానువారికి కబురు చేయవలసినది. మమ్ము మోసము చేసినందుకై వలీఖానుతల కొట్టి మాకు పంపవలసిన దనియును మీరు మీసుల్తానువారికి కబురు పంపవలసినది. చాకలియు వలీతలయు మాకు చేరువఱకు మీరు మీ క్రిందిసర్దార్లు మాఖైదీలు. ఈదండంతయు మాబంది ఖానాలో నరకము. మీ యాయుధములు సామానులు యావత్తు మావి. లేదా యుద్ధము! కాలము ఇయ్యము," అని.—ఏమి జవాబు?

[ఖుస్రూ ఏమియుతోంపక యూరకుండును.

చెకు.—వారూ ప్వాయంగా మహామంత్రిగారికి మహారాజాగారికి దర్శణంచేశి జవాబ్ చప్తార్.

దుబాసి.—[చెకుముకిని నిదానించి చూచి] ఓరి కాలయముండా, ఏమోయి తురకలలో కలసితివి? ఏమి నీకు వచ్చిన వినాశకాలముకి చీ! పాపీ! చీ! పాపీ!

చెకు.—వినాషాకాలం నీకీవచ్చిందీ. కభుర్తచ్చేజవాబ్ గాడ్దేకి యింతా పాగర్! [అని దుబాసికి ఒక చెంపకాయ యిచ్చును. దుబాసి చెకుముకికి ఒక చెంపకాయ యిచ్చును. అది తలపాగకు తగులును.

పాగ పడిపోవును, జుట్టు అగపడును.

దుబాసి—[జుట్టును సూచించి] జుట్టున్నదీ! బోడి యనుకొంటిని! ఏమి యింత చదివినబ్రాహ్మణునికి వచ్చిన యీవినాశకాలము! [అని అంగీ లాగి జందెమును సూచించి] జందెముకూడ నున్నదీ! మతములో కలియలేదా? మంత్రములో కలసితివా? కడుపుకోసమా? ఉండు నిన్ను మహామంత్రియుగంధరులవారితో చెప్పి మహమ్మాయి చేయించెదను. సర్దార్ సాహేబ్, ఏమి జవాబ్! జవాబు లేదు. నేను పోయెదను. [అని నిష్క్రమించును.

చెకు.—ఈ సంకటమూర్తి తంట బొంద్ర పెట్టును. నేనును బోరాడదు.

ఖుస్రూ.—అరే, యీగడ్బిడాలో మాభడ్డీ బుజ్జకీ ఖ్రాబ్ చేశింది. ఏమి భాయి, పొడుచుకొని సచ్చిపోమునా ?

చెకు.—ఇసీ! ఇసీ! ఇసీ! నీయాజ్ఞకు తిరుగఁబడినవారిని పొడిచివేయవలయునుగాని, నీ వేల పొడుచుకోవలయును! [ఆత్మగతము] వారు నిన్ను పొడిచివేయుదురు. [ప్రకాశము] మఱి యీయుద్ధములో నన్ను మఱవవలదు. సుల్తానువారికి సిపారసు. యుద్ధమైనవెంటనే నిన్ను కలిసికొనెదను, కొంచెము జోస్యము మిగత. యుద్ధము ఆరంభమగుచున్నది. మీకు అపజయము. మీదం డంతయూ నాశము. క్రిందినిప్పుమాట మఱవవలదు. ఈ దుబాసిగానిని నేను కలసికొని నామాట చెప్పనని ఖరారు చేయించుకోవలయును. ఒప్పనియెడల వానిబుఱ్ఱ తెగవేసి రావలయును. నీ కత్తి కొంచెము దయచేయుము. [అని నిశ్చేష్టుఁడగు ఖుస్రూఖానునియొరనుండి కత్తిపుచ్చుకొని] నేను నీ గుఱ్ఱముమీఁదనే వీనిని కలసికొని మరలెదను. సలాము భాయి సలాము! దయయుంచవలయును. ఏమట్లు నిశ్చేతనుఁడవుగానున్నావుభాయి? ఈస్థితిలో నున్ననిన్ను వదలి యెట్లు పోదునుభాయి? మాటలాడు భాయి, ప్రాణమున్నదా లేదా? [అని ఖుస్రూను పట్టి యూఁచును.

ఖుస్రూ.—[నిట్టూర్పు విడిచి] ఏంభాయి. వెళ్లండి భాయి, లక్ష సలాములు. మేం ఈపాపిము స్తఫాఫిరోజాల బుర్రల్ తీసి యుద్ధంచేస్తాం, లేదా, పరారి యౌతాం.

చెకు.—ఏలోకమునసైన సరియే దునము మరల కలసికోవలయు. కత్తి గుఱ్ఱము పవారాజవానున కొప్పగించి పోయెద. సెలవు సెలవు. క్రిందినిప్పును మఱవవలదు.

ఖుస్రూ.—అరే రే రే! నావల్లు అంతా వేడిగా వుంది భాయి?

చెకు.—ఇఁక బొబ్బలు లేచును. తరువాత కాలిపోవును. సదా కడుగుచుండు నాపాదాలు అప్పుడే మండుచున్నవి !

ఖుస్రూ. — [వెఱ్ఱియావేశముతో కత్తి దూసికొని] ముస్తఫాఫిరోజ్ సఫాయి! [అని పరుగున నిష్క్రమించును.

స్థలము 2. ఓరుగంటి వెలుపల బయలు.

పేర.—[గుఱ్ఱపుపెక్కుటను దౌడును అభినయించి] ఈముగ్గురలో ఒకఁడో యిద్దఱో నా ప్రయోగవీరునికి అవసరమైనవేద్యము. ఏమి యీ మనో వేగి! [పరిక్రమించి.] నగరము చెంతకు వచ్చితిని. బళి! ఈగుఱ్ఱము ఈ కత్తియును వీనికి ఢిల్లీసుల్తాను ఇచ్చినవఁట. మాయేలినవారిగుఱ్ఱమును సుల్తాను గానికి నజరు పెట్టఁగోరినందులకు సుల్తానుగుఱ్ఱమును ఏలినవారికి నజరుపెట్టె దను. ఈకత్తి నా ప్రజ్ఞాధ్వజముగా నాయొద్దనే యుండుఁగాక.. ఈ రెండును లేమి ఖుస్రూఖానునకు రెండుచేతులు లేమియే. బళి! బేతాళరావుయోగము! ఓరంగోలునగరిపుణ్యము! [వెనుకకు తిరిగిచూచి] అహో అప్పుడే యేమి యుద్ధము! ఏమియుద్ధము!

క. సుడులు దిరుగు, విడఁబడు, నె
వ్వడి సేఁలు వాఱు కొండవాఁకలు దూఁకున్,
పొడ వలలు లేచు, పెల్లువ
పొడుచు, న్నిముసమున నింకిపోవున్, బోవున్. 3

అహో యేమి యిది! శిబిర మెల్ల నంటుకొని దావాగ్నియైనది! రామ రామా? ఏమి యుగంధరుల శత్రునాశనప్రకారము! నాకవనపు సారంగములు నిజమే? ఏమి నామిడుతంబట్ల జోస్యము! హా యుగంధరా! నాకే విభ్రాంతి యగుచున్నది! నా ప్రయోగమువలన ఈరణములో తురకసర్దారు డెవఁడును కుండు నడపఁడుగదా.

క. మా రెండు సేనలే యల
[1]మారునిదంష్ట్రాళియుగళి, మధ్యఁ బటాణీ

4. 1. యమునియొక్క కోఱలవరుసల జంట.

వారు బటాణీలఫలా
హారము లయివారు [2]కంచుకొన్నతితువతోఁ. 4

ఆ. పొంగుకడలినడిమి భూరేఖ యుప్పెనఁ
గరఁగి పగిలి కూలి కొనఁబడదు
ఈఁటె మెఱపు లేమి! యేటుంబిడుగు లేమి!
వెలితి యేది దీన విలయమునకు! 5

అప్పుడే మైదానమెల్ల తెల్ల డేరాలకు బదులు నల్లని గ్రద్దడేరా లనుచున్నది. ఈమూల కొంచెమెవఁడో సర్దారుఁడు నడుపు చున్నట్లున్నది. బళి! మనరాణువలే రెండును తురకమును రూపు మాపి ఆయావేశమున ఒండొంటి పైఁబడి కసిమసంగును గాఁబోలు. అవేమి ప్రళయ కల్లోలములా గుఱ్ఱపు బారులా? ప్రళయ ఝంఝోత్పాటిత వికీర్ణగిరిశిఖరములా యేనుంగులా? శివ శివా! తురకసేన రెండువ్యాఘ్రములనడిమి సారంగి యైనది! అప్పుడే గ్రద్దలు బుఱ్ఱబొండ్లములను గడ్డపుఁదొడిమలతో తన్నుకొనివచ్చి యిక్కడ సంత పెట్టుకొని పండువు గావించుచున్నవి. హా! దావాగ్నినడిమి చెదలపుట్ట!

ఉ. [1]వైదికుఁడం [2]గృతాత్ముఁడఁ [3]దపఃపరతంత్రుఁడ, [4]నీనియోగపుం
గైదువుబంట్లసంగడి [5]నఘంబున మున్గనొ?—[6]ధర్మ మాక్రియన్

---

4. 2. తొడిగికొన్న కవచములు (చొక్కా అనియుం జెప్పవచ్చును) అనెడు పొట్టుతో.

5. బేతాళనాయని దండు సముద్రమువలెను, తురక రాణువ భూమివలెను, అది దీనిం బొదిపి రూపుమాపుట మహాప్రళయముతో సముద్రము భూమిని ముంచివేయుటవలెను,... ఈయుద్ధము ప్రళయమువలెను, ఉన్నవని భా.

6. 1, వేదము చదివినవాఁడను, 2. ఆత్మసంస్కారము చేసికొన్న వాఁడను, 3. శ్రద్ధతో తపస్సుచేయువాఁడను, 4. యుద్ధశూరు లయిన యీ నియోగుల (రాజకీయోద్యోగస్థుల)సాంగత్యముచేత, 5. పాపమున, 6. ధర్మము

గాదు; మహాపద జ్జగముఁ గాచుమహాత్ములు మీరు; మా కిటన్
లే దఘ మించుకేని, కడ లేని శుభంబు యశంబుఁ దక్కఁగాన్. 6

మఱియును,

మ. తొలి నీధారుణి జామదగ్న్యునిది, తద్దోర్దత్త మై కశ్యపా
దుల మా విప్రుల దయ్యెఁ; నుంచితిమి సాధుక్షత్త్రహస్తంబునన్;
కలి నాపుణ్యుల ధూర్తదైవము వెస న్గారించినన్, వారలన్
బల్లుచెట్ట ల్పడియేని కావఁగఁ బటుబ్రహ్మాధికారం బగున్. 7

కావున అపరిహార్యమై చేతులార చేసినదానికి చింతిల నేల! కంటికి వెక్కసమైనది, పోయి మహామంత్రి యుగంధరులవారికి వృత్తాంతము నివేదించెద. అని పరిక్రమించి,

స్థలము 3. ఓరుఁగల్లు నగరము.

చూచి] అహో! నగర మెల్లకోటబురుజులు గోపురములు చెట్లు ఇండ్లకప్పులును సర్వము నరమయము! గుండెగలవారెల్ల యుద్ధము సూచుచున్నారు. ఇదేమహామంత్రి యమధర్మరాజువారిహావేలీసంయమని. ప్రవేశించెదను. [అని యశ్వావరోహణ మభినయించి] ఈయశ్వమును ఈతబేలాలో నుంచెద. [అని యశ్వమును తట్టి వదలుట నభినయించి పరిక్రమించి ఈ హావేలీలోనే యూరంత తిరుగవలసియున్నది మహామంత్రిగారిం గనుటకు. [పరిక్రమించి

---

అట్లుగాదు. (లోకక్షేమార్థము క్లేశించుట ధర్మముగాని, లోక మేమయినను మన కేమి అని సదా ముక్కుపట్టుకొని మూలనే కూర్చుండుట ధర్మముగాదు). అఘము=పాపము.

7. ఆదిలో నీభూమి పరశురామునిది. అతఁడు తనచేతితో నీయఁగా కశ్యపుఁడు లోనగు మాకు బ్రాహ్మణులకు వచ్చినది. మేము దానిని యోగ్యులయిన క్షత్త్రియులచేత పెట్టితిమి. ఈకలికాలములో అపుణ్యాత్ములను (అసత్క్షత్త్రియులను వంచక మయినవిధి బాధింపఁగా వారిని ఎన్నికష్టములేనియుంబడి కాపాడుట సమర్థులయిన బ్రాహ్మణులు చేయవలసినపని.

చూచి] వీరుగో మహామంత్రిగారు. కూడ నెవరున్నారు? [చూచి] అరెరె, ఎల్లి, కానీ, ప్రక్రాంతము నెఱిఁగి మఱి ప్రవేశించెద.

స్థలము 4. ఓరుఁగల్లు, మంత్రిశాల, కచ్చేరిశాల.

అంతట యథానిర్దిష్టముగా యుగంధరుఁడు, ఎల్లియు, ద్వార
భూమిని ప్రతీహారియు ప్రవేశింతురు.

[చెకుముకిశాస్త్రి పొంచి వినును.

ఎల్లి.—[వెక్కి వెక్కి యేడ్చుచు] మహాప్రభో, మీరే తల్లి మీరే తండ్రి అని, మీరే సామి మీరే నారాజుగారని మీపాదాలు కొలుచుకొంటూ వున్నందుకు, నామొగోణ్ణి తురకలకి లసురు పట్టిచ్చినారంట సామీ, ఇక నాను బతకలేను మారాజా!

యుగం.—ఎవరే మేము పట్టియిచ్చితిమని చెప్పినవారు!

ఎల్లి.—[భయముతో గడగడ వణఁకుచు] పట్టమంతా అదే మాట మారాజా.

యుగం.—తురకలు పట్టుకొని పోయినమాట వాస్తవమే గాని మేము పట్టియిచ్చుట అబద్ధము. ఏలినవారికి నౌకరీ చేయుమని పంపితిమి, ఉదుకుమని యేలినవారు దుస్తు వీనికి వేయఁగా ఈనిర్భాగ్యుఁడు దానిని తాను తొడిగికొని తురకలయెదుట తానే రాజని ప్రజ్ఞలు నటికినాఁడు. అంతట వారు వీనిని పట్టుకొనిపోయినవారు.

ఎల్లి.—అయ్యోమారాజా, అయ్యో మామా, మామా, మామా.

[అని యేడ్చును.

చెకు.—ప్రతీహారీ, పోవచ్చునా?

ప్రతీ.—ఎరిగినవారి కల్లా దర్శనానికి శెలవు.

చెకు.—పరమసంతోషము. [ప్రవేశించి] జయము జయము మహామంత్రిగారికి.

యుగం.—చెకుముకిశాస్త్రీ, కూర్చుండుము. [చెకుముకి కూర్చుండును.

యుగం.—ఏమి విశేషము? సంగ్రహము. [ఎల్లిని గూర్చి] వినవే, పేరిగానికై మేము చేయు ప్రయత్నములను ఈయన చెప్పును.

[ఎల్లి శ్రద్ధగా వినును.

చెకు.—నేనచట నుండఁగానే తమదుబాని వచ్చి ఖుస్రూఖానుతో తన యాజ్ఞగా 'మాచాకలిని వలీఖానుతలను తెప్పించి అప్పగింపుఁడు, అంత వఱకు మీరు మా ఖైదీలు, మీ యాయుధము లెప్పటికిని మావే.' అని చెప్పి, వానివల్లన ప్రత్యుత్తరము రానందున బేతాళనాయనికి యుద్ధారము హెచ్చరిక చేయుటకుఁ బోయినాఁడు.

యుగం.—తర్వాత?

చెకు.—తర్వాత ముస్తఫాఫిరోజులను ఖుస్రూ చంపఁదరలినాఁడు. ప్రతిసర్దారునికిని ఈదినము గండము చెప్పితిని. ఎవఁడును నడపలేదు, తురకరాణువ అనదయైనది. యుద్ధము జరుగుచున్నది.

యుగం.—ఏపాటి యుద్ధమైనది?

చెకు.—సంగ్రహము.—

ఉ. తూరుపుసంధ్య [1]యొక్కెడఁ దూలెడు, నా [2]కడసంధ్య యట్లె యా
[3]వారుణకోణమం దడఁగు, వన్నెయుఁ దక్కువె, యంచు మధ్యసం
ధ్యారమ యెల్ల [4]ఘస్రముల [5]తామ్రత నొక్కటఁ దాల్చి యెల్లెడం
[6]గేరె ననంగ నెత్తురుల [7]కెంపున నిండె [8]నజాండ మంతయున్. 8

యుగం.—నీ ప్రయాసకు ప్రజకు పరమ సంతోషము.

చెకు.—ఖుస్రూగాని గుఱ్ఱమును కత్తిని తెచ్చితిని.

యుగం.—గుఱ్ఱమును ప్రభువు తబేలాకు మేముపంపెదము. కత్తిని నీ ప్రజ్ఞాధ్వజముగా నుంచుకొమ్ము. [ఎల్లిని చూచి] చూడు నీకోసము ఎంత

---

8. 1. ఒకమూలయందు (తూర్పునమాత్రమె యనుట), 2. సాయంసంధ్య, 3. పడమటిమూలలో, 4. దినముల, 5. ఎఱుపును, 6. విజృంభించెను 7. ఎఱుపుతో, 8. అజాండము=బ్రహ్మాండము.

యుద్ధము జరిగించితివో ! మేమూ పట్టి యిచ్చినారము ? ఇంద ఈధనము తీసికో, ఈనగలు తీసికో. [అని ఇచ్చును.

ఎల్లి.—నాకెందుకు మారాజా యియ్యి ముండమోపికి ?

యుగం.—తప్పు మాట అనుకొనకు, పుచ్చుకో.

చెకు.—పుచ్చుకో, పుచ్చుకో. [ఎల్లి పుచ్చుకొని దండ మిడును.

యుగం.—చిరకాలము మాత్తయిగవుగా నుంచుకపో, పేరిగానికేమియును భయముండదు. వానివంటి నమ్మకమయిన నౌకరు మాకు మఱి లేఁడు, మేము వానిని పోనీయము. ఢిల్లీసుల్తానే వానిని మాకు అప్పగించును.

ఎల్లి.—తురకలు సంపెయ్యకుంటెగందా బాబయ్యా !

యుగం.—చంపువారయిన అప్పుడే యేల చంపరు ? రాజనుకొని గదా పట్టుకొని పోయినారు, రాజోపచారములు చేయుచుండెదరు. చెకుముకీ, జోస్యము చెప్పు.

చెకు.—దేవతార్చనపెట్టెలో సాలగ్రామమువలె పేరిగానిని సవారిలో కాపాడుచున్నారు. ఖయిదులో నున్నాఁడేగాని రాజయినాఁడు. వానికేమి లోపము ?

ఒకపడవాలు.—[ప్రవేశించి] జయము జయము మహామంత్రి గారికి.

యుగం.—ఏమోయి యేమి జగిరినది ?

పడవా.—తమ యాజ్ఞప్రకారము బేతాళరావు నరసింహరాయలు ఇద్దఱు రెండువైపుల తురకలను కమ్మి నఱికివేసినారు, హతశేషులను ఖైదు చేసినారు.

యుగం.—మిక్కిలి ఏలినవారిని కొలిచినారు. బేతాళరావునకు తృప్తియైనదా !

పడవా.—అతఁడు వీరావేశముచే యుద్ధము ముగిసిన గడియఁదాక కంటి కెదురయిన చెట్టును గుట్టనుకూడ నఱుక సాగినాడు. ఎవరము,హిరణ్య

కశిపు వధానంతరము దేవతలు ఉగ్రనరసింహమూర్తిని దటియలేనట్టు ఆతని కడకు పోలేమైతిమి. మనవారినే శూన్యము చేయునో అని అందఱము భయపడి, యెట్లు హెచ్చరించినను తెలిసికొనఁడాయెను. చివరకు తమపేరట మురాయి పెట్టఁగా తెలివి వచ్చి నిలిచినాఁడు. అంతట నే నిట్లు వచ్చితిని.

యుగం.—బళిబళి, మహాశూరుఁడు. వీరుల లెక్క?

పడవా.—మనవాండ్రు రమారమి వేయిమంది. రమారమి తొంబదివేల తురకతలలు రాలినవి. మైదాన మెల్ల రక్తసముద్రము.

చెకు.—అందులో తురకబొందులరాసులే దీవులు. ఇఁక నొకటిరెండు రోజులలో అటు గాలి యిటుకొట్టినా మఱియొకరి ఘ్రాణేంద్రియములను మనము ఎరవు తెచ్చుకోవలసినదే. ఆ కంపుచే ఈయూరు నాశము. తురకలు బ్రతికి సాధింపక పోయినను చచ్చి సాధింతురు. ఇప్పటికి నా ప్రతిజ్ఞ నెఱవేఱినది.

యుగం.—ఏమి నీ ప్రతిజ్ఞ ? [అని వినుచు చీటి వ్రాయుచుండును.

చెకు.—కోటబురుజులకు రాత్రులలో లక్ష కొఱవిదయ్యములను చూపెదనంటిని. అది యింక నూఱేండ్లదాఁక సిద్ధించినది. మఱియొకటి కూడ సిద్ధించినది.

యుగం.—అ దేమి ? [అని వినుచు ఆ చీటియే వ్రాయుచుండును.

చెకు.—ఇఁక నూరేండ్లదాఁక ఈనగరములో స్త్రీలకందరకును తురక పిశాచములేగాని హిందూపిశాచములు పట్టవు !

యుగం.—[ఎల్లితో] పేరిగానికోసము మేము పడుచున్న ప్రయాస చూచితివిగదా. వానిని తెచ్చి నీకిచ్చుట మాభారము. నీవిఁక చాకిపని చేయకు. మేమిచ్చిన ధనముతో సుఖముగా బ్రతుకుచు గవరమ్మను పూజించుకొనుచు ఉండుము.

ఎల్లి.—నాను తమ లోగిట్లో నే గంజి దాగుతా నాకిష్టమైన పనిపాట చేసుకొంటా పడుంటాను.

యుగం.—నీకిష్ట మైనట్లుండు. ఇప్పటికి పో. గూడదా మంత్రి

[ఎల్లి సాగిలఁబడి లేచి నిష్క్ర

యుగం.—పడవాలూ, మీ రందఱును మీ ప్రయాసముల కసంజీవనీ ఫలము ననుభవించెదరు. పోయి బేతాళ రావుతోను నరసింహ రాయనింగారు మామాటగా ఏలినవారికి మిగుల గణనీయుల రై తిరని చెప్పుము. ఈచీటి బేతాళ రాయనికిమ్ము.  [చీటి ఇచ్చును.

పడవా.—[చీటికై కొని] మహామంత్రిగారియాజ్ఞ.

[అని నిష్క్రమించును.

యుగం.—చెరుముకీ, నీవు తక్షణమే [చెవిలో ఏమో చెప్పి] ఈమాటను పెద్దసెట్టికి చెప్పి, ప్రకృతము నగరిలో రాజసన్నిధిని మాతమ్ములతోఁ జేరుము.

చెరు.—మహాప్రసాదము.  [అని నిష్క్రమించును.

యుగం.—ఆహా! ఈ రొల్లికష్టమే యిట్లున్నదే, అంతఃపురములో నేమి యడావడిగా నున్నదో!

అంతట ఒకరౌతు రోఁజుచు ప్రవేశించును.

రౌతు.—జయం జయం మహామంత్రిగారికి. రాణీగారు ఏలినవారి దర్శనానికివచ్చినారు. మంత్రులున్ను వైద్యులున్ను వల్లపడద న్నారు. మేము చూడకమాన మని దేవిగారు తమతమ్ములమీఁద కోపం చేస్తున్నారు. నన్ను వారిద్దరున్ను ఇక్కడికి తరిమినారు. తమరాక నెదురు చూస్తున్నారు.

ఒకచేటి —[రోఁజుచు ప్రవేశించి] జయం జయం మహామంత్రిగారికి. దేవిగారు తమతో మనవిచేయుచున్నారు.—'తమతమ్ములు మమ్మలిని మాప్రాణేశ్వరుల దర్శనానికి నిషేధించినారు, మేము అవశ్యం దర్శనం చేయనున్నాము,' అని. జవాబు తెమ్మన్నారు.

మఱియొకరౌతు—[ప్రవేశించి] తమ్ములమనవి. "రాణిగారిని నిలపలేకున్నాము. వారు సాక్షాత్తు మహిషాసురమర్దిని యవుతున్నారు. తమరు క్షణంరాకుంటే అపాయము,' అని.

కశిపు వధానంతరమా రంభమును పొందిన, మీకన్న ముందే మేము వారినన్ని
కడకు పోలేవైము, [రౌతులు చేటియును నిష్క్రమింతురు.
పడి, యెటుగం.—[లేచిపరిక్రమించి] క్రొత్తగుఱ్ఱము యోగ్యత కనియెదను.
మరాం స్థలము 5. ఓరుగల్లు, వీథి.

[చూచి] చూపునకు మేపునకు మంచిదే. [తట్టుటను ఆరోహణమును
అభినయించి] దౌడునకును మంచిదే, మెఱపుదీగ యని పేరు పెట్టవచ్చును.
[దౌడునభినయించి]రాణిగన్నిధికి వచ్చితిని, రౌతులుఇంకను మావావేలికడనే
యుందురు. [అశ్వావరోహణ మభినయించి] ఈనౌకరులు దీనిని చూచుకొని
యెదరు. నేను రాణియొద్దకుఁ బోయెదను. [అని పరిక్రమించును.

స్థలము 6. ఓరుఁగల్లు, రాచనగరు.

అంతట రాణి, ముమ్మడమ్మ, బాలుఁడు, పరివారము, పహారా
జవానులు, విద్యానాథజనార్దనులును, ప్రవేశింతురు.

బాలుఁడు.—మాబాబయ్యగారిని మేము చూడడానికి నీయాటంక
మేమిరా ? [అని పహారాజవానును తన్నును.

జవాను.—[అపాదమునకు మ్రొక్కి ముద్దుపెట్టుకొని చేతులు మోడ్చి]
తమవంటి మహాప్రభువులు మంత్రులమాట దాట రాదు.

బాలుఁడు.—అమ్మగారూరండి [కత్తిదూసి]అడ్డమైనవారినెల్ల పోడి
చేస్తాను, రండి బాబయ్యగారిని చూతాం.

యుగం.—[స్వగతము] ఆహా! బాలుఁడు కూడ పరాక్రమించు
చున్నాఁడు!

రాణి.—బ్రాహ్మణు లడ్డమున్నారు సాహసా.

బాలుఁడు.—వారికి నమస్కరించి లోపలికి పోదాం.

రాణి.—నమస్కరించినమాత్రాన నెట్లు పోఁగలము బాలకా ?

బాలుఁడు.—నమస్కరిస్తే 'నీకోరిక సిద్ధిస్తుంది' అంటారుగదా, మన
కోరిక బాబయ్యగారిదర్శనమే,అది యేలాగ కాకపోతుందో చూతాంగదా.

ముమ్మడమ్మ.—మాబాబును అస్వస్థుని మేము చూడఁగూడదా మంత్రి బృహస్పతులారా ?

విద్యా. జనా.—అమ్మా, కబళికామంత్ర ప్రయోగము, మృతసంజీవని మంత్ర ప్రయోగము చేసితిమి, రెంటికిని మూఁడుదినములు స్త్రీలకంటను బాలుర కంటను పడఁగూడ దని నియమములు. నియమములు దప్పిన ప్రాణాపాయము. పిమ్మట తమచిత్తము.

రాణి.— ఈకపటము వీరికి ఇంతసేపటికి తోఁచినది, ఎంతమాత్రము మేము నమ్మము. ఈదేశక్షోభములో యుద్ధసంరంభములో మృగయావ్రణితాగతులను మాప్రాణేశ్వరులను మేము గనుటకు వీరి యాటంకమా ? మేము చూడకమానము.

విద్యా. జనా.—'స్త్రీబుద్ధిః ప్రళయాన్తకః!'.—ఏమయినఁ గాని, అన్నగారు వచ్చువఱకు మనము లోపలికి పోనీయకలదు.

యౌగం.—[స్వగతము] ఆహా! మంత్రులసమాధానము లెక్కట లేదు.

ముమ్మ.—సాహసము చేయకుడమ్మా, మనయందఱప్రాణములును మాతమ్ముఁడు యౌగంధరుని రక్షణలోనివి. అతనిని రానిమ్ము.

అందఱు.—[చూచి, అత్యాదరముతో] వారుగో యౌగంధరులవారు! వారుగో యౌగంధరులవారు ?

యౌగం.—[సమీపించి] అక్కగారు, కౌమార్త, బాలుఁడు, తప్పకడమ యందఱు పొండి.

విద్యా.—[ఆత్మగతము] బ్రతికితిమిరా.

క. ఈయన [1]ముమ్మూర్తులపై
 జే యనఁగఁ [2]దురీయమూర్తి, సృష్టిస్థితి [3]సం

9. 1. త్రిమూర్తులపై, 2. నాలవ, 3. లయము.

ప్రాయముల కోకఁడె విభుఁ, డిఁక
నీ [4]యావడి యడఁగు [5]వార్ధి యింకినకరణిన్. 9

[అని విద్యానాథప్రభృతులు నిష్క్రమింతురు.

రాణి.—[యుగంధరుని పాదములకుఁ బ్రణమిల్లి] మాకు దర్శనము లేదా?

యుగం.— దీర్ఘసుమంగలివికమ్ము. నాపట్టీ, నీకు దర్శనమున కొఱంతమా? నే నిప్పించువఱకు వేచి యుండుము.

బాలుఁడు.—నమస్కారము తాతగారూ.

యుగం.—చిరంజీవ. [బాలుని ఎత్తుకొని] బాబూ, మేము లేనప్పుడు నౌకరుల మీఁదికి కత్తిదూసెదవా? మనబిడ్డలను మనము చంపవచ్చునా?

బాలుఁడు.—బాబయ్యగారిదగ్గిరికి పోనిచ్చినారుగారు తాతయ్యా.

ముమ్మ.—తమ్ముఁడూ, ఏమి యీ యపూర్వము?

యుగం.—అక్కగారూ, [చెవిలో] స్త్రీలకు రహస్యము చెప్పఁగూడదు. అయినను సకల మెఱిఁగిన సాక్షాల్లోకజననికి తమకు ఒకరహస్యము చెప్పెదను, అదే మన కందఱకు ప్రాణబీజము. మూర్ఛిల్లవలదు.

క. కొనిపోయె నమ్మ నీ ప
ట్టిని యవనుఁడు దైవఘటన ఢిల్లీపురికిన్;
[1]వనరకు, మేడునెలల పది
దినములలోఁ దెచ్చి యిత్తు దేవి నీకున్. 10

ముమ్మ.—[స్వగతము] కడుపులో పిడుగు పడినది! ధైర్యనాటకము సాధ్యమా? మఱి గతి యేమి? [ప్రకాశము] మాతల్లిగర్భములోనే మాతోఁ గూడ ఏల పుట్టవైతివి? నీఋణమును మే మెట్లు తీర్చుకొందుము?

యుగం.—తమకుఁగూడ పామరత్వమా? ఆమాట లిప్పుడు గావు, మఱిపొండి.

---

9. 4. అల్లరి, 5. సముద్రము.

10. 1. దుఃఖపడకు.

మున్న.—రావమ్మా, రావోయి బాబూ, ఇప్పుడు గాదు, లేవ్యాళ నేను తీసికొనిపోయెదను రండి బాబయ్యా కడకు. [అని యూయురప్పురతో నిష్క్రమించును.

విద్యా. జనా.—[ప్రవేశించి] ఈప్రళయము తప్పించితిరి. మఱి మాకాజ్ఞయేమి ?

యుగం.—ఈ ప్రళయ మిఁక రాదు. క్రొత్త వేమయిన వచ్చిన, మీనీతి విభవము. మీతో చెరుముకి చేరును. వేరిగాఁడు రాజుగా, మీరు ప్రతాప రుద్ర నాటక మాడవలయును. ఇఁక ఏడుమాసముల పదిదినములకు మరల మీకు మాదర్శనము. మేము ఎక్కడికో? ఏలకో? మా సంకేతము గలచారులు దెలుపు మాయాజ్ఞలు నెఱవేర్పవలసినది. తృణము నవనిధులుగా నవనిధులు తృణముగాఁ జూడుఁడు. అన్నమరాజు కటకమునుండి వచ్చిన, మీకు సర్వ సాహాయ్యము.

విద్యా. జనా.—[యుగంధరుని పాదముల వ్రాలి లేచి కన్నీళ్లతో]

క. తమరూపమె ధ్యానం బగుఁ,
దమపేరె జపంబు, సర్వదా యిఁక మాకున్,
దమరు ప్రసన్నతఁ బ్రత్య
క్షమై మముం బ్రోచువఱకుఁ గడిఁదితపముగాన్. 11

యుగం.—చిరం జీవతమ్. చిరం జీవతమ్. 'బ్రదికి యుండిన సుఖములు పడయవచ్చు.' ఇఁక మీపని చూచుకొనుఁడు.

విద్యా. జనా.—చిత్తము. [అని నిష్క్రమింతురు.

యుగం.—ఆడఁబోవు మహానాటకమునకు ప్రస్తావనయైనది. బేతాళ రాయనికి ఆచీటి చాలును. పెద్దసెట్టికి ఆమాట చాలును. పడుగు వేయుట క్షణము, పేక నేయుటకు మాసములు. మంచిది! నేను లేనప్పుడుగదా వీఁడు పట్టినాఁడు నే నెట్లు లేక పోదునో చూచునుగాక. [సచింతము, సబాష్పము] హా! నారాజును వీఁడా హరించువాఁడు! [సావష్టంభము]

### స్రగ్ధర.

పాతాళంబందుఁ గానీ, ప్రళయపవనగర్భంబునం దైనఁ గానీ,
త్రోతుర్గాత న్మహీశు న్దురకలు బలవద్దుష్టదైవావచేష్టన్;
చేత న్నే నందికొందున్; సిరి మెఱయ నిటన్ సింహపీఠాన నుంతున్,
ఖ్యాతి న్ఢిల్లీపురీశు న్గరువ మెడల నా ఖైదిగాఁ గట్టి తెత్తున్. 12

[అని నిష్క్రమించును.

---

12. తురకలు బలీయమయిన దుష్టవిధియొక్క దుశ్చేష్టచేత రాజును పాతాళములో దాఁచిన దాఁతురుగాఁక, ప్రళయకాల వాయువు కడుపులో పెట్టినం బెట్టుదురుగాక, నారాజును నేను చేతితో అందుకొని తెచ్చెదను...

# షష్ఠాంకము.

స్థలము.— ఓరుఁగల్లు, రాచనగరు.

అంతట ఇద్దఱు నౌకరులు ప్రవేశించి తివాసులు మొదఁగు
నాస్తరణములను పఱచి నరుదుదురు.

ప్రథముఁడు—ఓరి, వ్యాఘ్రపాదా, ఈదినము మంచి వినోదమురా.

ద్వితీ—ఆంజనేయులూ, ఇన్నాళ్లు మంత్రులు తల బ్రద్దలు కొట్టుకొని వీనికి నూఱిపోసిన యుపదేశము నేఁ డేమయిన ఫలించునా?

ప్రథ.—ఫలించును, వీనిని పుటము వేసిన.

అంతట విద్యానాథ జనార్దనులు పేరిగాఁడును ప్రవిష్టులై
కూర్చుందురు.

జనా.—పేరిగా, మాయుపదేశ మేమి చేసితివి?

పేరి.—శీమతలకాయంతైనా వొదలకుండా యీడొక్కలోయెట్టు కొనున్నా.

విద్యా.—ఏలినవారిని సిద్ధము చేయుదము. గాయకులు వచ్చియుందురు.

ప్రతీహారి.—[ప్రవేశించి] జయము జయము యేలినవారికి, గవాయీలు వచ్చి వున్నారు.

మంత్రులు.—శ్రుతి గితి చేసికొని సిద్ధముగా నుండు మను.

జనా.—పులిగా, ఏలినవారికి స్వారస్యపుఁద్రాడు కట్టు.

[ద్వితీయుఁడు పేరిగానిజుట్టునకు పొడుగుపాటిత్రాడు కట్టును.

విద్యా.—అనుమా, పంకాలాగు. [ప్రథముడు స్వారస్యపుఁ ద్రాడు లాగును.

పేరి.—[తల యూఁచుచు, అర్ధనిమీలితలోచనుఁడై] వహ్వా! వహ్వా! యేమి సారాశెంబు? యేమి సారాశెంబు?

విద్యా.—[నవ్వుచు జనార్దనునితో] చూచితివా ప్రహసనమే, ఏలినవారప్పుడే స్వారస్యగ్రహణ మారంభించినారు.

జనా.—[నవ్వుచు] ఇట్టి యేలినవారల కెందఱనో గనిగదా యతఁడు 'కనకపు సింహాసనమున' అని పద్యము చెప్పినాఁడు.

మంత్రులు.—ఓరీ, ఇంకను గాయకులు రానే లేదె, అప్పుడే స్వారస్య గ్రహణ మారంభించితి వేమిరా? నీకు చెప్పినదెల్ల బూడిదలో హోమమురా.

పేరి.—[సరోషము] ఈతప్పు యేలంజకొడుకుదో మీకు తెల్సునా?

జనా.—తెలియ లేదు చెప్పు.

పేరి.—నానే అనుకొంటే [అనుమని చూపుచు] నాకంటా లంజ కొడుకు యీడు; దీనికి యీణ్ణి తన్నండి.

జనా.—నీకంటె లంజెకొడుకా వీఁడు?

పేరి.—అడ్డ మేమి?

జనా.—[అనుమనితో] నీ వేమి చేసితివిరా?

అనుమ.—[చిరునగవుతో] నేను తడబడి పంకా తా డనుకొని సార శ్యంతాడు లాగినానండి.

విద్యా. జనా.—[చిరునగవుతో] ఓరీ, నీవు కావలయు ననియే చేసితివా యేమి యీపని? [అనుమఁడు నవ్వుచు నవలికి పోవును.

పేరి.—మ ఱిప్పు డీణ్ణి యెల్లాయిలో యెయ్యండి.

విద్యా.—పులిగా, నీపనికి, నీవు రారా.

పులి.—చిత్తం. [అని స్వారస్యపుఁ ద్రాటిని చేతఁ బట్టుకొని కూర్చుండును.—

జనా.—ఎవరోయి అక్కడ?

ప్రతీ.—[ప్రవేశించి] ఏమి దేవరవారి యాజ్ఞ?

జనా.—గాయకులను రమ్మను.

ప్రతీ.—చిత్తము. [అని నిష్క్రమించును.

అంతట వైణికుఁడు, గాయకుఁడు, మార్దంగికుఁడు, మోర్సింగువాఁడును ప్రవేశింతురు.

మంత్రులు.—కూర్చుండి మీవిద్య చూపుఁడు.

[ముప్పురును సభావందనముచేసి కూర్చుండురు. వైణికుఁడు 'చంద్రకళాధర సాంబ సదాశివ' అని పల్లవి పాడి వాయించును.

పేరి.—వహ్వా! వహ్వా! [అనుచు వినుచుండును.

పేరి.—ఒకపాలి నానొక జేపిని పెంచినా. అది రాత్రిలో ఆడజేపిని సూస్తే యింతకంటా యెయ్యింతలు కుఁయి కుఁయి కుఁయి కుఁయి అనేది. దానికంటా దీని యిసేసం యేంటీ అంటా.

విద్యా.—[పేరిగానితో] ఏలినవారు చమత్కారముగా పలుకుచున్నారు. మేమును అట్లే ఉత్తరము చెప్పెదము. దీనికి ఆఁడుజేపి అక్కఱలేదు. అది లేకుండనే యిది కుఁయి కుఁయి కుఁయి కుఁయి అనును. మఱి దీనికి గంజి అక్కఱలేదు.

పేరి.—ఆమాట నాను నమ్మను. గంజి తాక్కుంటే, అంత ఆకడు పేలాగొస్తది? అంత అది ఆకిందిది అది యేలాగొస్తది?

విద్యా.—[వికటముగా నవ్వుచు] ఏలినవారు అచ్చు మాజాతీయమే పలుకుచున్నారు, కానిండు, కడుపును ఉదయము దీనిక గంజి త్రాగకయే వచ్చినవి. ఏలినవారితో కానిది చెప్పుదుమా?

పేరి.—[ఇంచుకంత విమర్శించి, ఆశ్చర్యహర్షోత్కర్షముతో] ఆ ఆ ఆ తెల్చిందయ్యా? గంజితాక్కుండానె కడుప్పెరిగింది అన్నారు. గంజెందు కయ్యా దానికి? ఎంత మాఁవసమైనా తినేస్తది, మూకుళ్లు మూకుళ్లే మాయం చేశేస్తది?

మంత్రులు.—అది మాంసము తినునని యేలినవారి కెట్లు తెలిసినది?

పేరి.—మఱి మాఁవసం తినకుంటే ఆకొరలెందుకు? ఆపళ్లెందుకు నోటినిండా?

మంత్రులు.—అవి అలంకారార్థము. అ దేమియు తినదు.

పేరి.—[ఆశ్చర్యముతో] నిజమే? నిజమే? మీఁత్తెప్పెమానకంగ నిజమే?

మంత్రులు.—నిశ్చయము. [పేరిగాఁడు వణఁకుచు వీణకు దండ మిడును.

మంత్రులు.—అది దివ్యముగా పాడఁగలదు.

పేరి.—ఆపాట గీట నాకు తెల్దుగాని, నా బేపిలాగ మొరిగించండి సూతాం.

[వైణికుఁడు మొఱిగించును. మార్దంగికుఁడు అనుసరించును. పులి. స్వారస్యపుఁ ద్రాటిని లాగును.

పేరి.—[పకపక నవ్వి] వవ్వా వవ్వా! వవ్వా వవ్వా! అచ్చరి అచ్చరి ఒక అచ్చరనచ్చయినాం, ఒక అచ్చరనచ్చయినాం, ఒక అచ్చరనచ్చయినాం. అదీ సారాశెంబు! అద్దదీ సారాశెంబు! [అందఱు గొల్లు మని నవ్వుదురు.

[పేరిగాఁడును తన ప్రజ్ఞకు సంతుష్టి తెలుపుచు నవ్వును.

మంత్రులు.—ఆహాహా ఏమి యేలినవారి బుద్ధి ప్రభావము! ఏరాత్రి యౌగంధర ద్వితీయులై మాఱువేషమున పేఁటలు తిరిగినప్పుడు నేర్చినారో యీజాతీయము! అదే విష్ణ్వంశ. 'నావిష్ణుః పృథివీపతిః' అన్నారు. పాట కానిండు.

పేరి.—[నవ్వుచు] ఇచ్చాలు. నాకు కడుపునొస్తుంది. ఇంక నాను నవ్వలేను. ఆ అయ్యవోరిని పాడమనండి.

[గాయకుఁడు పాడును, అనుచరుఁడు కర్పూర శలాకను తెచ్చి పేరిగాని చేతిలో పెట్టును.

పేరి.—[ఆడంబరముగా దానిని చేత నెత్తి] ఉండవయ్యా రవంతుండో. ఊరిక పాడుకపోవటమే? కళ్లకి కప్పూరసలాక అంటించుకోనియ్యవేమి? నీపాటకి అనంధ బాస్పాలు అక్కర్లేదా యేంటి?

గాయ.—[స్వగతము] ఈపిరపుచరియ వింతెగా నున్నదె! [అని పాడును.

[మార్దంగికుఁడు, మోర్సింగువాఁడును, వాయింతురు. పులి. స్వారస్యపుఁద్రాటిని లాగును. పేరిగాఁడు తల యాడించును. కర్పూరశలాకచే ఆనందబాష్పములు విడుచును.

పేరి.—అబ్బ! నాకళ్లంతా పోతున్నయ్యయ్యా యీ ఆనంద బాష్పాలతాత! మఱి, యీనసెత్తిమీఁద కొక్కంతకొప్పు, మెళ్లో ఒకచేటె అజెంట్లో తాటిపిందంతగింజ; ఇయ్యి మెయ్యలేక యీనబుజ్జ యిసిరియిసిరి, మెడతిప్పి తిప్పి, కల్లు మూతపడి, నాలికెల్లబెట్టి, తనుతులాడుతావున్నాడుగందా, నాగాడిద నదురుబెదురు లేకుండా యెన్నిమాటలు మోశేదిరా నారంగా! దానిముంగట యీనెందుకు పనికొస్తాడూ అంటా?

మంత్రులు.—[పేరిగానితో] పాట చిత్తగింపవలయును. [గాయకునితో] పాడవయ్యా. [గాయకుఁడు మంద్రముపాడును. మృదంగము, మోర్సింగు, అనుసరించును.

పేరి.—పాటలో మాత్రం యీనెచ్చేంటీ అంటా! నాగాడిద ఓంద్ర పెడితే రేవురేవంతా రోయి రోయి రోయి అంటా మోగిపొయ్యేదే! ఈన పాడితే యేదీ మోగమను. యిక్కడికే యినపట్టం లేదే!

గాయ.—[స్వగతము] ఏమిగ్రహచారంవచ్చెరా యీశ్వరా!

[అని మధ్యమము పాడును. పులిగాఁడు దారము లాగును.

పేరి.—[తలయూఁచి] ఆద్దదీ! యిప్పుడు కొంచం వోండ్రానికి శేరు పోతావుంది పాట. మాగాడిదికి శేరు పోతా వున్నాడీయన.

[గాయకుఁడు మఱియు స్వారస్యముగా తారము పాడును. మోర్సింగువాఁడు వాయించును.

పేరి.—[నవ్వుచు] శవ్వా! శవ్వా! మాగాడిదే! మాగాడిదే! అచ్చం మాగాడిదే! ఏదీ యేదే మల్లీ! [గాయకుఁడు మఱియు స్వారస్యముగాపాడును.

పేరి.—[అట్టహాసముతో] శవ్వాశవ్వా! యెంతటిబ్యాప్మడవయ్యా! ఎంతటి బ్యాప్మడవయ్యా! మాగాడిదికి నువ్వు అన్నవో తమ్ముడివో కావాలగాని మరికోడివి గావయ్యా. నీకు అచ్చరనచ్చ లిచ్చేశినా.

గాయ.—మగాప్పిరవూ, పూలోక తేవేందిరా, నేను ఇంకెనూ చెక్కగా పాడుతును. తగిన వెగుమతి యియ్యావల్య.

పేరి.—నాదంతా, పాడు, యిచ్చేస్తా. [గాయకుఁడు ఓంద్ర పెట్టును.

పేరి.—[విభ్రాంతుఁడై ఆశ్చర్యపడుచు] ఏమి బ్యామ్మల పెబావం ! ఏమీ బ్యామ్మల పెబావం? యీ యిద్దలకే 'బ్యామ్మడో బెమ్మదేముడో' అన్నారు. నాను పుట్టినప్పటాలనుంచి అట్టిమద్దినే పెరిగినానుగంచా, నాకు రాలేదు. యీళ్లు దాన్ని దగ్గిరికేరానీరు, రేవులో అడుగెట్టనే యెట్టరు! యీళ్లకెలా వొచ్చిందిరా అంటా. సామీ దణ్ణం. నీకు కోటివరాలు నాసత్తెప్పెమాన కంగా యిచ్చేసినా. [అని తనలో ఆశ్చర్యపడును.

మంత్రులు.—ఇట్లు రసాభాసము చేసిన విద్యావంతులు తమకడ కేఁక వత్తురా ?

పేరి.—ముందత్తిగా అయనకి కోటివొరాలిచ్చి మరి నాతో మాట్లాడండి.

మంత్రులు.—సిద్ధము. కచ్చేరీ లేమనప్పు డిచ్చెదము.

ప్రతీ.—[ప్రవేశించి] జయం జయం ఏలినవారికి. ఆటగత్తె వచ్చి వుంది.

గాయ.—అది మాతో వచ్చిందిదా.

జనా.—ఆలాగా ? మంచిది. [ప్రతీహారితో] రమ్మను.

ప్రతీ.—దేవరవారియాజ్ఞ.

పేరి.—ఆట కత్తేంటి ? కత్తి ఆడుద్దా ?

విద్యా.—కత్తి గాదు.

పేరి.—కత్తొట్టుకుని మనిసి ఆడుద్దా యేంటి ?

విద్యా.—[చెవిలో] ఛీ ! ఊరకుండు !

అంతట నటి ప్రవేశించును.

పేరి.—యేంటయ్యా, అప్పుడే రమ్మన్నారు? ఈపారాశెంబుతాడు, యీఆనంధబాస్పాలు, ఈటితోటి నాపానం పోతావుందయ్యా. [నటితో] రొవ్వంత సేపు ఆడక పాడక వూర్కో. [నటి సభావందనము చేసి నిలుచును.

పేరి.—యియ్యాణ, యీపాట, యీటికాత నావొల్లంతా సందేగాలే అయినయ్యండీ. అడుగుతాను తీరుస్తారా ?

జనా.—సందేహములు అవతల తీర్చుకోవచ్చును.

పేరి.—ఇప్పుడు సావాల. ఆకపోతే సారాశెంబు చెడతది, యీళ్లు పాడతావున్నా, వోయిస్తావున్నా, నాను సూస్తానూ వున్నా, యింటానూ వున్నా, యీపాట నాకళ్ల కవుపడ్డదా? నాశెవుల కినపడ్డదా? శప్పండి.

జనా.—ఈసందేహాలు తర్వాత తీర్చుతాండము.

పేరి.—నావోల్ల కాదు. నాకళ్లల్లో యింక బొట్టయినా ఆనంధ బాష్పాలు లేవు. ఈసారాశెంబుతాటికి నామె జడిపోయింది. గడ్డె సేపుంటేనే గాని నావోల్ల గాదు.

విద్యా:—చిత్తము అలాగే కానిండు, కన్నులు మూసికొన్నను వినఁబడును గావున పాట చెవులకు వినఁబడినదే.

పేరి.—వవ్వా! వవ్వా! అల్లా శెప్పాల. యింకోటి—యీరెండో అయ్యవోరు పాడతావుంటే ఆకుర్రోడు అడబ్బ సచ్చినట్లు లబ లబ లబ లబ నోట కొట్టుకున్నాడే అదెందుకు?

విద్యా.—మోర్సింగని అదొకవాద్యము, దానిని నోట పెట్టుకొని వాయించినాఁడు.

పేరి.—మోరచింగేంటి? ఆ తెలిచింది. చింగ్ చింగ్ చింగ్ అని మోరనేశి కొట్టుకోటమా? అందుక్కూడా ఒకవోయిద్దికం గావాలా? యిదీ వొకింతే. మఱి గంటే, ఆయన యీణె పీకటమేంటి? యియ్యన నోళ్ళె ఆరవటమేంటి? ఆయీణె సగ మోడు సగ మోడు పంచుకొని యిద్దరు వోయిస్తా యిద్దరు పాడరాదా?

విద్యా.—అయిదువ్రేళ్లతో తగిలినంత బాగుగా తగులునా చెంపకాయ రెండువ్రేళ్లతో మాత్రమే కొట్టిన?

పేరి.—యిదీ అంతేనా; చరే! శిన్నప్పుడు మా అవ్వ ఒక కత శెప్పిందండీ. ఈకలికాలంలో కూడా ఆల్లాగ జరిగితేనా, వవ్వా! యీళ్లని తంజావూరినుంచి గింజావూరినుంచి పిలిపించ నక్కర లేదు.

విద్యా.—అది యెట్లు?

పేరి.—యీళ్లని బూమిలో పాతేస్తే శెట్లు మొలిశి యీణోయించోళ్లు, నోట పాడేవోళ్లు, కడుపుమీద శాదుకోనేవోళ్లు, లబలబ కొట్టుకొనోళ్లు, వొందలు వొండలు కాయలు కాయవా శెప్పండీ?

వైణిక గాయకులు.—[అన్యోన్యము] కడేశిల్ యిద్దాఞ్ కుడుప్పాఞ్. [ప్రకాశము] మూకు వెగుమతి పనిల్యా. [అని లేచిపోఁజూతురు. పేరి. అడలి పాఱిపోవును.

విద్యా.—భయపడకుఁడు కూర్చుండుఁడు. ఏలినవారు మహారసికులు. [పేరిగానితో] ఈకాలములో మనుష్యులను పాఁతిపేసిన ఊపిరి తిరుగదు.

పేరి.—ఔను తిరగదు.

విద్యా.—అంతట చచ్చిపోదురు.

పేరి.—ఔను ఊపిరి తిరక్కుంటే సస్తారు, నిజమే. అది నాకు తెల్దా?

విద్యా.—చచ్చిన గింజ మొలవదు.

పేరి.—ఆ, అద్గదీ! బాగా శెప్పినావయ్యా. ఏమడిగినా శెప్తావండీ నువ్వెక్కడి మంత్రివోగాని? మఱింత నాట్కం కానీండి. తాడుణ్ణీండిగాని బాస్పాలు నావోల్లగాదు.

మంత్రులు.—[నటితో] ఆట కానిమ్ము.

[నటి పాడుచు ఆడును. మద్దెల వాయించుచు అనుసరించును.

పేరి.—ఒలే, ఆడు ఆడికడుపుమీద్దాన్ని కొట్టుకొంటే నువ్వెందుకే యాడవటం, మూగరటం, దుమకటం, శేతు లిసురుకోట్టం? నా కాణ్ణానీటక్కులు? నీకేమన్నా తగిలిందా? పోనీ, [కనికరముతో] నీ కేం వోయువా, శేతు లలా యగరేశేవు? ఓత లేయిస్తాలే యాడవకు. అయినా గానీ, నువ్వు అడికాడుండొద్దు, నువ్వీమూల్నుండు. కాకిని కొడితే గద్ద సచ్చిందంట! [మద్దెలగాడితో] ఒరే, నువ్వు దానెంబడి తిరగటం యేంట్రా? యంకటయ్య కడుపు లాగ అదొక్కటి ముంగటేసుకుని ఆడపిల్లని దాన్నెందుకురా జడిపిస్తావు? డమా అనిపిస్తావు! డుమా అనిపిస్తావు! టాంటాం అంటావు! టమటమ

అంటావు! మధ్యాహ్నమయిందండి. వొకరిమొకం వొకరు చూడకండి. [నటికి నాయకులు అస్లీలు చేయుదురు.] పేరి.—మరింక కానీండి.

నటి.—[మంత్రులకు చేతులు జోడ్చి] స్వామీ, ఏలినవారి అభిప్రాయం తెలవ లేదండి.

విద్యా.—[పేరిగాని చెవిలో] తిన్నగా ఆడనీయకపోతివా తర్వాత యమధర్మరాజశాస్త్రులతో చెప్పి డొక్క బ్రద్దలు చేయించెద.

పేరి.—[జనాంతికము] బుద్ధిబుద్ధి. [ప్రకాశము] మర్మమీ లేదు ఆడండి. [నటి ఆడుచు పాడును.

## అఠాణా, ఏకతాళము.

నిన్నుఁ గని యెన్నుకొను కన్నె మది నున్న,
ఆ కన్నెమది నున్న, ఆ కన్నె..., ఆ కన్నె..., ఆ కన్నె...
ఎవ్వరిది దోసమిది? ఎవ్వగను మాను నిది?
మవ్వమునకన్న, నీ మవ్వ...నీ మవ్వ...నీ మవ్వ...

[నటి ఆడును. స్వారస్యము హెచ్చును. మార్దంగికుఁడు అనుసరించును. పులిగాఁడు దారము లాగును. పేరిగాఁడు తల ఆడించుచుండును.

పేరి.—మా శేవంతా వొక్కపాలే వుదికినా యీయెంకటయ్య కడుపుకి చరి రాదురా! [అని మిక్కిలి తల యాడించును. స్వారస్యపుంద్రాడు తెగును.

పేరి.—హాహా! నిలునిలు. నిలవోసి నిలు. సారా శెంబుతాడు తెగిపోయింది. [అని జుట్టు తడవుకొనును. కొందఱు గొల్లుమని నవ్వుదురు. కొందఱు ఆశ్చర్యపడుదురు.

పేరి.—[మంత్రులతో] అయ్యా, మరి సబయెలాగ? తాడు తెగిపోయిందే.

జనా.—ఇఁక త్రాడక్కఱలేదు. [నటితో] ఈ పాట చేసిన మహాకవి యెవరు? మంచితేనెకు చెంచెతను పొగడుదురుగాని తేఁటిని దలఁపరు.

నటి.—మహాకవి పీయూషవర్షులవారు. వారిశిష్యురాలిని నేను. వారున్ను వచ్చివున్నారు. దర్శనానికి శెలవైతే వస్తారు.

సేనా:—అవశ్యము రావలయును, ప్రతీహారీ, మహాకవి పీయూష చోళవారు వచ్చియున్నారఁట. తోడ్కొనిరా.

ప్రతీ.—చిత్తము. [అని పోయి కవిని తోడ్కొని వచ్చి] అట్లా దయచేయండి.

మంత్రులు.—ఇట్లు దయచేయుఁడు. [పీయూషవర్షుఁడు కూర్చుండును.

షేరి.—నమస్కారములు. మరిగంటే కయీస్సర్లూ, నాను మెచ్చుకొనేలాగ కయిత్తం శెప్పే ఆబోజనరాజు తను బోంచేస్తుండేయాల తనకాళ్లు గుడేవోడికి కాళిదాసుకి యిచ్చినలాగ నీకు నాను అచ్చరనచ్చ లిస్తా.

కవి.—ఏలినవారివచనశుద్ధి వింతగానున్నది.

[అని క్రిందియట్లు ఆశీర్వదించును.

ఉ. 5జ్యాయసిఁ జేయుచున్ 3కమలసంభవు మ్రోలను 4దత్కళత్రమున్,
'నాయన, మ్రొక్కుఁగొమ్మ'ని 6యనారతము న్బలికించుచున్నిరిన్,
ఆ 7యగజాతకున్ సవతి 8యాలము వెట్టుచు నెట్లు సూచినన్,
2నీయశ మెల్లలోకముల 9నిందలు వొందు 1నరేంద్రచంద్రమా. 1

మంత్రులు.—ఆహా! ఆహా!

---

1. 1. ఓరాజశ్రేష్ఠుఁడా, 2. నీకీర్తి, బ్రహ్మలోకమున వ్యాపించి, 3. బ్రహ్మయెదుట, 4. ఆయనభార్యను (సరస్వతిని) ఆమెయొక్క నల్లని తలవెండ్రుకలను తెల్లగామార్చి బ్రహ్మకు,5. ముసలిదిగా అగపడునట్లు చేయుచున్నది; అట్లే వైకుంఠమున వ్యాపించి లక్ష్మికి తనతండ్రి పాలసముద్రము తన్నుఁజూడ వచ్చెనను భ్రమను పుట్టించి ఆమెచే 'నాయనా నమస్కారమును గ్రహింపుము' అని, 6. మాటిమాటికి పలికించుచున్నది; అట్లే కైలాసమున వ్యాపించి, 7. గౌరికి తనమీఁదికి గంగ అన్ని దిక్కుల నుండియు వెల్లి విరిసిన దను భ్రమను గలిగించి ఆమెకు సవతి, 8. పోరు కల్పించుచున్నది. ఇది యెల్లను నీకీర్తి చేసిన చిలువిష మని ఎఱింగినంతట వారు నీకీర్తిని, 9. ఆడి పోసికొనుచున్నారు.-కీర్తి తెలుపని కవిసమయము. విశ్వవ్యాపకకీర్తిశాలి అని భా.

పేరి.—[హాసన్ముఖుఁడై తల యూఁచి యూఁచి విని] దీనికి నాను సాయింపాకమైనా యీష. యిదేం కయిత్తం యిది! సీత్ !

కవి.—[స్వగతము] మంచి పెడవాయువు. [ప్రకాశము] ఏలినవారు ఈమాట చిత్తగింపవలయును. [అని మరల అశీర్వదించును.

ఉ. హెచ్చుగ నీవు సత్కవుల కిచ్చు [1]పసిండిని రాలు [2]రంజకం
[3]బచ్చుగ నీదు [4]దానసలిలాధిగలం బడి యా [5]మహోదధిలోఁ
జొచ్చి [6]శయానశౌరిహృది [7]జోటిగఁ జిట్టము గట్టి, దానినే
లచ్చియు, బుచ్చి, పాల్కడలికన్నమ, యంచువచింత్రు [8]కాకవుల్. 2

మంత్రులు.—బళి బళి.

పేరి.—[మరల హాసన్ముఖుఁడై తల యూఁచి యూఁచి విని] దీని కొకసాయింపాక మిస్తా! కయిత్త మంటే యిలాగా; పెళిమనిసికీ తెలియాల, సాకలోడికి మంగలోడికి కూడా తెలెయాల.

కవి.—[స్వగతము] సరి. ఇఁక ధార్ష్ట్యము చేసెదను. [ప్రకాశము]

క. సలవనుడతలకి మలెనే,
యెలిబూడిద సొడు సున్న మెల్లల మలెనే,
కలునీలమలె, మజేలా,
యెలిగే నీయసము సేల కెలికో కవురా. 3

మంత్రులు.—బళి! బళి!

పేరి.—[తెఱచిననోరు మూయక, తల యూఁచి యూఁచి విని] వహ్వా వహ్వా! బలే! బలే! బాపనయ్యా. అచ్చరనచ్చలు, అచ్చరనచ్చలు,

---

2. 1. బంగారములోనుండి, 2. పొడుము, 3. చక్కఁగా, 4. దానోదక నదులయందు, 5. మహాసముద్రములో, 6. (అచ్చట) నిద్రించుచున్న నారాయణుని ఱొమ్మునందు, 7. స్త్రీరూపముగా, 8. పనికిమాలిన కవీశ్వరులు (వ్యాసాదులు).

3. ఎల్లలమలెనే=(గోడలకు వేయునట్టి) వెల్లవలె. ఎలికోక=తెల్లచీర.

అచ్చరనచ్చులు, కయిాస్సనుడా, యీాలాంటికయిత్తం యింకెవరైనా శెప్ప గల్తురా ?

కవి.—ఇంతవఱకు లేరు, నేనే మొదటివాఁడను, ఇట్టికవులు సాధారణముగా పుట్టరు.

పేరి.—మరి నువ్వేలాగ పుట్టినావయ్యా ?

కవి.—శ్రీరాములవారికి వాల్మీకిమహాముని, ధర్మరాజువారికి వ్యాస మహాముని, రేవేలినవారికి నేనును, అవతార మెత్తినారము.

పేరి.—నువ్వెవరవతారం బ్యామ్మడా ?

కవి.— నేను కాళీవాహుని యవతారమను.

పేరి.—[స్వగతము] అదేం మొఱ్ఱో ! [ప్రకాశము] మఱి నానో ?

కవి.— రేవేలినవారు శ్రీమహావిష్ణువు నవతారము.

పేరి.—ఐతే యిష్ణుమూర్తికి గూనుంటదా? [అని మెడ తడవుకొనును.

కవి.— పూర్వము విష్ణుమూర్తికి మందరమును మోచుటకై వీఁపును వంచి వంచి కూర్మమైనప్పుడు గూను వచ్చినది. అదే యీా రేవేలినయవ తారములో మూటలు మోచి మోచి వచ్చినది. రెండును నీళ్లతో సంబంధ పడిన యవతారములే గదా.

విద్యా.—[జనార్దనునితో జనాంతికము] చూడవోయి తమ్ముఁడా, చెవుముకి శాస్త్రులగడునుఁదనము. [ప్రకాశము] కవిగారూ, ఏలినవా రేమి మూటలు మోచినారు ?

కవి.— * భూదేవి ముఖ్యాలంకారముల మూటలు.

జనా.—మఱి, రేవేలినవా రెమి ?

కవి.—కడమరాజులరాష్ట్రములచుట్టును దేశము లున్నవి. ఏలినవారి రాష్ట్రము గోదావరీ సాగరత్రయ పరివృతముగదా, కావున ఎటు చూచినను రేవే.

---

* ఊరివారి వస్త్రముల—"వస్త్రముఖ్యస్త్వలంకారః."

మంత్రులు.—మహాకవివర్యా!

పేరి.—యీమాట లుంచండయ్యా. కయీస్సర్యా శెప్పవయ్యా, యీలాంటి కయిత్తం శెప్పేవోళ్లు యింకమీవయినా వుంటారావుండరా?

కవి.—ఇట్టికవులు ఇఁక పుట్టఁగలరు.

పేరి.—యప్పుడు? యక్కడ? నాకిట్టాంటికవులే గావాల, యివరంగా శెప్పు.

కవి.—ఇంక అయిదాఱేండ్లకు వెయిదొరతనములో కొన్ని తావుల మీబోఁటిరసజ్ఞులే బహుళమగుదురు. వారికై మీబోఁటిరసికులే కవనములు సేయుదురు. మీవలెనే వారుభయులు చదువుకొన్నవారికన్న తామే మేలని తలఁచువారే.

పేరి.—అయ్యా, కయీస్సరయ్యా, మోము సదువుకొనోళ్లకంటె యెచ్చని మాకులంగుట్టు నీకేలాగ తెల్సిందయ్యా?

కవి.—వరప్రసాదము, మఱి ప్రకృతము. ఆకవులు మీకుఁ దగినకవనము చేయుదురు. అది అతినీరసముగా నుండును. అందుల కారసజ్ఞులు, ఇందులకు మీరెట్లో అట్లే, ఆనందసాగరములో మునిఁగి ఊపిరితిరుగక ఉక్కిరిబిక్కిరియై డొంకతప్పి డింకకొట్టుదురు.

పేరి.—అయితే కయీస్సరయ్యా, ఒల్లు నీరసంగా వుంటే బాగుండదే, కయిత్తం నీరసంగా వుంటే బాగుంటదా?

కవి.—నీరస మనఁగా నేమి? నీవు ఆనందించురసము నీరసము.

పేరి.—వహ్వా వహ్వా! నీనోటొచ్చేదంతా కయిత్తమేనయ్యా! † దెర్ది శేశినావు! నానుఅన్నందించేరసంలో ఆళ్లు శేస్తారుగా కయిత్తం! బలే బలారే! కయీస్సరయ్యా, నీ కయిత్తానికీ, నీపగ్గెకీ, నీదెర్దికీ, నువ్వు శెప్పిన ఆ సుబమైనమాటకీ నీకు అచ్చరనచ్చలు గావయ్యా అచ్చరకోట్లిచ్చేశినాను తీస్కెల్లు.

కవి.—ఏలినవారికటాక్షము! ఇట్టి రసజ్ఞులవలన మాకు దేవేంద్రైశ్వర్యము రావలయుఁగాని! కనుకనే పెద్దలు చెప్పినారు—

---

† దెర్ది=ద్వర్థి.

* ఆ. ఇతర పాపఫలము లిచ్చ వచ్చినయట్లు
వ్రాయవయ్య మిత్ర, [1]వనజభవుఁడ;
[2]అరసికాళిమ్రోల సరసకావ్యము సెప్పఁ
దలను వ్రాయవలదు, వలదు, వలదు. 4

మంత్రులు.—ఇప్పటికి సభ చాలును.

[పులి. అనుమఁడును బహుమానములు, తాంబూలములు, అత్తరు, పన్నీరు, తెచ్చి యుంతురు. మంత్రులు విద్యావంతుల కిప్పించి సత్కరింతురు. కవి నటిచేత పన్నీటికూజా పెట్టి మంత్రులకును పేరిగానికిని చల్లించును.

పేరి.—[నటిని చూచుచు ఒడలుతుడుచుకొనుచు నవ్వుచు సరసముగా] దున్నపో తనుకున్నా వా యేంటి? వోన గురిపిస్తా వున్నావు.

[అని యిగిలించును.

వైణిక గాయకులు.—పోయచ్చేండా అప్పా, అమ్మణి కడాచ్చత్తాల్.

[వైణికాదులు సభావందనముచేసి నిష్క్రమి. కవి నమస్కృతు లంది నిష్క్రమి.

జనా.—ఏమిరా పేరిగా, చిలుకకు నేర్పినట్లు నేర్పితిమి. అంతయూ సమయమున వ్యర్థము చేసితివిగదా.

పేరి.—సామీ, మీకు దండ పెడతా. నా కి దంతా తెల్దు బాబూ. నాకు సదువొద్దు. సదువుకొన్నోళ్లకంటా నా నెచ్చేగందా, నన్నెందుకు మారాజా, సదువు శెప్పి కులం శెరుపుతారు?

జనా.—రాజపుత్రులు నీవాక్కు విన్న పొడిచివేయరఁటరా?

పేరి.—అళ్లకంటి కాపడకుండా నన్ను రచ్చించడం మీభారం.

విద్యా.—పులిగా, అనుమా, వీనిని గొనిపోయి విశ్రమింపుఁడు.

[ముప్వురు నిష్క్రమి.

విద్యా.—ఏమి తమ్ముఁడా, దివ్యమైన ప్రహాసనము!

---

4. 1. ఓబ్రహ్మా, 3. మూర్ఖసంఘము నెదుర.

జనా.—మనయాంతరంగికులకే వైవాహికవేషముల రప్పించియుండఁగా పరువు దక్కినది గాని, ఇతరులకే దర్శన మిప్పించియుండిన ఎంత రసాభాసము! వీనిదర్శన మేల! ఆగంతుకులకును ఆశ్రితులకును మనదర్శనమే చాలును.

విద్యా.—బయటిపగరణాలలో మాత్రము వీనియాకారము నుపయోగింతము. వీఁడు ఇంతకన్న వివేకి యైన, కష్టము గదా. వీఁ డిట్టిమూఢుఁ డగుటయే మనకు మహోపకారము.

*ఆ. అరయఁగా నమంత్ర మానక్షరము లేదు,
మందు గానివేరు మఱియు లేదు.
భువి నయోగ్యుఁ డైనపురుషుం డొకఁడు లేఁడు,
కూర్చువాఁ డొకండె కొదువ గాని.— 5

అని గదా శుక్రాచార్యులు చెప్పినారు. వారుగో చెకుముకిశాస్త్రి ప్రభృతులు వేషములు మాని వచ్చుచున్నారు. వారితోఁ గలసి గోష్ఠివినోద మొందుదము. మన కప్పుడే కడుపు వీరణమై యున్నది. జాగ్రత్తగా నవ్వవలయును.
[అని నిష్క్రమింతురు.

---

5. కూర్చువాఁడు=వర్ణములను మంత్రముగాను, వేరులను మందుగాను, పురుషుని వానికి తగినపనికిని, జతపెట్టువాఁడు.

# స ప్త మాం క ము.

స్థలము. 1.—ఢిల్లీ, వలీఖానుని దర్బారు చావడి.

చెకుముకిశాస్త్రి తురకవేషమున ప్రవేశించును.

చెకు.—[ఆత్మగతము] అహా! ఓరుగంటిలో కొట్టిన చెంపకాయ ఎంత యక్కఱకు వచ్చినది! ఆపహారాజవానే వీఁడు, నన్నుఁ జూడగానే తెచ్చి కూర్చుండఁబెట్టి వలీగారికి కబురుకూడ చేయించినాఁడు. బళి! రాని. మంత్రి బృహస్పతిప్రయోగము నంటించెదను. ఏమి యీయనప్రజ్ఞ, మే మెంత తెలివి నేని వినియోగింతుముగాక, ఈఁగ తార్క్ష్యుఁడయిన మే మీయన కాఁగలము. ఈయనకు 'ఇచ్ఛామాత్రం ప్రభోః సృష్టిః.' ఈ మహాను భావుఁడు సాక్షాద్రుద్రావతారము కావలయును.

అంతట వలీఖాన్ దుస్తు తొడుగుకొనుచు ప్రవేశించును.

వలీఖాన్.—సలాం సలాం యమధర్మరాజుజోస్యులుభాయిగారికి.

చెకు.—[లేవకయే] ఈమర్యాదలకు టక్కులకు ఏమిలెండి? కూర్చుండుఁడు. [వలీఖాన్ కూర్చుండును.

చెకు.—మీరు మోసము చేసిన నేను మోసపోయెదను గాఁబోలు. 'ఢిల్లీకి తీసికొనిపోయెదము, సుల్తానువారిదర్శనము చేయించెదము,' అన్న మాటలు ఎవరివో? 'మేము ఖరారు తప్పుతామూ?' తప్పరు. నన్ను మీరు వదలినను మిమ్ము నేను వదలలేదు. బ్రహ్మరక్షస్సు వదలదు.

వలీ.—భాయి, నేను బలే హావసరంలో వచ్చినమాట మీకీ తెల్సే వుంటుంది.

చెకు.—నే నుండఁగానే మీహర్కారా ఖుస్రూఖాన్ కడకు వచ్చి [హేళనముగా నవ్వుచు] మీప్రతాపము వెడలఁబుచ్చినాఁడు.

వలీ.—హేళనం చేస్తా వేమి భాయి?

చెకు.—చాకలిని పట్టి తెచ్చితి వని నిన్నక్కడ లోక మంతయు హేళనము చేయుచున్నారు. అప్పుడే ఖుస్రూఖానునికిఁ గూడ తెలిసినది.

నీవు ఓరుఁగంటినుండి తరలఁగానే యుగంధరుఁడు వచ్చి వాకిలి నొకని బోధించి రాజువేషమున నీ యడపదాకిలో నిలిపినాఁడు. వాఁడు కావలయూ ననియే నీకు పట్టుపడినాఁడు. నీయోగము మానత్యాగమే, వానియోగము రాజభోగమే. నాతో మాటలు పెంపకు.

వలీ.—మఱి అక్కడిగతి ?

చెకు.—యుద్ధము, ఖుస్రూ పరారి, మీవాఁడు సర్వనాశము. కడమ మీసర్దార్లు డింకకొట్టినారు.

వలీ.—రాజాకథా యేమి ?

చెకు.—రాజు మొదట చచ్చినాఁడు, తర్వాత వచ్చినాఁడు.

వలీ.—తెల్లేలాగ చెప్పుభాయి.

చెకు.—రాజు వేఁటలో చచ్చె నని నేనొక దొంగజాబు మంత్రులకు చేర్చి అల్లే దేశ మంతట కింవదంతి పుట్టించి కొంత దుఃఖశాంతి చేసికొంటిని. పిమ్మట వారము రోజులకు రాజు వచ్చెను.

వలీ.—మరి మంత్రియుగంధర్ కథా యేమి ?

చెకు.—ఆయన రాజు వచ్చినవెనుక రామేశ్వరము పోయి అచ్చట మరిడీ జాడ్యమువలన చచ్చినాఁడు.

వలీ.—అల్లా! అల్లా! అల్లా! హాశ్చర్యం! [హర్షముతో ప్రకాశము] ఇంక ఓరంగోలు మాకీ ఏక్ లాడూ. అచ్ఛా! ఆయ్నా రామేవరంపోవడం హామారే వేగుల్ చెప్పినారు. ఆయన సావడం మాదేపుణ్ణెం.

చెకు.—మఱి ప్రకృతము.

వలీ.—నాకి యిప్పటికి యోగం చెప్పు భాయి.

చెకు.—నిన్ను నేను ప్రేరించితి నని బొంకవుగదా? మఱి,ఒక్కొక్క మాటచెప్పఁగానే నిజము నిజ మని పలుక వేని నేను పైని చెప్పను. పూర్వము నీవు లడాయికిఁ గాదని బొంకలేదా? నిన్ను నమ్మరాదు.

వలీ.—నీవు నాకీద్రోహం చెయ్యనని ఖారార్ చేస్తే అంతాయఖ్రార్ పడతాక.

చెకు.—ఇప్పుడేల ఖరారు ? నేను ఓరుఁగంటిలో నీజేరాలోనే చేసితిని. చేసిన ఖరారు నేను మరల చేయను.

వలీ.—అయితే వొప్పుకొంటాగా చెప్పు.

చెకు.—ఖుస్రూ వచ్చియున్నాఁడు. నిన్ను దర్శించును. చాకలిని తెచ్చితివని నీతో పలుకును. సుల్తానుతో చెప్పు నని వెఱచి నీవు వానిని చంపి వేయుదువు. చెప్పుము, చంపఁ దలఁచితివా లేదా ?

వలీ.—జోస్యులు భాయి, నాప్రాణాన్ని నీచేతా పెడుతున్నాను. నేను చాకలికి తెచ్చినమాట ఖుస్రూకి తెల్సిం దని నీవు చెప్పినప్పుడే వాడికి సఫాయి చేయవల్సింది తల్చినాను.

చెకు.—నీవు ఈఢిల్లీ సింహాసనము నెక్కఁగోరి యున్నావు. నిజము పలుకు.

వలీ.—సాస్త్రుల్లుభాయి, నాప్రాణం నీచేతా వుంది. కోర్తున్నాను.

చెకు.—నాకు ఒక ఖరారు వ్రాసియిచ్చిననేగాని, నీకు అది వచ్చునో, రాదో, ఎప్పుడు వచ్చునో, ఎట్లు వచ్చునో, చెప్పను.

వలీ.—చెప్పు, రాశి యిస్తాను.

చెకు.— “నేను నేటికి తొఁభైరోజు రాత్రి సుల్తాన్ కాగానే నీకీ నాచెల్లెల్ని యిచ్చి పెళ్లీ చేసి వోరంగోల్ పట్టి ప్రతాపుడుకి ఖైద్ చేసి ఆరాజ్యానికి నీకీ పాచ్చాచేస్తాను.” అని వ్రాసి నేఁటితేది వేసి దస్కత్తు చేసి యిమ్ము.

వలీ.—అరే బామ్మన్కి నీకీ నాచెల్లెల్ని యేలాగ యిచ్చేది భాయి?

చెకు.—నేను నీమతములో చేరెదను.

[వలీ వ్రాసి యిచ్చుట నభినయించును.

చెకు.—[పుచ్చుకొనిచదువుకొని] మంచిది. ఈ ఖరారులోనే చెప్పితిని.

వలీ.—యేలాగా వస్తుంది ?

చెకు.—ఖూనీలు చేసి సంపాదించెదవు.

వలీ. — చెయ్యడాన్కి తయ్యార్ వున్నాను. ఎవర్కి ఎవర్కి ?

చెకు. — నీకు విరోధులగు వజీర్లు నందఱను సుల్తానును గూడ.

వలీ. — అందర్కి చంపడాన్కి తయ్యార్. సుల్తాన్కు కూడా చంపడాన్కి తయ్యార్. వీడు అన్నా కొమారుడ్కి సిఖువుకే చంపి తఖా యెక్కిన వాడే. యిాడఉన్నా నాకీ యేలాగ దొరకుతార్ భాయి ?

చెకు. — ఇందఱును ఆ రాత్రి ఒకచోటలో చేరుదురు! అప్పుడు నీకు దొరకుదురు.

వలీ. — చమ్పడానికి అసాధ్యం వుంది. సాహస్యం వుంది. మరి యిందుకీ నా ఖుష్మక్ యేమీ జరూ ల్లేదా ?

చెరు. — సర్వము యత్నాధీనమే. యత్నము లేక గ్రహములు ఫలము నీయవు; స్వప్నమందుఁగాని, మనోరథమాత్రమునఁగాని, జన్మాంతరమునఁగాని, ఇచ్చును. కావున పూర్ణయత్నము వలయును.

వలీ. — ఆయత్నం యేలాగో చెప్పు. నేనే యత్నం చేస్తే వక్తే తప్పి వక్తీచెయ్య వల్సి వచ్చును. నీవు జోష్యానికి సరిగా ఇదీ చెప్తే అదీ చేస్తాను. ఫలం నిశ్చయం.

చెరు. — అవును, అట్లు చేసిన ఫలం నిశ్చయమే. అవునుగాని 'నాపొట్ట పెరగావాలా నానోరు తియ్య కావాల, నీకే లడ్డు నమిలిపెట్టు నీవే లడ్డు మింగిపెట్టు,' అనుచున్నావే ?

వలీ. — భాయి, నీకీ చూడగానే నాకీ ఖాసాబుద్ధి వుండదు. నీవు జోష్యం చెప్తావో వుపాయం చెప్తావో నాకీ తెల్వాదు, నేను కబోదీ వుంటాను.

చెరు. — రెండును కలిసి చెప్పెదను. ఆదినము పగలు మూఁడవజామున సుల్తాను సభకు — [అని సగములో] మంచిది.

ఉ. ఈ [1]మత మీవు నేయు దని యేమి నిజంబు ? బడావజీర పై
భూముల సీమలం బొగడు వొందిన [2]మేటివి, నీకుఁ బాదుషా

1. 1. ఒప్పుకొన్నపని, 2. గొప్పవాడవు. అమీరు=ప్రభువు. ఈ మెయిన్=ఈవిధముగా. గిరవు=కుదువ.

గామి యు దంతగాఁ గొదువ గాదు; పకీరను నే నమీరు గా
కీమెయి నుందునొక్కొ? గిర విమ్మిటఁ జొచ్చెద నమ్మి నీనుడిన్. 1

వలీ.—నాచెల్లెలికి యిప్డే నిక్షుర్కు తీస్కానిపో.

చెకు.—విస్తారము భోజనము చేయుచునా యేమి? నీచెల్లెలిని పాచ్ఛా పెండ్లిగా పెండ్లియాడుదునేగాని పకీరు పెండ్లిగా పెండ్లియాడను. అందుల కిదిగో, జవాహారీ జామీన్ పుచ్చుకొనియెదను, వినుము.

వలీ.—అచ్ఛా, తయ్యార్, చెప్పు.

చెకు.—నన్ను, ముందు సుల్తానుసభకు చేర్పుము. నీపెద్దకొమారితను సుల్తానునకు, చిన్నకొమారితను నీవిరోధి సేనాపతికిని, ఇచ్చెదనని వారికి చెప్పు. [ఆత్మగతము]

ఆ. భరతఖండ మేలుఁ [1]బంచాశదబ్దముల్
పరగ నాకుమారిపతి యటంచు,
బిట్టపికుగు జ్యోతిషాట్టహాసములతో
నతఁడె వీని వేఁడున ట్లొనర్తు. 2

[ప్రకాశము] దానిని తప్పకుండ అతఁడు కోరునట్లు చేయుపని నాది. నే నేర్పరించిన తొంబదవ దినము నిశ్చితార్థము సుల్తానువారిసభలో చేయుము. ఆయుత్సవముకై వజీర్లను సేనాపతులను కడమగొప్పయుద్యోగస్థులను అంద అను పిలువుము. [ఆత్మగతము]

(మత్తకోకిల)

నీకుఁ బాదుషహా యొసంగును నేఁడు చూడు [1]పెషావరున్;
నీకు [2]వంగము; నీకు [3]నంగము; నీకు [4]లాహొరుఫర్గణా;
రాక తప్పకు మంచు జోస్యము రాణఁ బల్కి వజీర్ల నే
నేకసంఘము గూర్తు నాఁటికి నిందు ఢిల్లిపురిందుతోన్. 3

---

2. 1. 50 సంవత్సరములు.

3. 1. 2. 3. 4. పెషావరు, అంగము, వంగము, లాహోరును దేశముల పేరులు.

[ప్రకాశము] అందఱను నేను రక్షించెదను. మూఁడవజామున గోవావర్తకులు వచ్చి నజరులుంచి సుల్తానును తమయొడలకు సరకులు చూడరమ్మని పిలుతురు. వెలతీర్పరి లేక కొను టెట్లు? మన మడివేలు ప్రతాపుని కెలతీర్ప రక్షింతురు. నజరులకు వాఁడు వేయు వెలలు వర్తకు లొప్పి రేని సభయెల్ల ఓడలకుఁ బోవును. కావున, వర్తకులకు,

(తరళము.)

సబురు ఖర్చు, నజర్లకు న్వెల, సర్వవిక్రయలాభముల్,
ప్రబలమైత్రిగ నావలో మనపక్ష మున్కికి లంచముల్,
[1]నిబిడరాశి [2]యొనర్చి యిత్తువు నీవు; వారిని దాన నే
సొబగు మీఱఁగ [3]డక్కఁగొందును, సొంపుగాఁ బని తీర్పుదున్. 4

వలీ.—ఆమొత్తం యింతా చెప్తే, యిప్డే నీచేతికి యిచ్చి వేస్తాన్.

చెకు.—నీసొత్తంతయు నిచ్చినను చాలదు. నేను పాచ్చా అగునప్పుడు ప్రతాపునినగలు ధరించి ఆతనిగుఱ్ఱమునకు పూర్వ మది ధరించిననగలు వేసి అతనియెదుట నే స్వారి చేయవలయును. అందుకై నాకిప్పటికి ఆవర్తకులే అమ్మ నట్లుగా, వారి కిపుడు లంచముగా ప్రతాపుని భూషణములును వానిగుఱ్ఱము భూషణములును అన్నియు నాచేతికి ఇచ్చివేయుదువు. ఇది నాకు జామీను.

[వలీఖాను శిటాలున లోపలికి పోయి ఒకపెట్టె తెప్పించి తాళపుఁజెవితోఁగూడ ఇచ్చును.

చెకు.—[తెఱచి చూచి] సరియే.

వలీ.—రేపు ఖాయికి సుల్తానువారి దర్శనం.

చెకు.—సరి. నేను నడచెద. నీవునీపని చూచుకో. సలాము ఢిల్లీసుల్తాన్.

వలీ.—సలాం వోరంగోల్పాచ్చా.

[పెట్టెను తెచ్చిననౌకరు పెట్టె నెత్తుకొని చెకుముకితోఁ గూడఁ బోవును. వలీఖాను నిష్క్రమించును.

4. 1. దట్టమైనప్రోగు, 2. చేసి, 3. వశపఱుచుకొందును.

చెకు.—[పరిక్రమించుచు ఆత్మగతము] నన్ను వలీకడకుఁ బంపుటతో నా నీతి విద్యాగురువు ప్రయోగసిద్ధిని ఈ చెంతనే తనకుఁ దెలుపు మని సంకేత మేర్పరించినాఁడు. కావున అతని నే అరసెద. [శ్రవణ మభినయించి] ఎవరు వీరు? వెఱ్ఱివాఁడగపడ లేదని చింతిల్లుచున్నారు. మరల విని కనియెదను.

[అని పరిక్రమించును.

స్థలము 2. ఢిల్లీలో ఒకవీథి.

అంతట ఇద్దఱు తురకజవానులు ప్రవేశింతురు.

[ఉభయులు పరిక్రమించుచు సంభాషింతురు.

ప్రథ.—అరే అమీనుద్దీన్, యీదివానా మనకీ యెక్కడరా దొరుకుతాడు? యిన్నిగల్లీల్ తిరిగినాం, యిప్పటి కింకా హాగ్పడలేదు.

ద్వితీ.—అరే అబిబుడిన్, ఎందుకోమంరా వీడ్మీద గోడ్గస్తీ పంపినార్ మనకీ?

చెకు.—[ఆత్మగతము] ఈ పిల్లిగస్తీలవలననా ఆ ప్రళయరుద్రుని సాధించుట!

ప్రథ.—వీడు దివానా వుంటాడో వుండడో, సుల్తాన్సాయరు కన్పట్టి రమ్మంటార్, వీడు ఢిల్లీసుల్తాన్కు పట్టుకపోతాన్ అరుస్తాడుగదా, ఆయన సుల్తాన్ గదా, దానికి ఆయన వజీర్లు అంతా గాభరా ఆయినారు. దివానా కాకోపోతే, వీడు సుల్తాన్కి పకడ్దేవు చేస్తాడు అని అంధర్కి భయం. వజీర్లో వీడు ఖానాతినడం కనిపట్ట మంటార్.

చెకు.—[ఆత్మగతము] పకడ్దేవు తప్పదు. కనిపట్టుట సాధ్యపడదు. పైవీథిలో నుండును. వీరి మొఱ్ఱ యేమో వినుచు వీరితోనే పోయి, మంత్రి బృహస్పతికి తనయాజ్ఞను మనోరథాతీతముగా నెఱవేర్చితి నని అనన్యగోచర సంకేతముగా ఈ పెట్టెతోనే యెదుటనగపడి పిమ్మట నీయాభరణరాశిని ఇల్లు సేర్చెద.

[అని వారివెంటనే చనును.

ద్వితీ.—మనం యిది మొదల్ ఈరాత్రి అంతా, వీడ్కి తెలియ

కుండా పీడిరోయింటూ తిరుగుతా వుండవాలా. మనకీ యెంతా కష్టం వచ్చిందిరా పిడికోషం?

ప్రథ.—అరే అమీరా, నీవు మొఖ్రా? మాకు చంకల్ అయింది నాకీ యిప్పుడి?

ద్వితీ.—భాయి, నేను ఆ తెలంగిరాజా ఖైదీ వున్నాడే ఆయనికి పహరా. ఈరోజు నాకీ కంతూ లేదు, రేపు నాకీ వంతు.

ప్రథ.—ఎందుకు భాయి ఆరాజాకి ఖైదుచేసినార్!

ద్వితీ.—అది నాకీ మాలుం నహి. ఆయన్కి మోసంచేసి పట్టినారు తోస్తుంది. అరే ఆమహారాజాకి యేమి బడాగుణాలు వుంటవిరా! ఎప్పుడు అతడు ఖయిదీ, నేను పహరాజవాన్ వుంటానుకోషం నేను నమాజుమే కూడా కోర్తాన్.

ప్రథ.—ఏమి ఆతన్కి గుణాలు భాయి?

ద్వితీ.—ఆగుణాలు గిణాలు చెప్పడానికి నాకీ తెల్వాదు. వక్టి చెప్తా:—

క. ఆయన యిందర్, చందర్,
ఆయన జాలీసుసీజ, రాలీసాందర్;
ఆయనమోమ్ చూస్తుంటే,
ఆయనభా త్వింటువుంటె, అదె చాల్ నాకీ. 5

ఆయన రాజా నేను గులాం ఐతే ఆయన నాకి నబాబ్చేస్తాడు, వజీర్ చేస్తాడు, హోమ్డట్టల్ హామ్రా చేస్తాడు. వఖ్మాటా చెప్తా, ఆయన కాలీఫ్ హారూనల్ రషీద్; ఆయన్కి ముందర హామాకే సుల్తాన్ పఖీర్ బిఖార్.

ప్రథ.— అరే నీవు వఖ్రినమ్మక్ తింటావ్, వఖ్రికి పొగుడుతావ్, యేం భాయి?

ద్వితీ.—అరే నమ్మక్ యిస్తే గుణం వస్తుంది? నమ్మక్ ఇవ్వకపోతే గుణం పోతుంది? నమ్మక్కిన్నాం, నౌఖరీ చేస్తాం. గుణం దాస్తాం? ఇది నాలిక వక్టి భాయ్, రెండు కాదూ.

చెకు.—[ఆత్మగతము] సిపాయిగాఁడ వైన నైతివిగాని, నీయందు గొప్పతనమున్నదిరా!

ప్రథ.—అచ్చా భాయి, అచ్చా. గుణం గుణమే, నాలికా నాలికే. భాయి, నీరాజా పెళ్లానికి, బిడ్డాకి, రాజ్యానికి, కంచెఙ్ గించెన్కి, తల్చుకొని యేఁసుస్తాదూ?

ద్వితీ.—పల్కకూడదు. మహారాజ్ తఖ్తుమీదవున్నాడులా గాదిల్చుషి వుంటాడ్.

చెకు.—[ఆత్మగతము] హా! మహాప్రభూ!

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాఙ్ పట్టుకపోతాఙ్,
మూడే సెల్లాకు పట్టుకపోతాఙ్;
వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాఙ్
గోతిలోపాతించి గోరీ కట్టిస్తాఙ్. [మరల అదే చెప్పును.

చెకు.—[ఆత్మగతము] వాఁడుగో, మహానుభావుఁడు వచ్చుచున్నాఁడు.

ప్రథ.—అరే అమీఙ్, దివానా, అరే దివానా, అమీఙ్, దివానా వస్తున్నాడు వుంది, వాడిపాటా యిన్పడ్తుంది. మన్ము యిక్కడే వుందాం. మన గస్తీజవాన్లు అరుగో.

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాఙ్ పట్టుకపోతాఙ్ మూడే సెల్లాకు పట్టూకపోతాఙ్.
[మరల అదే చెప్పును.

ప్రథ.—అరే అమీఙ్, వీడు మూడు సెల్లు అహస్తాడు వింటావా? వీడు రోజ్ లెక్ఖాతప్తాడు లేదు అంటారు.

ద్వితీ.—వీడు మూడు చందుల్నుంచి యిలాగా అరుస్తున్నాడు చెప్తారు: మొదల్ ఆరుమాసాల్కి పట్టుకపోతాఙ్ అరిచినాడు చెప్తార్.

ప్రథ.— అరె నీకీ యెవ్వార్ చెప్పినార్?

ద్వితీ.—పహారాజవాన్లు చెప్పుకొంటార్, నేను వింటాఙ్.

ప్రథ.—ఆరాజాకి వీడ్కీ యేమైనా సంబంధం వుందా భాయి! వాడూ తెలంగి, వీడూ తెలంగి.

ద్వితీ.—వీడిది ఖాత్ వస్తే,దివానాఖాత్ వల్ల మనకీ యేమిటి ఫాయదా? వేరేయేదైనా మంచిఖయాయిష్ చెప్పండి,' అన్నాడు మహారాజా.

అంతట వెఱ్ఱివాఁడు పెద్దగుంపుతో ప్రవేశించును.

[వెఱ్ఱివాఁడు గుంపును కొట్టును. గుంపు వానిమీఁదఁ బడును!

జవానులు.—అరే దివానా ! అరే దివానా! బలే తమాష్! బలే తమాష్!ఏమి వాడివెంటా గుంపూ !అరే వాడు యెంత గడ్బిడా చేస్తాడూ! మన్ము యిక్కడ వాడికి తెల్వకుండా దొంగా వుండి చూస్తాం.

[అని పొంచి చూతురు.

[చెరుముకి వెఱ్ఱివాఁడు కనునట్లుగా వాని మ్రోల పెట్టివానితో నడచును.

ఇద్దఱుజవానులు.—[వెఱ్ఱివానిగుంపునుండి చీలి యీజవానుల కడకు వచ్చి] సలాం భాయి.వీడు దివానా సంధేగం లేదు.తెల్వార్జాంనుంచి యిప్పటిక్కీ వీడ్కీ కూడూ లేదు, వీడికి సైతాన్ బలం వుంది. అయినా కబడ్దారుగా చూడండి. కూడూ తింటాడూ లేదు కన్పట్టండి. మేం పోతాం.

క్రొత్తజవానులు.—పోండి,సలాంసలాం.[ప్రాఁతగస్తీవాండ్రు నిష్క్రి.]

వెఱ్ఱి.—ఢిల్లీ సుల్తాన్...[పొట్లపు విస్తరాకునస్త్రాలోదొరకఁగా దానిం గైకొని] వహవ్వా! నాకు జయకాలం జయకాలం. బలే! యెటువంటికిరీటం దొరికిందినాకు! [అని దానిని టోపిగా ధరించి] బలారే! దీనితో నేను ఈ భూచక్రమంతా యేలుతా. [అని గిరగిర నృత్యము సేయుచు] ఢిల్లీ సుల్తాన్... [చెరుముకి నిష్క్రమించును.

ఒకవర్తకుఁడు.—పాపం, అన్నం లేక అరిచరిచి చస్తాడు. పెట్టినా తినడు. ఎందుకైనా పనికిరాదా, వంట చేసుకుంటాడేమో? వీడి జేబులో యీ బియ్యమ్మూట పడేస్తా. [అని అట్లు చేసి]ఈలాంటిఅనాధలకు చేసిందే పుణ్యం.

వెఱ్ఱి.—నాకు రేగుతూవుంది రేగుతూవుంది రేగుతూవుంది. సున్నం తింటే నోరుపొక్కుతుంది. తుక్కురోటుకు చెప్పుదెబ్బ. తాటిచెట్లు కొబ్బరిచెట్లు చింతచెట్లు మామిడిచెట్లు అరటిచెట్లు అన్నీ చెట్లే; తుమ్మచెట్లంతా ముళ్లు, కండచీమలు. నేను కండచీమను, ఏమనుకొన్నావో? పట్టుకొంటే వదలను. చుట్ట కాల్చడంలో తెలివితక్కువైతే మీనాలకు ఉపాయం. పాముకు పీల్చడంలో వెంగళిప్పైతే తననోటికి చెరుపు, దగ్గిరున్న వాళ్లకళ్లకి చకలికం. ఓంభాయి, ఓంభాయి ఓంభాయి; నాతలకాయను నే నేసవారి మోస్తాను. నన్ను వెక్కిరిస్తే చెకడాలెక్కదీస్తా. రాగా, బోరువగద్దా, నాకెందుకురా తోడుబోతుపెట్టి నావు? అమ్మో! బాబో! తాతో! నాయనో! ఏరడు కూడా చేరినాడు. కళ్లు మూసుకొంటా [అని మూసికొని] ఢిల్లీసుల్తాన్... [ఒకవైపున చూచి] ఆశ్రయింటతూము ఢిల్లీసుల్తాన్; పాపం! యెందుకు కన్నీళ్లు కడవలుగా యేడుస్తావు? అన్నంలేదా నీకు? యిందా తిను అప్పచ్చికొండా. [అని తూముముఖమున జేబులోని బియ్యముపోసి ఒకరాయి పట్టుకొని] ఢిల్లీసుల్తాన్... [అనుచు పరుగెత్తును. ఎవఁడో ఆరాతిని తీసికొనును.

వెఱ్ఱి.—అరే నాకు నాఢిల్లీసుల్తానను ఇచ్చెయ్యి, లేకపోతె గుండెలు పగులతంతా. [అని వానిని తన్నును.

రాయి తీసుకొన్నవాఁడు.—ఏమి బల మబ్బా యీడికి! [అని రాయి పారవేసి. కడుపు పిసికకొనుచు] ఎంత తన్ను తన్నినా డ్రా శండాలుడు. నిద్రాహారాలు లేకుండా తిరుగుతాడు, యీడి కీబలం యేలా గొచ్చిందిరా?

మఱియొకఁడు.—యెఱ్ఱి బలమనంగా యిన లేదంటయ్యా? [వెఱ్ఱి వానింగూర్చి] యిందా. [అని మఱియొకరాయి యిచ్చును.

వెఱ్ఱి.—నాకు ఆ బంగారుసుల్తాన్ మాణిక్యంసుల్తాన్ వన్నెవాడపులిసుల్తానే కావాలి, యీరాయిసుల్తాన్ రప్పసుల్తాన్ రోడిసుల్తాన్ రొంగసుల్తాన్ నాకక్కరలేదు. [అని పటపట పండ్లుకొఱుకుచు, ఆరాయి పారవేసి మొదలిరాతినే తెచ్చుకొని] సుల్తాన్, నీకు దెబ్బతగిలిందా బాబూ, మందువేస్తారే. [అని తనయొంటికళ్ళలము దానికి పూసి] ఢిల్లీసుల్తాన్... [నేలఁబడి

పొరలుచు, పొరలుదండములు పెట్టి, పకపక పకలో తాను నే-
నెవరనుకొన్నావు? నేను యోగీశ్వరుణ్ణి, వేదాంతం నేర్పుతా. సిరా,
గాడిదను, మనిషిని, గుర్రాన్ని, కాలభైరవుణ్ణి, గండభేరుండాన్ని, ఏ
పిట్టను, [త్వర త్వరగా] పోకిరి గద్దను కోడిని పొంగను బోడిని మొట్టను
పొట్టిని కుట్టను. ఏవిద్య నేర్పమన్నా నేర్పుతాను రండి. నాశిష్యులయ్యే
వారు నాతో రండి. నాకు శూన్యం పెట్టక ముందు చదువులుకూడా చెప్ప
నాను. చదువు, చదువు. [అని పిల్లకాంద్రను చావగొట్టుట నభినయించును.

ఒకపడుచువాఁడు.—[తన యిరువురుమిత్రులతో] వెర్రివేషాన ఈయన
వాస్తవంగా యోగీశ్వరుడే అయినా గావచ్చును. ఇట్టివాళ్లకి బంగారం
చేయడం, ఆకాశగమనం, పరకాయప్రవేశం, ఈమహిమలుకూడావుంటాయి.
మనం మెల్లిగా యీయనని ఆశ్రయించి సత్తయేమైనా వుంటే గ్రహింతాం.
మనకు ఈదేశంలో తల్లీతండ్రీ భయం లేదుగదా రండి.

ఇతరులు ఇరువురు.— మంచిదిరా అలాగే చేతాం. మనలో యెవడికి
నేర్పినా వాడు కడమ యిద్దరికి నేర్పవలశింది.

ప్రథ.—ఈయన తన్నినా చంపినా మనం పడదాం. లేకపోతే చెప్పడు.

ఇతరులు ఇరువురు.— సరిసరి.

ముగ్గురును.— [వెఱ్ఱివానితో] స్వామీ, యోగీశ్వరులూ, మేము శిష్యు
లంగా వుంటాం.

వెఱ్ఱి.—బళీ, అయితే రండి. [అని వారిని చావఁగొట్టును.

రాయి తీసికొన్న వాడును రాయి యిచ్చినవాఁడును కడమచూపరు.—
[పకపక పరిహాసించుచు] బలేబలే! సదువువొంటపడతావుంది! సదువువొంట
పడతావుంది! వాడంతోళ్లవుతారు. యెధవముండకి మొక్కితే తనకిమల్లే
యెయ్యేళ్లు వోరిల్ల మన్నదంట.

వెఱ్ఱి.— ఆవెధవముండలమాట మాకేమి రండి. వేదాంతం నేర్పుతా.

శిష్యులు.—తమచిత్తం.

వెట్టి.—మరి నేర్చుకోండి [అని వికటనృత్యముతోను అభినయముతోను త్రింకే నా.

పాట్లు అన్నమైతే నేమిరా, మరి సున్నమైతే నేమిరా.

శిష్యులు.—అన్నమైతే ...

వెట్టి.—అందుచేతీ పాడుపొట్టకి అన్నమే వేతామురా.

[శిష్యులు నవ్వుచు, ఒకరినొకరు చూచుకొనుదురు.

వెట్టి.—[తన్నుచు] దిక్కులు చూస్తారూ? దిక్కులు చూస్తారూ?

[అని జుట్టు పట్టుకొనును.

శిష్యు.—లేదు స్వామీ, లేదు, చూడము, చెప్తాము.

వెట్టి.—[జుట్టు వదలి] చెప్పండి మరి. అందుచేతీ ...

శిష్యు.—[తమలో తాము నవ్వుకొనుచు కొట్టునేమో అని బెదరి బెదరి వెట్టి వానిని చూచుచు] అందుచేతీ ...

వెట్టి.—మేడలైతే నేమిరా, కరగోడలైతే నేమిరా,
అందుచేతా మేడనే యీ బొందిని వేతామురా.

శిష్యు.—మేడ ... నేమిరా, [అని గురువువైపు చూతురు.

వెట్టి.—అందుచేతా ...

శిష్యు.—[నవ్వుకొనుచు] అందుచేతా ...

వెట్టి.—మెత్తలైతే నేమిరా, మరి చెత్తలైతే నేమిరా,

శిష్యు.—[నవ్వుచు] మెత్తలైతే ...

వెట్టి.—చిత్తుగా యీ పాడుకట్టెని మెత్తనే వేతామురా,

శిష్యు.—[నవ్వుచు] చిత్తుగా ...

వెట్టి.—సారయైతే నేమిరా, మరి నీరలైతే నేమిరా,
నీరుబొట్టు కలవనీక సారయే కొడ్దామురా.

శిష్యు.—సారయైతే ...

వెట్టి.—అప్పులైతే నేమిరా, మరి పప్పులైతే నేమిరా,
అప్పుసప్పు చేసి పప్పు ధప్పళమె కొడ్దామురా.

శిష్యు.— [నవ్వుచు] అష్టశైతే ...

వెఱ్ఱి.—జుట్టు పెడితే నేమిరా, మరి మొట్ట కొడితే నేమిరా,
జుట్టు పెట్టుక పూలు చుట్టుక చిట్టకొ లా డ్డామురా,

శిష్యు.—[నవ్వుచు] జుట్టు ...

వెఱ్ఱి.—వెఱ్ఱి పడితే నేమిరా, మరి తొఱ్ఱి పుడితే నేమిరా,
వెఱ్ఱి తొఱ్ఱి వెంగళప్ప వెఱ్ఱిజేడాం తామురా.

శిష్యు.—[నవ్వుచు] వెఱ్ఱి ...

వెఱ్ఱి.—నాకు దీన్ని చిన్నప్పుడు వీరబ్రంహాం నేర్పినాడు. నేను మీకు నేర్పినా.

ప్రథ.—[ఇతరు లిరువురతో జనాంతికము] యోగీశ్వరుడని నేను మొదటనే చెప్పలేదా ?

వెఱ్ఱి.— ఢిల్లీసుల్తాన్ ... [అని పరుగు. శిష్యులు కూడ పరుగు.

వెఱ్ఱి.—వెర్రివాడికి అన్నిమతాలు ఒకటే, అయినా నాకు ఒక విధంగా తురకమతం అబ్బింది. అది మీకు బోధచేస్తాను రండి.

శిష్యు.—మా కక్కర లేదండి.

వెఱ్ఱి.—కక్కర లేదా? కక్కర లేదా? మరి శిష్యుల మని యెందుకు చేరినారు ?

శిష్యు.—నేర్చుకొంటాం స్వామీ. నేర్చుకొంటాం.

వెఱ్ఱి.—[వడిగా నడచుచు] మాతాతా, తురకొాడున్ను ఒక యేట్లోనే మొహం గడుక్కొన్నారు. తురకొాడు అర్ధరిని. మాతాత యిద్ధరిని, మన ఘంతా ఉద్ధరిని. అక్కడ కప్పలు కుప్పలుకుప్పలు. ఆమూలాన వాడి తురకమతం [గంతువేయుచు] కప్పగంతువేసి మాతాతమీదుగా నాకొచ్చింది. నన్నుంచి మీకు వస్తావుంది. మరి చెప్పుకోండి. లేకపోతే చంపేస్తా. [అని పాడును. ద్రష్టయొకఁడు మోర్సింగు వాయించును.]

హోవూ పెడా మీరూ వాల్కికొంటార్.
హోవూవూతీ మీరూ తాగీకొంటార్.

హాఫ్ర యెక్వ్యా మీకీ మస్సి తక్వ్యా!
యెబ్బెబ్బె యెబ్బెబ్బె యేమీమతం!

[శిష్యులు నవ్వుదురు.

వెఱ్ఱి.—[అతికోపముతో] చెప్పరేమి? చెప్పరేమి? [అని కొట్టును.

శిష్యు.—స్వామీ, చెప్పకొంటాం, ఈమాటు చెప్పండి [యథాపూర్వము.

తుక్కా సామీ మీకీ ఛీ! ఛీ! ఛీ!
కోతీ సామీ మీకీ థూ! థూ! థూ!
తుక్కా కోతీ యెక్వ్యా మస్సి తక్వ్యా!
యెబ్బెబ్బె యెబ్బెబ్బె యేమీమతం!
బూడ్దెలో పొర్లేదీ గాడ్దేగదా
బూడ్దె పూస్కుంటావు రే బొమ్మన్,
గాడ్దెబొమ్మన్ నీకి నూకర్ హాల్గా!
యెబ్బెబ్బె యెబ్బెబ్బె యేమీమతం!

వెఱ్ఱి.—అరే శిష్యులు, నేను మీకు ఖాజీనిగదా. నాప్రశ్నలకు జవాబుచెప్పి మీమతం నిలుపుకొంటారా?

శిష్య.—నిలుపుకొంటాం.

వెఱ్ఱి.—నిలుపుకోకపోతే, నామతంలో కలిశిపోతారుగదా?

[శిష్యులు మొగాలు చూచుకొనుదురు.

వెఱ్ఱి.—కలిశిపోతామనండి [అని యిద్దఱను చెవులుపట్టుకొని యీడ్చుకొని పోవుచు] ఢిల్లిసుల్తాన్. ...

శిష్య.—కలిశిపోతాం, కలిశిపోతాం.

వెఱ్ఱి.—జంది మెందుకురా పనికొస్తుంది?

ప్రథ.—అది మాగాయత్రి.

వెఱ్ఱి.—మూర్ఖా, వీపుగోక్కోడానికిరా అది పనికొస్తుంది.

ద్వితీ.—ఆడవాళ్లకు దురద లేదా?

వెఱ్ఱి.—వాళ్లెవరంటేనె వాళ్లేనంటి, నీవుండేది నరకంది. నాతో వాదిస్తావ్రా? నేను ఖాజేని నీవు ఘాటివి. [అని కొట్టును.

శిష్యు.—లేదండి, లేదండి.

వెఱ్ఱి.—మీ మతంలో జుట్టెందుకు ?

ప్రథ.—నరక కూపంనుంచి స్వర్గానికి లేవనెత్తడానికి.

ద్వితీ.—మీ మతంలో గడ్డ మెందుకు ?

వెఱ్ఱి.—వంచేస్తాను నాతో వాదిస్తే జుట్టెందుకో నేను చెప్తాను విను; పట్టుకొని తన్నడానికి. [అని పట్టుకొని తన్నును.

తృతీ.—గడ్డమెందుకో నేనున్నూ చెప్తాను; పట్టుకొని ఊగడానికి.

[అని గడ్డము పట్టుకొని ఊఁగును. వెఱ్ఱివాఁడు ఆగ్రహముతో కొట్టఁబోవును తృతీయుఁడు తప్పించుకొని దాఁటును.

ద్వి. తృ.—చాలునురా మన శిష్యత్వము. ఎన్నఁడూ నాయనచేత అయ్యవారిచేతకూడా దెబ్బ లెరగము, ఈ వెఱ్ఱిముండాకొడుకుచేత తన్నుల గ్రహాచార మేమిరా? వీ డెవడో యినుముగాడు గాని మనిషి కాడు.

ప్రథ.—కాయసిద్ధి అయిన యోగీశ్వరుడురా, ఈయన దయచేత మనకున్నూ కాయసిద్ధి కావచ్చును.

ద్వితీ.—మనకు సధ్యా కాయశుద్ధి అవుతూవుంది.

చారులు.—అరే వీడికిచూడడం తమాషాగానేవుంది. వాడికోపంచూడు.

వెఱ్ఱి.—[మహాగ్రహముతో] వెఱ్ఱిముండాకొడుకా? ఎవడ్రా? నాకు శూన్యంపెడితే నేను యీలాగయినాను. నాకు వెఱ్ఱేమి? వీరడు రాగడు నాకు శూన్యంపెట్టినారు. వాళ్లకి నాశాపం చూడు. [అని పాడును. ద్రష్ట యొకఁడు మోర్సింగువాయించును.]

వీరడికి రాగడికి నాశమంగళం,

నాశమంగళం గ్ళ్యం నాశమంగళం బ్ళ్యం. వీర.

గ్ళ్యంబ్ళ్యంగ్ళ్యబ్ళ్యం గ్ళ్యంబ్ళ్యంగ్ళ్యంబ్ళ్యం గ్ళ్యంబ్ళ్యంగ్ళ్యంబ్ళ్యం గ్ళ్యంబ్ళ్యం
గ్ళ్యంబ్ళ్యం గ్ళ్యంబ్ళ్యంగ్ళ్యంబ్ళ్యం గ్ళ్యంబ్ళ్యంగ్ళ్యంబ్ళ్యం నాశమంగళమ్. వీర.

వెఱ్ఱివాణ్ణి నన్ను పట్టి వెక్కి వెక్కి నవ్వినట్టి వీర.
తొఱ్ఱివాణ్ణి నన్ను మొట్టి తోశితోశి నవ్వినట్టి వీర.
బొఱ్ఱవాణ్ణి నన్ను నెట్టి బొంకి బొంకి నవ్వినట్టి వీర.
కుఱ్ఱవాణ్ణి నన్ను కొట్టి కూశి కూశి నవ్వినట్టి వీర.

నాకు వెఱ్ఱేమిటి? వెఱ్ఱంటే చెప్పట్టుకొండతా.
వడ్లపూడివారి సంస్థానం వల్లకాడై పోయింది.
భోగవసంతరాయుడి సంస్థానం బొగ్గులై పోయింది.
బందిరెడ్డివారి భాగ్యం బగ్గయి పోయింది.
కోనేటిపల్లివారి పటాటోపం గోదావరిలో గలిశింది.
మహామహావాళ్లంతా మట్టి గొట్టుకపోయినారు;
ఈరాగడు ఈవీరడూనా యీ తేరేబాళ్లు?
నాకు శూన్యం పెట్టినవాళ్లు నాశమై పోతారు.
తోడుబోతు పెట్టినవాళ్లు తుడుచుక పోతారు
శాతపాడి చేసినవాళ్లుసర్వనాశ మాతారు.
నేను ఆదివారము నాడు అందళ మెక్కనూ లేదు,
సోమవారంనాడు జోలె కట్టనూ లేదు.
నూదిగా వచ్చి దబ్బనమై తేలడం యెరగవా ?
ఆరటి తడ పని పాశేస్తే మిణ్ణాగై కరవడం యెరగవా ?

నాకు వెఱ్ఱేమిటి? వెఱ్ఱివాడికి మాట లొస్తాయా? నాకు పిల్ల నిస్తే పెళ్లి చేసుకో లేనా? [చంకలు గ్రుద్దుకొనుచు దుముకుచు]హిహిహిహిహిహిహిహి. ఆడవాళ్లోయి ఆడవాళ్ళోయి! పెళ్ళోయి పెళ్ళోయి! పెళ్లామోయి పెళ్లామోయి.దుముకు,ఎగురు.[నోటికడ చేయి పెట్టుకొని]విను నాపెళ్లి సన్నాయి. కీకీకీకీ చూడు నాడోలు. [తొడ తాళము వాయించుచు] డాండాండాండాం, [తృతీయశిష్యుని ఉగ్రముగాఁజూచి] నీకళ్లుచూస్తే నీమనస్సులో నాకువెఱ్ఱనే వుంది. నిన్ను చంపేస్తా. ఢిల్లీసుల్తాణ్ ...[అని వానిని తఱుముకొనిపోవును

[ఖుస్రూఖాన్ ఇదారిని పోవును.

చారులు.—[చూచి] అదే ఖుస్రూఖాన్ బహద్దర్! తెలింగిదేశం నుంచి వచ్చినాడు. అదే షేక్‌ఖాన్ యింటికి కాబోలు పోతాడు.

[ఖుస్రూ నిలిచి వెఱ్ఱివానిని నిదానించి కని వెడలిపోవును.

వెఱ్ఱి.—[తృతీయశిష్యుని చెవిపట్టి లాగి తెచ్చి] ఇక పారిపోవుగదా? ఇక పారిపోవుగదా? [అని చెవి నులిమినట్లు అభినయించుచు] రహస్యం చెప్తా. [అని చెవిలో] నాయనా, ఈఖుస్రూగానితో పోయి వృత్తాంతముగని వచ్చి చెప్పుము. [అని చెవి కఱచి, ప్రకాశము] ఇక నిన్ను నాశిష్యులలో చేర్చను పో. నాకిక్కడ అగపడితే చంపేస్తా.

తృతీ.—[కీ అని యేడ్చుచు] మా అమ్మా నాయనా చేసుకొన్న పుణ్యం. దొంగ వెధవ! రహస్య మని వంక పెట్టి చెవి కరిచేశాడు. [ఆత్మగతము] హా! ఏమి మానాయన జాగరూకత! ఏమిప్రతిభ! అహా! రాజుకై ఎట్టికష్టములకు పాల్పడుచున్నాఁడు! [అని పాఱిపోవును.

వెఱ్ఱి.—నాశక్తి యీనాగమ్మకు తెలుసునా? నేను బారువ మిరపకాయలు మంగలంలో వేయించి దంచినా దగ్గను. ఒళ్లంతా గొంగళీపురుగుల అంగీ తొడిగినా గోక్కోను. గాడిదకంటే ఓండ్ర పెడతాను, గడ్డి మేయను. గుఱ్ఱానికంటే పరిగెడతాను, గూటాలు పెరకను.

ప్రథ.—[ద్వితీయునితో జనాంతికము] ఇదంతా కాయసిద్ధికి ఫలం.

వెఱ్ఱి.—[ప్రథముని జుట్టుపట్టుకొని] ఢిల్లీసుల్తాన్...

[ప్రథముఁడు తప్పించుకోక ఊరకుండును. వెఱ్ఱివాడు వదలును.

వెఱ్ఱి.—నాకేమి ఉత్తపిచ్చనుకొన్నావా? జ్ఞానపిచ్చి, నాకు శూన్యం పెట్టినతర్వాత ఆడదాన్నో మొగవాణ్ణో మరిచిపోయినాను. ఉపదేశం చేస్తాను పట్టు. పోనీ, నాచిత్తం వచ్చేటట్టు పాడితే నీకు వెయిన్నినూటపదహార్లూ దుశ్శాలువలూ యిస్తాను.

ప్రథ.—[జనాంతికము ద్వితీయునితో] ఈయన యోగి, బంగారం చేస్తాడని నేను చెప్పలేదా? ఈయన చంపినా యీయన్ని వదలను.

శాస్త్రి.—[ఆత్మగతము] అబ్బాయి ఇంకను రాలేదు. కరము వ్యాపృతుఁడై యుండఁబోలును. కానీ, నాప్రతిభముండఁగ ఇతరుల నీతిప్రయోగము ఏపాటిదో? వర్ణించెద లోఁగుట్టెఱుంగనివారు కవులను దూషించితి నని తలంతురుగాక. [ప్రకాశము] పూర్వజన్మంలో నేను కవీశ్వరుణ్ణి, అప్పుడు నా కవిత్వాన్ని నేనే వర్ణించాను. పాడండి.

[గురుశిష్యులు యథాపూర్వముగా ఖండఖండోపజేకముగా పునరుక్తిపూర్ణముగా సనృత్యముగా పాడుదురు. ఒకద్రష్ట హార్మోనింగ్ వాయించును.

మొద్దుమొద్దాకవుల
బొద్దుబుఱ్ఱలమీద
బొద్దుబొఱ్ఱలమీద
గుద్దు నా ముద్దుపాట
గుద్దు నా ముద్దుమాట.

జబ్బుజబ్బాకవుల
గబ్బుపాటలమీద
గబ్బుమాటలమీద
దెబ్బ నా లిబ్బిపాట
దెబ్బ నా లిబ్బిమాట.

పుచ్చుపుచ్చాకవుల
చచ్చుపాటలమీద
చచ్చుమాటలమీద
చిచ్చు నా మెచ్చుపాట
చిచ్చు నా మెచ్చుమాట.

టప్పుటప్పాకవుల
కప్పపాటలమీద
కప్పమాటలమీద

దేశ్యం నా యొక్కపాట

దేశ్యం నా యొక్కమాట.

కేతకీ తాకవ్రుల

తేతపా టలమీద

తేతమా టలమీద

వాత నా జాతిపాట

వాత నా జాతిమాట,

కూలికూ ఁకవుల

బోలుపా టలమీద

బోలుమా టలమీద

డోలు నా మేలుపాట

డోలు నా మేలుమాట.

మడ్డిమ డ్డీకవుల

రొడ్డుపా టలమీద

రొడ్డుమా టలమీద

సొడ్డు నా లడ్డుపాట

సొడ్డు నా లడ్డుమాట.

శిష్యులు.—స్వామీ, యిది ముగియుడ మెప్పటికి ?

వెఱ్ఱి.—ఇది అనంతం, మనము బతికుండగా ముగియదు.

ద్వితీ.—నాకు చాలును స్వామీ; దుశ్శాలువ, ౧౧౧౹ర్లు, ఇప్పించండి.

వెఱ్ఱి.—ఇస్తానురా. [అని జుట్టు పట్టుకొని పరుగున ఈడ్చుకొనిపోవుచు] ఢిల్లీసుల్తాన్ ...

ద్వితీ.—[జుట్టు వదలించుకొని] బహుమతి స్వామీ, దుశ్శాలువ.

వెఱ్ఱి.—మూర్ఖా, దుః అని సరిగా ఉచ్చరించు, దుః, దుః, దుః, అను.

[అని జుట్టుపట్టుకొని వానితలను కుదిలించును.

ద్వితీ.—దుః, దుః, దుః.

వెఱ్ఱి.—అవిసర్గని వేరే ఉచ్చరించు, మూడుమాట్లు.

ద్వితీ.—విసర్గను వేరే ఉచ్చరించడ మెరగను స్వామీ.

వెఱ్ఱి.—ఎవఁడ్రా నీకు చదువు చెప్పినవాఁడు? నీకు దుశ్శాలువలో మట్టే.

ప్రథ.—ఉహ్, ఉహ్, ఉహ్.

వెఱ్ఱి.—వాఁడు విసర్గ నుచ్చరించినాఁడు చూచినావా? వాఁడూ నా శిష్యుఁడంటే, వానికి దుశ్శాలువ, ౧౧౧౬ఋర్లు. నీకు పూర్ణానుస్వారమే. [అని వానిని వదలి ప్రథముని జుట్టుపట్టుకొని ఈడ్చుకొని పోవుచు] ఢిల్లీ సుల్తాన్...[వానిని వదలి అగపడినవారికెల్ల] స్వామీ, దండం; స్వామీ, దండం. [అని దండాలు పెట్టును. వారు వానిని చూతురు.

వెఱ్ఱి.—ఈనరమానవుల కందరికీ నామీదనే కన్ను.

[అని అవలికి పోవును.

ద్వితీ.—శాలువ స్వామీ. [అని వెంబడించును.

[illegible].—[పిలిల ప్రకేశించి] రండిరా, మీకోసంవచ్చాను. ఎంతసేపు ఈదొమ్మరాట? వస్తారా రారా?

వెఱ్ఱి.—[తటాలున వానిగొంతు పట్టుకొని] నాపాటకు బదులుపాట చెప్పకుంటే చంపేస్తా.

తృతీ.—స్వామీ, చెప్తా స్వామీ చెప్తా. మీకు తగినదే నాకున్న ఒకటివచ్చును! చెప్పకోండి మరి. [వెఱ్ఱివాఁడు గొంతు వదలును.

తృతీ.—[జనాంతికము] రండిరా ఓరి పాపాత్ములారా, రండి, పారిపోదాం.

ప్ర. ద్వి.—[జనాంతికము] రవుంతుండరా. శాలువా, ౧౧౧౬ఋర్లూ పుచ్చుకొని వస్తాం.

తృతీ.—[జనాంతికము] నాకుకూడా వంతు. [ప్రకాశము] చెప్పకోండి స్వామీ. చెప్పకోండి.

[ఛందోపదేశముగా శిష్యుఁడు చెప్పి గురువు చెప్పకొనును.

¹తాటికాయ నీటికాడ నాటిసారయా,
²తాటిబొంద నీటిలోన మీటిసారయా.

కోపగించు తాటికాయ, కొంపమాపు తాటికాయ.
మాటలాడు తాటికాయ, పంతమాడు తాటికాయ, తాటి.
³రాయి కట్టి రప్ప కట్టి, రాయిబొంగు రాతి గొట్టి, తాటి.
⁴తాటికాయ నక్క యింక, ⁵తాటిబొంద చేప యింక, తాటి.
⁶నల్లకోటి నల్లసామి చెల్లె అల్ల చూచుచుండ, తాటి.

వెట్టి.— భేష్! శభాష్! బళీ! దివ్యం! అద్భుతం! ఆశ్చర్యం! వహ్వా! యేమిపాటరా! ఏమిపాటరా! నీకు ౧౧౧జన్ల సంశ్యాలువ. అయిపోయిందా ఇంకా వుందా?

తృతీ.— ఐంది, బహుమాన మియ్యండి.

[అని ఇతరశిష్యులను వెనుకకు ద్రోచి తాను వెట్టివాని దగ్గఱ ముందు నిలుచును. ఆశిష్యులు ద్రోసినవాని ముందుకు వచ్చి నిలుతురు.

వెట్టి.— [రాయి యొకటియెత్తి తృతీయునితల పగులఁగొట్టఁబోవుచు] బాగుందంటే, అయిపోయిందంటావూ?

తృతీ.— [ఆచేయి పట్టుకొన యత్నించుచు భీతిసూచకముతో] లేదు, లేదు, ఉంది, చెప్పుకోండి, వద్దండి, చెప్పుకోండి.

వెట్టి.— [రాయి క్రిందవేసి] మరిచెప్పు. [శిష్యులును గురువును యథాపూర్వము.

తాటిబొంద నీటిలోన మీటిసారయా,
తాటికాయ నీటికాడ నాటిసారయా.

కొండ లెక్క తాటిబొంద, కోటలెక్క తాటిబొంద,
గోడ లెక్క తాటిబొంద, కొంపలెక్క తాటిబొంద, తాటి.

---

1. ఖుస్రూతలకాయ. 2. ఖుస్రూ మొండెము. 3. రాయి రప్ప కట్టుట మొండెము నీట తేలకుండుటకు. 4. ఆతలను నక్క భక్షించును. 5. మొండెమును చేపలు తినును. 6. యమున.

రాయి నట్టి రప్ప గట్టి, గాబొంకు రాత గొట్టి, తాటి.
తాటికాయ నక్క యింక, తాటిబొంద చేప యింక, తాటి.
వల్లకాటి నల్లసామి చెల్లె లల్ల చూచుచుండ, తాటి.

తృతీ.—దుశ్శాలువ, ౧౧౧౫ర్లు.

వెట్టి.— నాపాట యింకొకటి చెప్పుకొంటే యిస్తా.

ప్ర. ద్వి.— చెప్పుకొంటాం.

తృతీ.—[ఆత్రతో] మీకు కూడా వెట్టి పట్టిందట్రా? రా రేమిరా?

వెట్టి.—ఏమిరా, చెప్పుకొంటావా, దుశ్శాలుస్సు పోగొట్టుకొంటావా?

తృతీ.—చెప్పండి గురోజీ. [గురుశిష్యులు యథాపూర్వము.

తాటికాయ గోతినుండి తవ్వి వేయరా,
తాటిబొంద నీటినుండి దాటి యెత్తరా.
తాటికాయ నక్క గాదు, తాటిబొంద చేప గాదు,
తాడు లేక నట్ట రాదు, తగులగొట్ట కుండరాదు, తాటి.
రాయి విప్పి రప్ప విప్పి, *రాచనక్క రాత గుప్పి, తాటి.
తాటిబొంద తాటికాయ, తాచికట్ట దయ్య మాను, తాటి.
వల్లకాటి నల్లసామి చెల్లెలల్ల తూగుచుండ, — తాటి.
తాటిబొంద మారుమూల నాటివేయరా,
తాటికాయ బొందలోటి తాచి కొట్టరా.
తాటికాయ యెండకుండ, తాటిబొంద చివకకుండ,
తాటికట్టు తెలియకుండ, తప్పు గిప్పు దొరకకుండ, తాటి.
రాయి విప్పి రప్ప విప్పి రాచ నక్క రాతఁ గప్పి, తాటి.
తాటిబొంద తాటికాయ [1]తాచి కట్ట [2]దయ్య మాను, తాటి.
వల్ల కాటి నల్లసామి చెల్లెలల్ల తూగు చుండ, తాటి.

---

* పోలీసు జవానులకు లంచము లిచ్చి.

1. తలను మొండెమును కలియ మేకుబంది చేసి, 2. పిమ్మట సమయము వచ్చినప్పుడు ఖుస్రూదయ్యముగా నుపయోగింపవలసినది, అని గూఢోపదేశము.

వెఱ్ఱి.—చాలునా? [అని తన గోనెసంచిలోనుండి రవంత పీచు పీకి తృతీయునికిచ్చి] *దీన్ని చెకుముకికి తగిలించి యినుముతో కొట్టు, ఎంతనిప్పు పుడుతుందో చూడు, ౧౧౧౯ ఇళ్లు కాల్చేస్తుందో లేదో, లెక్క పెట్టుకో. ఇదుగో నీకు దుశ్శాలువ. [అని తన గోనెచొక్కా తీయును.

ప్రథ.—స్వామీ, నాకో? [ఇతరులం జూచి] యోగంచేత యీ గోనెలో కల్పించుంటాడురా శాలువ.

ద్వితీ.—స్వామీ, నాకో? [ఇతరశిష్యులం జూచి] అవునురా.

వెఱ్ఱి.—[గోనెచొక్కా తీసి తృతీయుని మొగాన వేసి] పుచ్చుకో. [అని] ఢిల్లీసుల్తాన్ ... [అనుచు తిరుగును.

తృతీ.—ఇందండ్రా పుచ్చుకోండి. [అని రెండుగా చింపి వారి మొగాన వేయును.

ప్ర. ద్వి.—ఏమిరా నీపొగరు? [అని వాని నతికోపముతో చూతురు.

తృతీ.—దుశ్శాలువ అంటే, రెండుశాలువలు. మీావంతు తలా ఒకటి! [పీచుముక్క చూపుచు] ఇవిగో, ౧౧౧౯ ర్లు, ఇవి నావంతు. [ద్వితీయునితో] ఒరే, ఆవేదాంతాన్ని ఇక్కడ అఘోరిస్తూవుండనీ, నీవైనా వస్తావా లేదా?

ద్వితీ.—అందరం వెద్దాం.

[ద్రష్ట యొకఁడు గోనెచొక్కా వెఱ్ఱివానికి తొడుగును.

వెఱ్ఱి.—నాకింకా వేయిపాటలు వచ్చును, అవన్నీ సరిగా పాడితే, వెయ్యిన్నికోటిపదవోర్లున్ను సహస్రశాలువలున్ను యిస్తా.

ద్వి. తృ.—మాకక్కరలేదు. [అని పారిపోఁ జూతురు.

వెఱ్ఱి.—[ఆయిరువురను జుట్టుపట్టి] చెప్పుకోండి. [గురుశిష్యులు యథాపూర్వము.

---

* ఖుస్రూదేహమును తలను కాపాడు మనునాజ్ఞను చెకుముకిశాస్త్రికి తెలుపును.

ఉ. అండజభీను డండ డడడండ డడండడ డండడండ, డం
డండ డడండడండ డడడండ డడండడ డండడండ డం

... ... ... ... ...

శిష్యులు.—[కొంత చెప్పి] గురోజీ, ఇది ముగియడ మెప్పటికి?
వెఱ్ఱి.—మీరు చస్తే అప్పటికి.
ద్వి. తృ.—అయితే, యిదుగో చచ్చినాము.
[అని చచ్చినట్లు అభినయించుచు కూలుదురు. వెఱ్ఱి వాఁడు జుట్టు వదలును. వారు పారిపోవుదురు.
వెఱ్ఱి.—ఒరే, దాని అర్థము. [అని తఱుమును.
ద్వి. తృ.— మా కక్కరలేదు. [అని పారిపోవుదురు.
వెఱ్ఱి.—ఎందుకురా వాళ్లను పోనిచ్చావు? చంపేస్తా నిన్ను.
[అని ప్రథముని ఎత్తిపాఱవేయును.
ప్రథ.—గురోజీ, మళ్లీ వచ్చి మీ సేవ చేసుకొంటాను. నన్ను కడతేర్చవలెను. [అని కుంటుచు పాఱిపోవును.
ద్రష్టలు.—చాలుర వీడితమాషా, వీడివల్ల బాగా పనిచెడ్డాం యీ వేళ.
[అని నిష్క్రమింతురు.
వెఱ్ఱి.—ఇంకాక నేనే చెప్పుకొంటా. [అని సతాళనృత్యముగా చెప్పును.

* హరిహరీ నారాయణ ణాదినా రాయణో,
కరుణించ వోయమ్మ కమలలోశనుడా. కమలలోశనుడా,
దుంప లడి గీతేని దురబాస లాడేవు,
నిన్ను నక్కలు గరవ నిరయాల గురవా. నిరయాలగురవా.
బళిబళీ! మీతాత బల్లెంబు శేపట్టి,
పుల్లాకు తూటుగా పొడిచేసి నాడోయ్. పొడిచేసినాడోయ్.
యాదవుడి గోవులూ మాదవుడు గాయగా,
మాదవుడు మచ్చావతారమై నాడోయ్. తారమైనాడోయ్.

యెద్దుచ్చు పొయ్యాంగ యేసలై పారంగ,
వుంకించి వుంకించి దాటేశి నాడోయ్. దాటేశినాడోయ్.
[వీరావేశముతో] ఢిల్లీసుల్తాన్ ...

చార.—ఈ అద్మీకి యిప్పట్కీ ఖానా నహీ. మనం ఏక్ దో రెండుతూళ్లు తిన్నాం. మూడో తూరికి పోకలి వుంది. వీడు యేలాగ బతుకుతాడు!

ఒకతల్లి.—ఒరే, అబ్బీ, అన్నంపెడుతాను పట్టు. [అని పెట్టును.

[వెఱ్ఱివాఁడు పరుగున పోయి గోనెలో గ్రహించి ఒక కుక్కను దో, దో, దో, అని పిలిచి, దానికి వేయును.

ద్వితీయ చారుఁడు.—అరే వీడూ తింటాడూ తలచినాను. వీడు పక్కా సైతాన్ వున్నాడు.

ప్రథమ చారుఁడు.— భాయి, వీడు కుళ్లం చెడుతుందికోసం ఖానా తినలేదు వాలావుంది. వీడు బామ్మన్ తోస్తుందీ నాకీ.

ద్వితీ.—వీడితోటి మనం వూరంతా తిరిగినాం హస్థమానం ఐంది. ఇంకొ మనకీ పోయాసం వుంది.

ప్రథ.—అరే వీడూ వల్లకాడ్కి పోతాడు. అక్కడ నిప్పు గిప్పు పెట్టి ఖానాగీనా చేస్కుంటాడూ సూడావాలా.

[వెఱ్ఱివాఁడు ముఖమునకు మన్ను పూసికొనును.

ద్వితీ.—వీడూ ముఖం చేస్కుంటాడు, సూడు.

ప్రథ.—అరేవీడూ జమునాకిపోతాడు. బామ్మన్ నమాజ్ చేస్తాడూ. చూడవాలా.

స్థలము. 3. యమునకడ శ్మశానము.

వెఱ్ఱి.—ఢిల్లీసుల్తాన్...[అనుచు పరిక్రమించుచు] నేను కాకినో మనిషినో జ్ఞాపకంరాలేదు. ఎగిరి చూస్తా. [అని యెగిరి] బ్రాహ్మణ్ణో మనిషినో జ్ఞాపకం రాలేదు. ఎవరివో మాటలు వినబడుతూవున్నవి. ఆవెధవలే, అయి

ద్దజే, వీరడు, రాగడు, నాభూమి లాక్కొన్నారు, నాపెళ్లాన్ని దాచేశారు. ఏనూరుసంవత్సరాలు నన్ను కట్టేశారు. నాచేత రెండువేళ పచ్చివంకాయలు తినిపించారు, నాకంఠానికి ఉరి బిగించారు, అయిదేళ్లు కుట్టిసైతాన్ను నామీదకి పంపారు. అని నాకేలుకేలు కిరవడం. ఈముసళ్లు నాకుపారా యేమిటి? కదిలితే యివి నాకాళ్లుపట్టుకోవడ మేమిటి? నాకేమి సాష్టాంగం పడుతున్నవా? ఎన్ని యేనుగులు! ఎంతసింహం! ఎంతపులి! ఇవి నామీద పడితే నేను అంతర్ధాన మౌతా. వీటిమీదికి జాగిలాలను యిసుకొలుపుతా. ఇసుకో! ఇసుకో! ఇసుకో! నేను కుక్కను గానని నాకు తెలియద మేలాగో? మొరక్కపోతే కుక్కనుగానా? మొరగ లేదని దాఖలా యేమిటి? అదుగో యమున, నీళ్లు నల పంటారు, ఒకరికంటికి నలుపైతే ఒకరికంటికి తెలుపెందుచేత కాగూడదు? నేను నాతోటి వాదిస్తాను. నేను బతికున్నానా చచ్చిపోతినా! ఇదేలోకం? మనువ్యలోకమా, యమలోకమా? ఇదే చావు, చావే బతుకు. ఏల గారాదు? నాకు సర్వమూ సందేహమే. బళి ఒళీ! యమున! ఎంతనీరు! ఎంత నీరు! ఈనీళ్లన్నీ పుక్కిలించుమేస్తా [అని పలుమారు పుక్కిలించి యుమిసి] నన్ను కత్తితో పొడిచేస్తే ప్రాణం యేదారిని పోతుంది? నాకంటికి కనుపడుతుందా? లావా సన్నమా? హా! యెవరు మీరు? ఓహో రాగడిచేతను వీరడిచేతను మోసపోయిన వారా? ఏడవకండి, నేను ఢిల్లీసుల్తాన్ను పట్టుకొనిపోయి రాగణ్ణి వీరణ్ణి తొక్కించేస్తా, దంపించేస్తా, పచ్చడిచేయిస్తా, ఢిల్లీసుల్తాన్... కోతికి తోకుంటే గోదావరీత్తుందా? వంటచేసి మీకన్నంపెడతాను. ఏడవ కండి. ఈకుండపెంకు సమయానికి దొరికింది. [అని కుండపెంకు చేతంగొని నీళ్లలో ముంచుట నభినయించి] ఈనీళ్లు చాలు. ఢిల్లీసుల్తాన్...[అనుచు పరిక్రమించును.

చారులు.— మన్మ వాడు వచ్చేతల్కి యీచెట్లెక్కి దఖల్ లేకుండా వుందాం. వాడికి బాగా చూడవచ్చును. [అని అట్లే చేయుదురు.

వెఱ్ఱి.—[కుండపెంకులో ఎసరు పెట్టి, రాలతో ప్రొయ్యి చేసి, ఎసరెక్కించి] ఈకొష్ఠంలోది యీకోరివి, యీకొష్ఠంలోదియీకోరివి. [అని ఒకటి

రెండు చితలనుండి కొఱవులు తెచ్చి ప్రొయ్యిం బెట్టి మంట చేసి, ప్రొయ్యి కడ కూర్చుండి] ఢిల్లీసుల్తాన్... ఇదేమి! యీపెయ్యలు నన్ను చుట్టుకొన్నవి! నేను వండుకొంటూవున్న యీరవంత అన్నము వీటికి గావాలట. [ఒకవైపు చూచి] ఓయి వెంగళప్పా. ఎప్పుడు చచ్చినావో మరచి నన్నడుగతా వేమి? నీప్రాణం పోయినప్పుడే నీవు చచ్చినావు. పొండి మీరంతా. మీతస్సా గొయ్యా! పోరుగా? ఉండండి మిమ్మల్ని ఉచ్చాటనచేస్తా. ఢిల్లీసుల్తానును పిలిపించి మిమ్మల్ని గోరీలో పెట్టిస్తా. [అని ఎసటిలో బియ్యముపోసి] ఢిల్లీసుల్తాన్...

ద్వితీ.—భాయి, వాడు ఖానాకి మన్నుపోసి వండు తాడు నూడు.

ప్రథ.—మన్ను కాదు, బియ్యము.

పెత్తి.—వీరడికి రాగడికి...[ఒకకొఱవి చేతఁగొని] ఈవల్లకాటికి నేను చక్రవర్తిని. చూడండి చక్రం తిప్పుతాను. [అని బాణా త్రిప్పిత్రిప్పి కూర్చుండి.

* ఆవులింత సూచించి,

[ఆత్మగతము] ఏసౌఖ్య మెఱుఁగని నాకు ఆవులింత యేమి? ఎటుప్రక్కను నరుఁ డెవఁడు నాకంటి కగపడఁడు. ఈచెట్లమీఁద దాఁగి చారు లెవరో నన్ను పరికించుచున్నారు. కానీ, వారికంట మిరియపుంబొడుము చల్లెదను. [ప్రకాశము] వింతలేని యావలింతవుండదు. గుడగుడశబ్దం కుండకు నష్టం. [అని బాణాకొరవితో కుండ పగులఁగొట్టి, ఆ పెంకులు మెదుకులు చితల మీఁద చల్లి] ఢిల్లీసుల్తాన్...[అని అఱచుచు తరలును.

చారులు.—అల్లా అల్లా అల్లా! అరే వీడు దివానా నిశ్చయం. [అని దుమికి] మన మెందుకు వీడితో సావడం? పోదాం రారా.

---

*ఇంకొకరు దగ్గఱలేక ఆవులింత రాదు గావున, ఆవులింతవలన సమీపమున నెవరో ఉన్నారని యుగంధరుఁడు కనిపట్టినాఁ డని యెఱుంగవలయు.

ప్రథ. - ఖానాకద్దు. వాడు దివానా కాకపోతే, నీవ్వా నేనూ దివానా? భాయి నేను రేపు యీలిమామ్ సుల్తాన్ వారిదర్బారులో యింకా పట్నం అంతా చెప్తాన్.

ద్వితీ.— నేను మా హైసీను మహారాజాకి చెప్తాన్, అయన్ని పక్కాటు తప్పించి ఆనఖ్యా మొఖం చూస్తే నాకీ కోటివరహాల్ యినాంగా వుంటుంది.

చాకలి.—[పోవుచు హేళనముగా] అరే దివానాసాబ్, సలాం నీకీ.

వెఱ్ఱి.— హాహా! తురకదయ్యాలుకూడా నావెంటబడడమేనా? బేతాళుణ్ణయి గుండె పగలదంతా [అని చెవి యొక తన్ను తన్ని] మీయబ్బసైతానుతో చెప్పుకోండి.

ప్రథ.—అరే, నాడొక్కా పగిలింది, నేను కదలలేకున్నానుభాయ్.

ద్వితీ.—అః బాబూ, నాతుంటీ విరిగిందీ. నేను మెదలకున్నాను. క్యాకర్నా? మళ్లీ వాము తన్నకముందే పోదాంరా.

[ఇరువురు నిష్క్రమింతురు.

వెఱ్ఱి.—[ఆత్మగతము] దివానా యొకఁడో, మూడుమాసాలకు తెలియును లెండి ముండలారా! [ప్రకాశము] నేను మాత్రము మేలుకోవడ మేమి? ఈ పట్ణమంతా నిద్రపోవడ మేమి? నేనేమి వీళ్లకి కాత్వాలునా? ఒక ప్రాణినైనా నిద్ర పోనియ్యను. ఇదుగో వూళ్ళో ప్రవేశిస్తున్నాను. ఢిల్లీ సుల్తాన్ ... [అని నిష్క్రమించును.

---

# అష్టమాంకము.

స్థలము 1. ఢిల్లీ, కోటలో సుల్తాన దర్బార్.

సుల్తాన, పలువురు వజీర్లును, సేనాపతులును, ఉపవిష్టులై ప్రవేశింతురు. యథావిభవము పరివారము కృపాణపాణి.

సుల్తాన.—వలీఖాన బహద్దర్, నీవు మాకి యీరోజ్ నిశ్చా చెప్తావు. ఆ తెలంగి దివానా మాకి యీరోజు పకడ్లేవు చెప్తాడు. వాడు దివానా మనకీ నిశ్చయ ఐందికదా. తర్వాత మల్లీ యేమైనా దర్యాప్తు చేసినావా?

వలీ.—రోజ్ రోజ్ దర్యాప్తు చేస్తూనే వున్నాను, బందగానెఆలీ. వాడు అలాగే పట్టుకపోతాన అరుస్తూ తిరుగుతాడు. అప్పుడే హుజూర్ శెలవు చెయ్యలేదా, 'మనమూ మేల్కొంటే వాడూ దివానా, వాడూ మేల్కొంటే మనమూ దివానా!' అని.

సు.—అచ్ఛా! అచ్ఛా! నీకీ బలే జ్ఞాపకం వక్తి వుంది.

వలీ.—యిది వుత్త అద్ధం పెంకు, హుజూర్ తేజంలోదివక్షిగీత [తన హృదయము చూపుచు] యిక్డ పడి తళుకుతూవుంది.

సు.—[పరితోషముతో] అచ్ఛా! అచ్ఛా!

ఒకవజీర్.—హుజూర్ బుద్ధి సూర్యుడూకి ముందర హమారే బుద్ధిలు నచ్ఛత్రంవుంది జగత్ప్రభూ.

సు.—[పరితోషముతో] అచ్ఛా! అచ్ఛా!

వలీ.—[ఆత్మగతము] వీడూ నాకీకంటే తుతీచెయ్యవాలా చూస్తాడు. నేను వీడికి వీగిపోతే ముసల్మానీ నహీ. [ప్రకాశము] బందగానే ఆలి రెండో అల్లా.

ఆవజీర్.—[ఆత్మగతము] అరే వీడు మనకి మించడం చూస్తాడు! వీడికి మించక పోతే హం ముసల్మానీ నహీ, [ప్రకాశము] నహీ నహీ నహీ, సుల్తాన వారు మొదట్ అల్లా, అల్లా రెండూ అల్లా.

సుల్తాను.— వజీర్,—అది యేలాగ విషదం చెయ్యండి వజీర్ భాయి.

ఆసతీర్.—

సుల్తాన్వారూ యిప్డిస్తారూ, హల్లా రేపిస్తాడ్;
సుల్తాన్వారూ యిప్డుకొట్టార్, హల్లా రేపు కొట్టాడ్;
సుల్తాన్వారూ హాగ్పడ్తారూ, హల్లా హాగ్పడడు;
సుల్తాన్వారూ యిన్పడ్తారూ, హల్లా యిన్పడడు;
సుల్తాన్వారూ హతా నిష్మయ, హల్లా పంధేఘుమ్.
హందుకోసము మేమూ చెప్తాం, హందర్ విన్కోండి,
సుల్తాన్వారూ మొదలూ హల్లా, హల్లా రెం డల్లా?

[సుల్తాను పరమానందభరితుండుగా అందఱను చూచును.

అందఱు.—అచ్ఛా! అచ్ఛా!

సు.—వలీసాహేబ్, నీవు తెలంగీ రాజాకి తెచ్చినావు సంతోషం. యీపారి ఖట్కా వోంద్రం రాజాకీ తెస్తావా?

వలీ.—హుజూర్ కటాక్షం వుంటే, యిప్పుడు తెస్తాన్.

సు.—మాగులాం ఖుస్రూ తెలంగీ దేషంలడాయిలో మర్గయా కావడం మాకి చాలా హయూషం వుంది.

వలీ.—[కణఃకుచు] అల్లా చేసిందానికీ యేమీ చేస్తాం.

ప్రతీహారి:—[ప్రవేశించి] తఫావద్ బాఅదబ్. బడా బడా—బకాల్ చాలాదూరం కోస్తానుంచి దర్శనానికి వచ్చివున్నారు.

సు.—బడాబడా బకాల్ యేలాగా తెల్సింది?

ప్రతీ.—యింతగొప్ప నజరానా ఇంతకి కితం ఎంతా బడా అద్మి యెంత బడా సుల్తాన్వారికి కూడా తెచ్చినాడు నహి.

సు.—సెలవు.

ప్రతీ.—హుజూర్ ఆజ్ఞ. [అని పోయి వర్తకులం గొనివచ్చి] వారే సుల్తాన్ వారు, మొకాత్మే నిల్చి సలాం కరో. [అని నిష్క్రమించును.

[వర్తకులు ఖుర్నీషుసలాము చేయుచు, మోకాళ్లమీఁదనే దగ్గఱకు పోయి సలాములతో నజరుపళ్లెము నుంచెదరు. ఒకజవాను దానిని సుల్తానుముందఱ పెట్టును.

సు.— [చూచి యాశ్చర్యపడుచు] ఏమి యీ యద్భుతము! మా చూపుకి ఖైద్ చేస్తున్నవి. ఇట్వంటివాట్కి అల్లా చెయ్యగలడా? కన్నూకి మైకం వస్తుంది! హాబ్బా! హాబ్బా! [అని కన్నులు మూసికొని, తెఱచి తల యెత్తి, కని] కూర్చోండి వర్తకుల్లూ, కూర్చోండి. [వర్తకులు కూర్చుందురు.

సు.—[పళ్లెమునుండి ఒక మరకతమయూరమును ఎత్తి] చూడండి వజీర్సాహేబులు చూడండి. ఇదేమి అంతా పక్షి పచ్చ చెక్కినారా? పచ్చాంతరం, పచ్చకి పచ్చా టూక్బందీ చేసినారా? వా! యిది కోడిపుంజూ అంతా వుంది!

వర్త.—జగత్ప్రభువుసన్నిధానములో మానజరులను మేమే ఎట్లు వర్ణింతుము?

సు.— పర్వా లేదు బడావర్తకులూ, మాకీ సులభంగా మాలుం కావడానికి చెప్పండి.

వర్త.—జగత్ప్రభువువారి యాస్థానములో వజీర్సాహేబు లున్నారు, సాహుకార్సాహేబు లున్నారు, సౌదాగర్సాహేబు లున్నారు. మానోట చెప్పించుట కటాక్షము కాదు.

సు.—వలీఖాన్ బహద్దర్, నీవు చెప్పగలవా? [అని నెమలిని చేతికిచ్చును.

వలీ.—[పుచ్చుకొని చూచి] బందగానే ఆలీ, ఇది పక్షి మణి.

సు.—[మరలఁగొని] అన్నివరణమ్లు వున్నవి. హాత్కూలు అగ్పడవు! ఆ! ఆ! హాత్కూలు వుందిదానికి హాత్కూలు లేదూ చూపి మాకి మోసంచేస్తారూ వర్తకులూ?

వర్త.—[ఆత్మగతము] ఏమి పఠాణీవానియుక్తి! కోమటిబిడ్డల మని యెఱుఁగఁడు గాఁబోలు. [ప్రకాశము] ఇన్ని సంస్థానములు మేము తిరుగు

చున్నాము, మోసములు చేసిన మాకు వ్యాపారము జరుగునా? మిమ్ము వెదకుకొని సన్నాజామడ వచ్చి నజరుంచిన మోసమా?

సు.—[నవ్వి] మోసం అంటే మేము చమత్కారం తల్చినాం వర్తకులూ, మీరు దానికి వేరే తల్చినారు. మనం స్నేహితులు అయినాం మీకు చెప్పండి. మా వజీరుసాహేబుమాట సరియేనా?

వర్త.—చెప్పకున్న తమకు కోపము వచ్చును. వజీర్లవారిమాట సరియే. ఇవంతయును ఒకటే రాయి. దానిని ఇట్లు చెక్కినారు, ఆయావర్ణములను ఆయా మణులు తాపించినారు. దీనిని తయ్యారుచేయుటకు పది సంవత్సరములు పట్టినవి.

సు.—బలే బలే! వర్తకులూ, దాని కుంచెంతోకా విప్పి నాచిరంగ్ నృత్యం చేశేలాగ చేసినాడు, మీపనీవాలా బలే జాణా, అల్లా వన్నె మెరుగు పెట్టినాడు. [దానిని వజీర్ల కందించి దేదీప్యమానమైన యొక తెల్లనివస్తువు నెత్తి] ఇదేమి వర్తకులూ, మధ్యాహ్న సూర్యదూపాకారంవుంది. మాకంటి చూపు కన్నారు మీరు కోటికిరణం బాకుల్ వచ్చి నహీనహీ చేస్తుంది! స్నేహంలో సంకోచం వుంచేది మీకు? టూకీ చెప్పండి సంతోషిస్తాం. ఇది వజ్రం మాకీ తోస్తుంది. యిప్పుడే పెద్దసంపరపనసపండు అంత వుంది: నగ్షికి ముందు ఎంత వుంటుందో!

వర్త.—జగత్ప్రభువునాజ్ఞ. ప్రభుచేతిలోనిది, ఒకటే వజ్రము. మొదట ఇది పెద్ద కొబ్బెరబొండ్లమువంత యుండినది. సుంద్ర పరిచి లెక్కలేనియాకిరణములు చేయుటకు ఇరువది సంవత్సరములు పట్టినవి. దీని విశేషము—దీనికిరణములను ఏయుపాయమునను లెక్కించి యున్నాయని యెవ్వరును చెప్పలేరు. దీనిని అమావాస్యచీకటిలో దూరమున ఉంచి చూచిన, పట్టపగలు అవును.

సు.—[దానిని వజీరుల కందించి మరియొకటి గొని] ఇది అద్దం అద్భుతం వుంది! దీని స్వరూపం యేమి స్నేహితులు?

వర్త.—ఇది వజ్రపుబిళ్ల, పదియేండ్ల పని.

సు.—[దానిని వజీర్ల కందించి] ఇంక వక్టి వుంది, తామరఖమల్పద్మం. దీని సంగతి యేమి ?

వర్త.—ఇది ఒకటే పద్మరాగము. మొదట జేసెడు ఘనము. దాని నిట్లు చిత్రించి, గద్దియు, పుష్పాడి, యితరమణులతో చేర్చినారు. పదియేను సంవత్సరముల పని.

సు.—మరి వర్తకులూ, స్నేహితులు, వీటికి ఖరీదు ఎంతెంత వుంటుంది, చెప్పండి కోర్తాము.

వర్త.—భూలోక దేవేంద్రా, మన్నింపవలయును. మానవజరునకు ఖరీదు మానోటరాదు.

సు.—మీనోటా ర్యాదూ నిశ్చయం ?

వర్త.—రాదు నిశ్చయము.

సు.—స్నేహం చూచినారు లేదు.

వర్త.—చూడకపోయిన, అప్పుడే చెప్పియుందుము.

సు.—వజీర్సాహేబులు, మీకీ యీలోఖం ఖమాయిష్ అంతా తెల్సును. వీటికి ఖిమ్మత్ చెప్పండి. మనకీ వర్తకులూ ఇంతగౌరవం చేసినారు తెల్వవాలా కదా.

వజీర్లు.—బందగానే ఆలీ, యిట్వంటీవాటికీ ఖరీదులు మాకీ తెల్వడం జూటా. తల్కాయకి తెల్వదూ, కాలిగోరూకీ తెలుస్తుంది ?

అవజీరు.—తల్కాయాకి తెల్వదు, యెడంకాలీ యెంట్రికాకీ తెలుస్తుంది?

సు.—మఱి మన సాహుకార్లు ఎవరూ చెప్పలేరా ?

వజీర్లు.—చెప్పలేరు తోస్తుంది మాకి. ఇది యీలాగా, మన సౌదాగర్ల గొప్ప సర్కులు హుజార్ కొంటారు. అందుకు తక్వాసర్కులు గులాములు కొంటాం. యిట్వంటివి మనవర్తకులు మనకీ యెప్డూ చూపడంలేదు; అదీ కారణం వాళ్లకన్నూకి యివితగలలేదు; అదీకారణం అమ్మలేదూ, వారికి వీటి ఖరీదు తెల్వదు; కొనలేదు మనకీ తెల్వదు.

అకబీరు.—తమసన్నిధిలో దర్బార్లో వుంటాం మాకి తెల్వదు. దూరం వుంటారు షాహుకార్లకి తెల్వనే తెల్వదు. మరీదూరం పోతారు సౌదాగర్లు, వారికి తెల్వనే తెల్వనే తెల్వదు. యెక్కడా తెల్వంది సర్కార్ దర్బార్లో తెల్వవాలా. యిక్డా తెల్వంది యీభూలోకంలో మరియెక్డా తెల్వదు.

సు.—[జనాంతికము వకీలుతో] ప్లీడర్నోటనే టక్కు చేశి చెప్పిస్తాగా చూడు. [ప్రకాశము] మంచిది వర్తకులూ, మీరు వచ్చినపనికి చెప్పండి.

వర్త.—ఒకపని. జగత్ప్రభువువారికి పూర్ణ గౌరవముగా వజీర్సాహెబులందఱును నజర్ స్వీకారము చేసెదము. సెలవు దయచేయవలయును.

సు.—మనవజీర్లకి కూడా గౌరవం చేస్తే మనకీ బడే గౌరవంకదా అవశ్యం చెయ్యండి, మనమూ చూస్తాం, చాలా సంతోషం. [ఆత్మగతము] అది కూడా అంతా మాకే చేస్తే ఇంతకంటే బడే ఫసందు వుంటుంది.

[వర్తకులు వజీర్లకు నజరిత్తురు. వజీర్లు పుచ్చుకొని త్రిప్పి త్రిప్పి చూచి చూచి, ఆశ్చర్యపడుదురు.

సు.—[ఆత్మగతము] వీళ్లు చేశే మర్యాదా చూస్తే వీళ్లనోటా మోషంగా చెప్పించడం కష్టం ఉంది. [ప్రకాశము] మంచిది, స్నేహితులూ, మీరు వచ్చినపని జల్దీ చెప్పినార్, చేసినార్. రెండూపని యేమి?

వర్త.—మేము ఓడలలో ఇట్టివిచిత్రవస్తువులను అనంతముగా తెచ్చియున్నాము. తమరు వానిని చిత్తగింతు రని విన్నపము.

సు.—మీరు యేదేశంనుండి వచ్చినార్?

వర్త.—మేము పడమటిసముద్రపురేవు గోవానుండి వచ్చినారము.

సు.—ఇంతదూరం మీరు సచ్చి మాకి చూపడానికి వచ్చినార్?

వర్త.—అందుకోసమే వచ్చినారము.

సు.—ఎన్ని వాడలు?

వర్త—నాల్గు ఓడలు.

సు.—మీకి దారీ యేది?

వర్త.—

క. గోదావరియును, సముద్రము,
రాజలింగమును, సాగరంబును, హుగ్లీ,
దేవనది, యమున, 1వైభవ
2శేవధి ఢిల్లీపురియు ద్రికసి ఛిందూరా. 1

సు.—మహమా మీ సరకులు కానకుంటే, ఈప్రయాణ మంతా మీకే నుక్సాన్ గదా?

వర్త.—జగత్ప్రభువునకు తెలియని దేమున్నది?

సు.—ఇంతవింతనజరానాతో యింత పెద్దసౌదాగర్లు అద్భుతం సరకులు తెస్తే అవి పుచ్చుకోకపోవడం మనకే నామోషీ కదా వజీర్ సాహేబువార్లు?

వజీ.—తప్పకుండా పుచ్చుకోవాలా.

కడమవజీర్లు.—సర్కార్ చెప్పినదే.

సు.—మరి వర్తకులూ, మీ సరుకులు తెప్పించండి, మేము మాకు కావలసి పుచ్చుకొంటాం.

వర్త.—ఇక్కడికి తెచ్చుట అసాధ్యము.

చ. బరువులు సాల్గునావలకుఁ బట్టవు యొంటెలు యన్ని కొత్తలే;
తిరముగ వీని నూ రెగుమతింపఁగ నయ్యెను రెండు మాసముల్;
ఉరుకృప మీర తెల్ల కలవోడలకు స్వజనాంబు సేసి, మా
సరకులు చిత్తగింపు కని చాలఁగ వేఁడెద మో జగత్ప్రభూ. 2

సు.—ఏమి వజీర్సాహేబులు మీ యభిప్రాయం?

ఆవజీర్లు.—నజరువస్తువులే యింత అద్భుతం వున్నవే, సరుకులు మరీ అద్భుతం వుందునూ, అవశ్యంపోయి చూడడం సరి అభిప్రాయం?

కడమవజీరులు.—అచ్ఛా! అచ్ఛా!

సు.—అయితే వర్తకులూ మీరు ఈవస్తువులకి ఖరీదులు చెప్తే మనము మీవాడలకి వస్తాం, సరుకులు పుచ్చుకొంటాం.

1. 1. ఐశ్వర్య, 2. నిధి.

వర్త.—[స్వగతము] ఆహాహా ఏమి యీతనియుక్తి? [ప్రకాశము] మేము శాశ్వతముగా మీకువర్తకులముగా నుండఁగోరుచు, మామాటమీఁదనే వెలలు పరిష్కరించుకొనుట వ్యాపారధర్మములో మాకు అపకీర్తికి కారణము, పిమ్మట సందేహముల కాస్పదము, కావున ఆసరకులకైనను వెలలు తీర్పుటకు తమకు ఆవిద్య తెలిసినవారు కావలయును. అందుకై యెవరిని రప్పింతురో వారివలననే యీ నజరువస్తువులకుఁ గూడ వెలలు తెలిసికొనుఁడు. ఏలినవారు విచారించి అట్టివారిని రప్పించిన ఉభయులకు తృప్తి యగును.

క. ఢిల్లీ ఢిల్లీ యనుచున్
ముల్లోకములందు 1డవిణ మ్రోగెడు నఁట! యా
ఢిల్లిలో వెలతీర్పరి
కల్ల యయిన నింక నెందుఁ గలుగు ధరిత్రిన్! 3

సు.—[ఆత్మగతము] అరే! వీళ్లు నావల్ల మోసంపోరు. మరి యేమి చేస్తాం? [ప్రకాశము] వర్తకులూ, మీరు ఇంతకుముందు మాసంస్థానానికి యెప్పుడైనా వచ్చినారా? అప్పుడు ఖరీదులు ఏలాగ నిశ్చయించుకొన్నారు?

వర్త.—ఇంతకు పూర్వము నేము ఈసంస్థానమునకు రాలేదు.

సు.—మేము తప్పితే యీదేశంలో మీసరుకులు ఎవరు కొంటారు?

వర్త.— (స్రగ్ధర.)
ఏ రేకోస్త్రావి తేనిం, డెటులు తెలియనిం, డెంత 1మూల్యంబుగానిం,
డోరంగోల్వాదుషావా రొకరె 2విలుతు రభ్యున్నతశ్రీసమృద్ధిన్.
వారి న్దర్శింపనే యీ3వరమణినజరుల్ వస్తువుల్ గూర్పనయ్యెన్;
వారున్న న్వేఱుచోట న్బదమిడుదుమె దైవంబుహా! యోర్వదాయెన్!

సు.—అంతధనం వుందా వారికి?

---

3. 1. చర్మవాద్యవిశేషము.

4. ఏరు ఏకోస్త్రావి తేనిండు = ఎవరు ఏకోస్త్రాసరకులు తెచ్చినను, 1. వెల, 2. కొనుదురు, 3. మేలురత్నముల కానుకలు.

వర్త.—అర్థ మేమి?

సు.—వారికి ఖరీదులు ఎవరు తీర్చడం?

వర్త.—వారే అందఱికు తీర్తురు. ఆవిద్యలో వారు మహానిపుణులు. వారు చేసినవెలలకు మేము జవాబులు చెప్పుటలేదు.

సు.—మరియిప్పుడు మీరు ఈ దేశసంస్థానానికి రావడానికి వా...

వర్త.—మాదురదృష్టముచేత, ఆమహారాజు తమసర్కా... జా వారికి నిఘా... ములో స్వర్గస్థులైనారని మాయడితిదారులు మాకు... మంతట ఆదే కింవదంతి. అంతట మేము వంశపరంపరగా మానలేక యిటకు తమదర్శనమునకు వచ్చితిమి.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాన్, మనవేగులు మర్గయా చెప్తారు, వీళ్లుకూడా మర్గయా చెప్తారు, మనం అతనికి ఖైదులో వుంచినాం?

వలీ.—[జనాంతికము] అబడాలడాయిలో రాజా ఏకాకి... దూరి చంపిచంపి మనచేతులో పడ్డాడు, మరి అతనివాళ్లకి అగ్పడలేదు వాళ్లు చచ్చినాడు తలచినారు.

సు.—[జనాంతికము] మరి యితనిగతి వాళ్లు విచారించుకోలేదా?

వలీ.—[జనాంతికము] ఎవడిప్రాణం వాడు విచారించుకొని పారిపోయినాడు, మరి మంత్రులు, ఫౌజుదార్లు, రాజా వున్నాడు తెల్సుకుంటే, రాజాకి విడిపించుకోవాలి; అసాధ్యం పని. రణములో తాము చావడం. రాజా చచ్చిపోయినాడు చెప్తే రాజ్యం తాము హరించవచ్చును. అందుచేత రాజా చచ్చిపోయినాడుపుఖార్ వాళ్లు కొంచెం వున్నది, కొండంత చేసినారు వుంటుంది.

సు.—[ఆత్మగతము] అచ్ఛా అచ్ఛా! [ప్రకాశము] వర్తకులూ, రాజా మర్గయా అయితే, యిప్పుడు సంస్థానానికి మీసర్కారులు యొగం ధర్మంత్రి కొనరాదా!

వర్త.—వారన్న మాట లోపమేమి? వారు రామేశ్వరములో మరిడీజాడ్యము వలన స్వర్గస్థులైనారని మాయడితిదార్లు వ్రాసినారు. • లోకమంతయు నదే కింవదంతి.

వలీ.—[జనాంతికము] మనవేగులు కూడా ఆలాగే చెప్పినారుగదా!

తమకు వారివలన విచారించి అటిపి

సు.—[స్వగతము] అచ్ఛా! అచ్ఛా! [ప్రకాశము వర్తకులతో] ...లా స్నేహం పరిచయం వుంటుందా?

...న్నగా ఇరువదిసంవత్సరముల క్రిందట వారిని స్వయ

క. ఢిల్లీ ఢిల్లీ...కొన్నారు. అప్పుడు...లు, మాయడితిదారులే వారితో ...ము జరుపుచుండిరి. ... ఇప్పుడు లపకటాక్షము మాయందు

ఢిల్లీ ఇచట గొప్పసాహుకారు లెవరినైన తమసంస్థానముకోసము

క. ...చుకొని పోయెదము.

సు.—[జనాంతికము] వజీర్సాహేబులు, మనము పెర్తాపరాజాకి

చేస్తాం? ...కి తెప్పించి ఖరీదులు చెప్పింతామా?

యొ

వజీర్లు.—అదే సర్కారుకు చెప్పవాలా వుంటాం.

వలీ.—[ఆత్మగతము] చాకలి వెల యేలాగా వేస్తాడు? రాజా కాడు మహాల్వాలా తెలిస్తే నాతలకీ వస్తుంది. ఈవర్తకులు రాజాకి తెలుసుకొంటారు భయంల చెప్పడానికి లేరు. సుల్తాను తెప్పించక మానడు, నాగతి గాభరావుంది [చింతించి] అయినా యేమి భయం? యమధర్మరాజుసహాయం వుంది.

సు.—[జనాంతికము] ఏమి వలీఖాను బహద్దర్, నీమనస్ తెల్పలేదు?

వలీ—[వణకుచు విలక్షుండై] రప్పించవచ్చును నాసమస్.

సు.—[జనాంతికము] వజీరాలీ, నీవు పోయి ఆతెలంగిరాజాఖైదీకి మనవాడు సౌదాగర్ వేషంవేసి తీస్కొనిరా. [నవ్వుచు] ఆయనదాడీ యీఅరుచుదుట్టి మనకీ యిప్పుడు పనికీ వస్తుంది.

వజీ.—సర్కార్ ఆజ్ఞ. [అని నిష్క్రమించును.

సు.—మంచిది గోవావర్తకులూ. మారాజ్యంలో మీసరుకులకీ ఖిమ్మత్

చెప్పేవారు లేరు మీరు తల్చుకస్తే. మీమాటమీద యిప్పుడు రాచేస్తాం. మరి వారి నిఘా ఖరారు అవునో కావో మీకే యేలాగ దాఖలా?

వర్తి.—ఈనజరువస్తువులను వారు చేయుపనులను బట్టి తెలిసికోఁగలము.

సు.—వారు చాలా గొప్పవారు. మనమంతా వారికి తాజీం చెయ్యవాలా. వారు వఖ్తాలు మాకీ కొంచెప్పు మారుకోట్లు వరహాలు అప్పుయిచ్చి మళ్లీ మేముయెంత బతిమాలినా పుచ్చుకోన్నారు లేరు. అందుకు వారికీ మాకీ భాయిభాయి స్నేహం మర్యాద, చూడండి మీ పెర్తాపరాజాకీ వారికి నిఘా తైఫార్.

వర్తి.—జగత్ప్రభువు చిత్తము.

అంతట ప్రతాపరుద్రమహారాజు తురకసౌదాగరు వేషమున వజీరాలితో ప్రవేశించును.

[సభ అంతయు లేచును.

సు.—[రాజు చేయి పట్టుకొని] సలాం సలాం. ఇక్డ ఇక్డ భాయి.

[అని తనప్రక్కను కూర్చుండఁబెట్టును. రాజు సముకాలమందే సలాము చెప్పి కూర్చుండును.

సు.—సౌదాగర్ సాహెబ్, మీకి శ్రమ యిచ్చినాం. కారణం యీసౌదాగర్లు. వీరు యీనజరు తెచ్చినార్. ఖరీదులు చెప్పము అంటార్. తమరు వీటికి ఖరీదుచెప్పి మనపస్సునిల్పవాలా. యిందుచేత తమ దర్శణం అయింది సంతోషంగదా.

రాజు.—[ఆవస్తువులను పరీక్షించునట్లుగాఁ జూచుచు, ఆత్మగతము] ఆహా యుగంధరులవారి మహిమ! ఈవస్తువులు నాయంతిపురములోనివే,వీరు నావర్తకులే. మాకు ఈదినమే ప్రయాణముహూర్తము. [ప్రకాశము] భోత్ అచ్ఛా.వీరివల్ల తమ దర్శణం లాభం. యీకారణంగా వీరికీమాస్నేహం వుంది. మరియిప్పుడు వీరికీ మేము పరీచ్ఛాచేస్తాం. వీరు మాకీ పరీచ్ఛాచేస్తారు. ఒకరిఖరార్ ఒకరికి తెలుస్తుంది ఛణంలో.

[సుల్తాను రాజుచేతికి నెమలి నందించును.

రాజు.—[నెమలిని త్రిప్పి త్రిప్పి చూచి, లెక్కలు చేసికొనుట నభినయించి] సుల్తానుభాయి ఈ నెమిలి ఖుమార్ రెండుకోట్లు, యీ ఖైలత్లల్ వరహాల్. కోట్లు పచ్చ ఖరీదు, యిరువైయైదు లక్షలు తలిమ్మా రాళ్లు, యిరువైయైదు లక్షలు కూలి. ఏమి చెప్తారు సౌదాగర్లు?

వర్త.—[ఆశ్చర్యముతో] అన్నిటికి చెప్పి కొనిండు.

రాజు.—అదీ కాదు, సరియైతే పైన చెప్తాం, లేకపోతే యెందుక్కు చెప్టం?

వలీ.—[ఆత్మగతము] క్యారే, ఇతడు ఆరునెల్లు బందీవున్నా ధేధిప్యమానం వున్నాడు, మంచి తెల్వితో మాట్లాడుతాడు, మహాల్జి కాదుతోస్తుంది. [విమర్శముతో] లేక, మంత్రి యుగంధర్ అట్వంటి తెల్వికల చాకలికి మంపాదించి వుండునా మాకీ మోసం చెయ్యడానికి?

వర్త.—తమరు చెప్పినది సరి కాకుండునా? మాకొక యాశ్చర్యము కలుగు చున్నది. మనవి చేసెదము, అన్నిటికి సెలవిండు.

రాజు.—మంచిది. ఈ వజ్రంపహార్యడు [లెక్కనభినయించి] యిరువైయైదుకోట్లు, పని సహా. ఈ హద్దం [మరల లెక్కనభినయించి] పదియైదుకోట్లు. ఈ తామ్ర ఖమలం పదికోట్లు, అంతా పని సహా. ఏమి మీ వాశ్చర్యం?

వర్త.—జగత్ప్రభూ, మీరు సాక్షాత్ప్రతాపరుద్రులవారే! స్వర్గస్థులగుట అబద్ధము!

సు.—[సవిస్మయము, ఆత్మగతము] క్యారే! కనిపెట్టివేశినార్!

వలీ.—[ఆశ్చర్యముతో] ఖుస్రూ, జోస్యులుభాయి, చాకలీ చెప్తారు? వీళ్లు రాజా చెప్తారు? క్యారే ఇది!

వర్త.—వీరిదేహములో పరకాయప్రవేశము చేసినారని మాకుతోచు చున్నది. మంత్రియుగంధరులవారికి ఆట్టిశక్తులు కల వని మేము వినియున్నాము. ఈ వెలలు ఆమహారాజే వేసినా రని చెప్పవచ్చును.

వలీ.—[హర్షముతో ఆత్మగతము] బలే బలే వాళ్లమాట అది కాదు! మాకీ యమధర్మరాజువహాయం నిజం నిజం.

సు.—[ఆత్మగతము] వాళ్లు వట్టీ చెప్తే మేము మరి వట్టీ తెలుసుకొన్నాం. [ప్రకాశము] ఖరీదులు అంత సరిగా వున్నవా.

వర్త.—ఉన్నవి.

సు.—వీరిఖరారా ప్రకారము తిర్గు లేక వప్పుకుంటారా?

వర్త.—ఒప్పుకొనియెదము.

వలీ.—[ఆత్మగతము] బలే! యమధర్మరాజు వహాయం! బలే! యమధర్మరాజు వహాయం!

సు.—ఒప్పుకోకపోతే?

వర్త.—మమ్మందఱను శిరశ్ఛేదము చేయింపుఁడు.

సు.—ఇదే వరత్? నిశ్చయం?

వర్త.—ఇదే వరత్, నిశ్చయము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [జనాంతికము] మహారాజాభాయి, వీళ్ల సరుకులు అన్నిటికి జున్నవమానం ఖరీదులు కొయ్యండి. మేము వరత్ప్రకారం పుచ్చుకొంటాం. ఒప్పుకోకపోతే శిరస్ఛేధం పుచ్చుకొంటాం. మీకి యీాష్టేవానికి వోరంగోల్కు వదిలిజేస్తాం. మరి తమరు బందిఖానాకి రాఖద్దు. జవాబు చెప్పండి భాయి.

రాజు.—[ఆత్మగతము] ఎంత నిర్భాగ్యుఁడు వీఁడు! అన్నకుమారుని శిశువునుచంపి రాజ్యము హరించినవానికి ఈచింతయెంతపాటి! [జనాంతికము] సుల్తాన్ భాయికి జవాబ్ పదిమాటలు యెందుకు? మరి యిక్కడికి రాం.

సు.—అచ్ఛాఅచ్ఛా! మరైతే వర్తకులూ, ఈ దివాణం దివాణంగానే మీవాడలకి వస్తాం, లెండి.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

[అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[పరివారముతో] షికారీకి సర్వం సిద్ధమా?

పరి.—బందగానె అలీ, మీకీ అంబర్కి ఏనుగులు హౌదాలు వేసి తయ్యార్ వున్నవి. సిబ్బందికి గోడాలు జీన్ వేసి సిద్ధం వున్నవి. ఛత్రం సిద్ధం.

సు.—భోత్ అచ్ఛా! శాహజాద్లు మాహౌదాలో అలంకరించి మాకంటికి విందుగా మాకూడా సవారికి రెండి.

[పరివారము తెమ్మను. అంతలు పరిక్రమింతురు.

స్థలము 2. ఢిల్లీలో వీథి.

[నేపథ్యమున]

ఢిల్లీ సుల్తాన్ పట్టుకపోతాన్,
ఇదుగో ఇప్పుడే పట్టుకపోతాన్,

[మరల మరల అట్లే?

సు.—[ఆశ్చర్యపడుచు] అరే! ఎవడ్రా మాకీ పకడ్లేవు అరుస్తాడు. చెవికి తెలుస్తుంది?

వజీర్లు.—బందగానె అలీ, వాడే అదివానా తెలంగి.

సు.—దేమి చూడవాలా, దేమి చూడవాలా.

అంతట వెఱ్ఱివాఁడు ప్రవేశించును.

వెఱ్ఱి.—[తటాలున దారికడ్డము వచ్చి సుల్తానుముందఱ ఆడంబరముగా దుముకుచు] ఢిల్లీ సుల్తాన్... [ఉత్తవేళ్లు నోటిముపీల్చుచు] ఢిల్లీ సుల్తాన్... [చుట్టకాల్చుట నభినయించుచు] ఢిల్లీ సుల్తాన్...[హుక్కాత్రాగుటను వెక్కిరించుచు] ల్లీ సుల్తాన్...[అనుచు సుల్తానువారి యేనుఁగుముందఱ నిర్భయముగా నిలుచును.

పరి.—దారి కడ్డం లేరా, అరే దివానా. [అని ఆవలికి త్రోయుదురు.

వెఱ్ఱి.—నేను కదలను, ఏమి చేస్తావు?

పరి.—కదలలేకపోతే బుర్రా యెగ్రా యేస్తాం.

వెఱ్ఱి.—అహో సుల్తాన్, నిన్ను నేను మాయింటికి తీసుకొనిపోతూ.

వుంటే వీళ్లు నన్ను అడ్డుతున్నారు. వీళ్లను పిల్చుకో, లేదా, నేను వీళ్లను చంపివేస్తాను.

సు.—ఎదీ చంపూ చూస్తాం?

వెట్టి.—చంపూ చూస్తాం ఏమిటి? చంపూ యేడుస్తాం, అను. [అని పరిజనులను ఒక్కొక్కని] ఆటలో అగపడు. [అనుచు ఒక్క తాపు తన్నుచు, ఒక్కొక్కనింగాంచి] అబ్బో! నీ వెంతవాడవు! చావుముందు బతికే వున్నావు, నీకు శక్తుంటే నన్ను పురం వెయ్యవూ! నీవు చస్తే మరి బతకవు.

[జవానులు తాపున కొకడు పడి, లేచి, కత్తు లుంకించి, సుల్తాను వైపు చూతురు.

సు.—క్యారే ఏమి పడిపోయినార్?

పరి.—సర్కార్, వాడికి సింహంవుంది వంట్లో, వాడు సైతాన్! మన్సి కాడు.

సు.—వాడికీ ఏమీ చెయ్యకండి, ఆ ముందర తమాషాలు చేస్తూ రానియ్యండి. వాడి కేమైనా చేస్తే మీతల్కాయా పోతుంది.

[అందఱు పరిక్రమింతురు.

వెట్టి.—[పరిజనులను పాటగా] ఏమి రోయి, మన్సి, మన్సి, మన్సి, కత్తి వుంకించావే, ఏమి చేశావు? తాకు, ఎవరిబుర్ర యెగురుతుందో? ఢిల్లీ సుల్తాను ...

పరి.—సర్కార్ హుకుం అయ్యేదాకా నీబుర్ర టగురుతుంది. తర్వాత యెగురుతుంది. [అని జవానులు వెట్టివానిని అత్యుగ్రముగా చూతురు.

వెట్టి.—నా బంగారుసుల్తాను, నీవు మావూరికి వచ్చి, నాకు శూన్యం పెట్టిన రాగణ్ణి వీరణ్ణి ఎక్కి తొక్కి నొక్కి ముక్కి రక్కి డొక్క చెక్కి చక్కాడవలిశింది. ఇది మా ప్రార్థన, మనవి, వేడుకోలు, గంగడోలు, గడోలు, డోలు, లు. ఊ. [అని నానావిధముల వికారములు చేయును.

సు.—అహో దరికి చేరినాం! పడవలు కనిపెట్టుకొని వున్నవి, యెక్కుదాం.

స్థలము 3. యమున, పడవలు.

[అందఱు అవహాసాలాపణములు నటింతురు. సుల్తాను, రాజు, వలీ, పెద్దసెట్టియు ఒకపడవనే యెక్కుదురు.

వెట్టి.—నీళ్లు దొరకనవి, నేను బాపనాట ఆడతా.

[అని బ్రాహ్మణుల వెక్కిరించుటగా సంధ్యవార్చును. వెట్టి. ఏపడవకుఁ బోయినను అందలివారు రానీరు.

వెట్టి.—[ఒకపడవచుక్కానిని పట్టి యీడిగఁబడి] ఓసుల్తాను, వీళ్లు నన్ను రానీయరు, హా! [అని అఱచును.

సు.—[పడవవాండ్రతో] వాడికీ మాపడ్వలోనే యెక్కించండి.

[పడవవాండ్రు అట్లే చేయుదురు.

వెట్టి.—తోసినవెధవలే బుద్ధిమంతులు. ఎక్కించుకొన్నగుండులకే బుద్ధిలేదు, నాకు సెసరు లేదంటే చెప్పట్టుకొండతా. నామట్టుకు నేను పాడుకొంటూ, వద్దన్న వాళ్లని ఏట్లోకి తోస్తా.

ఢిల్లీ సుల్తాన్ పట్టుక పోతాఁ,
ఇదుగో ఇప్ప్వాడే పట్టుకపోతాఁ.
1 వీరణ్ణి రాగణ్ణి మన్ను చేయిస్తాఁ,
ఇదుగో యిప్పుడే మన్ను చేయిస్తాఁ.
గోతిలో పాతించి గోరీ కట్టిస్తాఁ,
ఇదుగో ఇప్ప్వాడే గోరీ కట్టిస్తాఁ.
2 గుల్లోను కొబ్బరి కాయల్ కొట్టిస్తాఁ,
ఇదుగో ఇప్పుడే కాయల్ కొట్టిస్తాఁ.

సు, తప్ప కడమవారు.—ఓయి, అల్లరి చేయకు.

సు.—చెయ్యనియ్యండి. మాకి తమాషా వుంది.

---

1. వలీఖాను లోనగువారిని, 2. ఓడలో తలకాయ తీయించెదను.

వెఱ్ఱి.—అల్లరి చేస్తారా? ఇప్పుడేమి చేస్తారా?

[అని తెడ్డుసెట్టిని పటపటలాడ కొట్టును.

[ఇతరులు చూస్తూనుండ, వెఱ్ఱివాఁడు సెట్టిని పరియాచేయును.

సు. పరిహాసముగా నవ్వును. సెట్టి నొప్పి నభినయించును.

వెఱ్ఱి.—*అల్లవా ఢిల్లహో యిల్లవా వల్లహో

కళ్లు లే నికబోది కడతేర లేదు.

ఒరే, తెడ్డుగాళ్లూ, పాడండి నావెంట, పాడకపోతే చంపేస్తా.

సు.—పాడండిరా.

వెఱ్ఱి.— అల్లవా ఢిల్లహో ...

తెడ్డు.— అల్లవా ఢిల్లహో ...

వెఱ్ఱి.— †కాలరుద్రునికంటె కాలాన లము లేద,

కాలరుద్రునికన్న కాల్చి వేసినదా?

తెడ్డు.— కాల ...

వెఱ్ఱి.— అల్లవా ...

తెడ్డు.— అల్లవా ...

వెఱ్ఱి.— ‡ పాలసం ద్రముపొట్ట బడబాన లము లేద,

పాలు పొంగించి పాపాలు చేసినదా?

తెడ్డు.— పాల ...

---

* అల్లవా—అక్కడి ప్రతాపరుద్రుఁడు ఇక్కడికి వచ్చినాఁడు, ఇక్కడి ఢిల్లీసుల్తాను అక్కడికి (ఓరుఁగంటికి) పోవుచున్నాఁడు. ఇది ప్రత్యక్షము యయినను మూఢులు ఎఱుంగ లేకున్నారు.

† కాల—ఢిల్లీకోటలో ఇంతకాలము ప్రతాపరుద్రుఁ డుండెనుగాని ఢిల్లీకోట కేమియు నపాయము చేయ లేదు.

పాల—‡ ఢిల్లీలో కొంతకాలము యుగంధరుఁడను నేనుంటిని, కాని, ఢిల్లీకి ఏమియు అపాయము చేయనైతిని.

వెఱ్ఱి.— అల్లా వా ...

తెడ్డు.— అల్లా వా ...

వెఱ్ఱి.— *ప్రళయకాలము రాగ వడి రెండొకటి గాగ
బ్రహ్మాండ భాండంబు భగ్న మౌన లేదా?

[పెద్దసెట్టియును తెడ్డువాండ్రును వడవడ వణఁకుదురు.

తెడ్డు.—[కేలుమోడ్చి] సామీ, మాకు బయమవుతావుంది, యిది మేము చెప్పలేమండీ.

వెఱ్ఱి.— చెప్పకపోతే చంపేస్తా.

సు.— వలీసాహేబ్, దేఖో సేట్‌జీ గాభరా. [అని నవ్వును.

వెఱ్ఱి.— ప్రళయ ...

పెద్దసెట్టి.— ఇదేమి! యీపీడ మాన్పింపుఁడు. నాకుఁగూడ— [అని యర్థోక్తిలో భయముతో వెఱ్ఱివానిని చూచి యూరకుండును.

రాజు.— ఏమి సౌదాగర్బాబు, ఈ త్తమాటకే భయపడతారూ?

వెఱ్ఱి.— శహాబ్బా! తురకవాడికి దేట్లో పడేస్తానని భయం! [అని పక పక నవ్వి] ఊఁ. ప్రళయ ...

తెడ్డు.— ఈయాలెవరిమొఖం సూశినామో! యేమి గ్యాచారమోరా!
ప్రళయ ... [వర్తకుఁడు వణఁకును.

వెఱ్ఱి.— అల్లావా ఢిల్లి ...

[వెఱ్ఱి. తెడ్డు. యథాపూర్వము.

†ఆకాశ మున తొఱ్ఱి యాకసము మింగగా
రాకాసు లకు దాని రాక తెలి సినదా? అల్లావా.

---

*ప్రళయ.— ఢిల్లిరాజ్యమునకు వినాశకాలము రాఁగా మేమిరుపుమును కలయఁగా ఢిల్లీరాజ్యమెల్ల రూపు మాసిపోవుచున్నది.

†ఆకా.— మహావిశాలమైన ఢిల్లీపురములో వెఱ్ఱివాఁడొకఁడు(నేను) ప్రవేశించి ఢిల్లీపురప్రభువును కొనిపోవుచున్నాను. ఈవజీర్లు నాచె ఋనేమేని కనఁ గలిగినారా?

* భూమిలో నుడి ప్రబ్బి యొక్కడే వెల్గొనె
అగ్గికం బను మింట నగ్గలిక పడగా, అల్లవా.
[తెప్పగాండ్రు వస్తకములను జంబరించి వచ్చుచున్నారు.

† గద్దెకె క్కెలుగాల, కడలిలో మారి గూల,
నిండోరు నకిలించెత నింగాల పింక, అల్లవా.

‡ గుండుకుం దెగిరించి గుండాన దోయించి
అదిరిపే టేయరా యముని కెచ్చరిక. అల్లవా.

ను. రాజా, వలీ,—[కని] అహో! వాడలు ఆ దీపాలచేత ఎంత అలంకారంగా వున్నవి?

వెఱ్ఱి.—అల్లడుగో ఆదీపములో వుంది నాభార్య, రాగడికూన్యంచేత అక్కడచేరింది, నన్ను రమ్మని సంజ్ఞ చేస్తూవుంది. పిట్టలాగ ఎగిరిపోయి కలుసుకొంటాను. [అని ఎగిరి బయటికి దుముకును. పడవవాండ్రు వెంటనే దూమికి తీసి మఱియొక పడవలో చేర్తురు.

వెఱ్ఱి.—నా పెళ్లాందగ్గిరికి నన్నెందుకురా పోనియ్యరు?
[అని వారిని గొట్టును.

పడవ.—పోనిస్తే సస్తావే యెఱ్ఱోడా!

---

* భూమిలో.—చెఱసాల తెఱవఁబడి ప్రతాపరుద్రుఁడు వెలువడి దేదీప్యమానుఁడై మహోన్నత వైభవముతో లేచి యుండఁగా.

† గద్ద.—సుల్తానుయొక్క నవాబులు వజీర్లు కూలుచుండఁగా, సుల్తానే యమునలో ఖయిది యగుచుండఁగా, తనకు ఈ ఢిల్లీ రాజ్యము వచ్చునని ఈ వలీఖానుఁడు త్రుళ్లుచుండుట చెకుముకి వర్తకులు లోనగువారికి వింతగా నున్నది.

‡ గుండు.—ఒక్కొక్కవజీరుతలను తెగనఱికి వానిదేహమును (రాయికట్టి) యమునలోవైచి, ఆవృత్తాంతము యుగంధరునికి (నాకు) తెలియుటకుఁగాను అదిరి వేటు వేయవలసినది.—అని వర్తకులకు ఆజ్ఞ.

వె.—చస్తే నా పెళ్లాం దగ్గిరికే వెళ్తాను. [అని కొట్టును.

పడవ.—అబ్బబ్బ! యేమి యీపముండాకొడుకురా, శండాలుడు!

[అంపటు ఓడ లెక్కుటను నటింతురు.

స్థలము 4 యమున, ఓడ, పైతట్టు.

వెట్టి.—[వడివడిగా ఆదీపమును బట్టి దాని ముద్దుగొని గడ్డము కాలి] బళీ బళీ నన్ను నీవు ముద్దుపెట్టుకొన్నావా? బతికున్నప్పుడు యెంతెంతో బతిమాలుకొంటేనే గాని ఆయనుగ్రహం చేయకపోతివి. పోనీ యిప్పటికైనా దయ కలిగెనా? మళ్లీ ఒకమాటు.

[అని గడ్డముకాల్చుకొని తుడుచుకొనుచు, ముద్దుపెట్టుకొనుటగా దీపమార్చి, ప్రమిద తెచ్చి, మాటిమాటికి ముద్దులుగొనుచు, దానితో రహస్యములు పలుకుచు, దాని రహస్యములు వినుచు, ఇతరవిధములను లాలనలు చేయుచు, ఉండును. వర్తకులు సురత్రాణప్రభృతులను కూర్చుండఁబెట్టుదురు. వేశ్యలు ఇద్దఱు సుల్తానునకు, ఇద్దఱు రాజునకు, వింజామరలు వేయుదురు. ఇరువురు తాళవృంతములఁ వీతురు.

వర్త.—[సుల్తానుతో] కొండంత దేవునికి కొండంత పత్రి తేఁగలమా? 'ఉడుతకు ఉడుతభక్తి.' జగత్ప్రభువారికి విశ్రామార్థము మంగళార్థమును కొంచెము నృత్యసేవ చేయించెదము.

వెట్టి.—వెట్టిముండాకొడుకులారా, నాకక్కరలేదా నృత్యసేవ? నాకో ఛత్రచామరాలు, విసనకఱ్ఱలు?

సు.—మంచిది, కానియ్యండి. మరి మాకి చేసేమర్యాద అంతా దివానా బహద్దరు వారికి కూడా చెయ్యండి.

[అంతట వెట్టివానిని ఛత్రచామరాదుల నుపాసింతురు. నటీమార్దంగికులు పలువురు ప్రవేశించి సవాద్యముగా ఆడుచు పాడుదురు.

సు.—వహవ్వా! వహవ్వా!

వెట్టి.—అవ్వవ్వా! అవ్వవ్వా! వాడు వహవ్వా అనడ మేమి?

[అందఱు నవ్వుదురు. శెట్టియు హా హా హా హా
అని నవ్వును. సుల్తాను నర్తకికి ఒకతూరి మిచ్చును.

శెట్టి.—[తనలోనె చూచుకొనియిచ్చుచు] అనీ నీళ్లలో మునిగిపోతుంది. నిప్పులో కాలిపోతుంది. ఇదిమునగదు, కాలదు, అందానికి దానబ్బాయిది.

[అని వికటముగానవ్వును.

సు.—వర్తకులూ, మాకు మేమి మాకొరక్యనిక్కొ చెప్పినాసుదికికమర్తబ్ చెప్పడానికి మాకీ ఖుషీ లేదు, మరి మేము వస్తువులు చూడడం అబ్ధమే.

వర్త.—ఈనరకులు చూచి కొనిండు.

సు.—ఏమి వీళ్లకి మాకి అమ్ముతారా?

వర్త.—అమ్మెదము.

సు.—వీళ్లేమి బానిసలా?

వర్త.—దంతపుబొమ్మలు జగత్ప్రభూ.

తురకలు.—ఆహాహా ఏమి హాశ్చర్యం! ఏమి హాశ్చర్యం!

[అని ముక్కు మీఁద వ్రేలుపెట్టుకొందురు.

శెట్టి.—ఏమివికారము! ఏమి వికారము. [అని ప్రమిదతో] ఒశే, ఈపిశాచాలు నీకు సంవా?

[సు. నటిని తాఁకి చూచును. శెట్టి. నటి రెండుచేతులు
పట్టి ఆడించి పొంగలు, దండెములు, వేయించును.

సు.—[ఆశ్చర్యపడుచు] ఇట్టి యద్భుతాలు ఇంకాయేపాటి వుండును?

వర్త.—మాజాబితా చదువుటకు ఒకపగ లెల్ల పట్టును.

సు.—[ఆత్మగతము] ఏలాగైనా వీటి నన్నిట్ని అట్టాయించవల్సిందే. [ప్రకాశము] ఏమి వలీసాహేబ్? మనము ఈరాత్రి యిక్కడే వుంటాం.

వలీ.—నాకీకూడా యీయద్భుతాలు చూడవాలా వుంది, సర్కారు మాయింటముందు చెప్పుకొన్న విందు చేయవాలా వుంది, ఈవేళ విందుకి అనుగ్రహంచేసి రేపు ఇవిచూడడానికి చిత్తం చెయ్యకూడదా, అని గులాం మన్వి.

సు.—పడేకలు పంపి ఆ విందు యిక్కడికే తెప్పించు.

కలి.—మహానుగ్రహం, మహానుగ్రహం.

వర్త.—స్నేహితులూ అని తమరే పిలిచినారు. అందఱు ఈరాత్రి మాయింటవిందు పుచ్చుకొని మమ్ము ధన్యులను జేయఁగోరెదము. సర్వముసిద్ధము. స్నేహములో సంకోచము కూడదని తమరే సెల విచ్చియున్నారు.

సు.—ఏం, వజీర్సాహెబులువారి యిష్టం?

వజీరు.—సర్కార్ యిష్టమే.

సు.—మంచిది వర్తకులూ.

వర్త.—మహాప్రసాదము! మహాప్రసాదము!

సు.—అలాగైతే త్వరగా వెళ్లి మనకి భోజనవిందు చేసి, తర్వాత మన కన్నులకీ చెవులకీ మళ్లీ యీవిందూ చేస్తాం, లెండి రండి. [అందఱు లేతురు.

రాజు.—[జనాంతికము] సుల్తాను గారూ, తమరు తెలియనిది గాదు గదా జాతిభేదము. నేను జాబిలాగా వర్తకులకు ముద్ర వెలలు చేసి, మొత్తము చేసి, త్వరలో మీపని యాకుసల్లు చేసెదను. పిమ్మట కొలువిలసినప్పుడు కలసికొని యెదను. వర్తకులను లరకించునప్పుడే తమకు ఎఱుకగ వచ్చును.

సు.—[జనాంతికము] ఆహా ఏమి దురదృష్టం మాకీ, మీరు లేకుండా ఖానాగోష్ఠి చెయ్యడం! యేమీ చేస్తాం! తమచిత్తం. [కలితో జనాంతికము] ఇది చాలా మంచిదే అయింది. [వర్తకులతో తురకలు నిష్క్రమింతురు.

వెఱ్ఱి.—నాకొక ఆటకిరాపుష్పకం జ్ఞాపకం వస్తూవుంది.

(మణికారగృహం.)

[1]క్షత్రియు [2]నారయణును గలసియుయున్న జగఁ గఱకఱి [3]రిపువుల నణఁగఁదరమే?
క్షత్రియు నారయణును గలపాక యున్నజగఁ గఱకఱి రిపువుల నణఁగఁ దరమా.
మొత్తముగ [4]హిమము మొనయుచునున్న జగ మదముగ [5]మధుపముఁ [6]బికము
పిలుచునే?

మొత్తముగ హిమము ముగిసిన వెన్క జగ మదముగ మధుపముఁ బికము పిలుచుఁ జో.

---

1. యుగంధరుఁడు. 2. ప్రతాపరుద్రుఁడు. 3. శత్రువులను. 4. తురకలు. 5. యుగంధరుని. 6. ప్రతాపరుద్రుఁడు.

'ఫుల్సా' అంటేగదా కనుక్కొన్నాను. ఓరి నాయనోయి, 'కనుక్కొన్నానోయ్!' అంటేగదా యిద్దర్నీ పట్టుకొని తన్నినాను. సెల పొడిస్తే సముద్రం పొంగకుండావుంటుందా? తెగ్గాలిస్తే యినుమైనా మెత్తబడకుంటుందా? సంగీతానికే చాపరాళ్లు కరుగుతా యట, మిడియెండకు మంచుగడ్డ కరగదా? నిద్రలో కాకినిగుడ్లగూబ కొడుతుంది. పట్టపగలు గుడ్లగూబను కాకి కొడుతుంది, నీళ్లలో మొసలి ఏనుగను పడుతుంది. నేలను మొసలిని కుక్కకరుస్తుంది. సమయంలేదా, స్థానంలేదా? వెధవలందఱు నామాటలు వెర్రిమాటలంటారు. నేనున్నూ కొంతసేపు మౌనం వహిస్తాను.

రాజు.—[ఆత్మగతము] విశ్రమించి పిమ్మటఁ గలసికొమ్మని గురువరునాజ్ఞ. అట్లే చేసెదను. [అని నిష్క్రమించును.

వెట్టి.—[ఆత్మగతము] అప్పుడే క్రిందికట్టున తురకలు వచ్చి వినోదించుచున్నారు. అచటికేపోయి ఢిల్లీనగరరాజునియొక్క వజీరుప్రాణముధుపములను బరణితెరచి నలిపివేసెదనుగాక. [అని పరిక్రమించును.

స్థలము. 5. ఆ యోడయే, లోతట్టు.

[అంతట పడవకడుపులో తురకలందఱు ఉచితాసనముల నుపవిష్టులై ప్రవేశింతురు. బొమ్మలు తాంబూలము లిచ్చి హుక్కాలు పెట్టును, వీచోపులు వేయును.

సు.—[కైపుతో] వర్తకులూ, వాడలు మీవి కొంటాం మేము. ఇంత అద్భుతం వాడలు, ఈదేశంలో చెయ్యలేరు. మేము సుల్తాన్ వున్నాం, నీటిమహల్ మే వున్నాం. ఈయోడు ఖందకం వుంది.

వర్త.—[ఆత్మగతము] వీనికి కైపెక్కుచున్నది. [ప్రకాశము] జగత్ప్రభువు చిత్తము.

సు.—అచ్ఛా! అచ్ఛా! [అని విశేషముగా నవ్వి, ఆత్మగతము] కైపుగా తోస్తుంది! [జాగ్రత్తతో] వర్తకులూ, నిన్నటి నాచిరంగు ఏదీ? అప్పట్నుంచి అక్కడ ఆడుతూనే వుందా? [ఆత్మగతము] కైఫ్ ఎక్కా అవుతూవుంది. నా చిరంగు అప్పుడే మర్తబ్ ఆయింది, ఆడుతూవుందా అడుగుతాం.

ఒకవజీర్.—బంవగానె ఆహ్, ఏమి యీ-యీ-యీ - దాని పేరు రాలేదు, ఆ! యీ విందు!

సు.—మనము బ్రతికి లేము. చచ్చి వీరస్వర్గం వున్నాము నేము చెప్తాం. ఈ సౌదాగర్లదంతా హాశ్చర్యం, అద్భుతం, తమాషా, చమత్కారం, గమ్మత్, వుంది.

మఱియొక వజీర్.—ఆహా ఏమి అష్చెర్బత్!

" ఏమి ఆ మాజూమ్ ! ఏమి ఆ లాహిరి ! ఏమి యా మాధుర్యం!

సు.—సేట్ భాయి. వఖ్నాదు, యెప్పుడో జ్ఞాపకం లేదు, మేము యిలాగే వాడాలో వఖ్ నాచీ చూచినాం. అది మాకి యిప్పుడు, తెచ్చిం పండి భాయి.

మఱియొక వజీర్.—మేము వఖ్నాదు, స్వప్నంలో యిట్వంటివాడా మే వఖ్నాచీ చూచినాం షుల్తాన్వారితో కూడా. [వికటముగా నవ్వుచు] వారికీ తోకా వూడుతుంది వోయి? మానోటా చమత్కారంమాటా వచ్చింది! హిహిహిహి! ఆనాచీ మేము చూడవాలా; తెచ్చించండి. సేట్ వర్తకులు గోవా భాయి.

సు.—ఆనాచీ వస్తే మేము కూడా ఆడుతాం, లేదు మెంగతాం, లేదు, వజీర్ భాయి, యేమి చెప్పినాం? ఆడుతా తోస్తుంది.

వర్త.—[ఆత్మగతము] వీరెక్కడ నున్నారో వీరికి తెలియదు. వలీఖాను పక్షమువారుమాత్రము కైపు లేకున్నారు. [ప్రకాశము] జగత్ప్రభూ, చూచినదే చూడనేల? జగత్ప్రభువువారు తెలుంగుదేశము జయించిన కీర్తి నాటకమును చూడవచ్చును.

సు.—మాకీర్తినాకటం! మాకీర్తి నాకటం!

వర్త.—అవును. తమకీర్తినాటకమే. దానిని మాదేశపుమహాకవులు తమకోసము చేసినారు.

సు.—వజీర్సాహేబ్, బహుతమాషా! బహుతమాషా! నాటక మారంభించండి.

కర్త.—మా యుద్యోగస్థులు, నౌకర్లు అందఱు చూచుటకు జగత్ప్రభువారి సెలవును ప్రార్థించుచున్నారు.

సు.—లోకమంతా చూడవచ్చును. హాహాహాహా! సూర్యచంద్రుల్ కల్లాతో పగల్ సాహేబ్ చూడవచ్చును. నక్షత్రాల్ కల్లాతో రాత్రి బీబీ చూడవచ్చును! జంగల్ మే వుండే సింగ్ పులి కూడా చూడవచ్చును. హోయి హోయి హోయి హోయి. సముద్రంలో వుండే మచ్ఛం కన్నా ముయ్యక చూడవచ్చునూ.

ఒకవజీర్.—[అరగన్నువడుచు] హాకాశంలోవుండే పచ్చీకూడా చూడవచ్చునూ.

వలీ.—[ఆత్మగతము] బలే యమధర్మరాజువహాయం! అతిషుల భంగా వీళ్లనందరిని సాఫ్ శీదా చేయవచ్చును.

కర్త.—మహానుగ్రహము! మహానుగ్రహము! ఆటగాండ్రను తెచ్చెదము.

[అని నిష్క్రమింతురు.

సు.—[తాంబూలకరండవాహినినిగూర్చి] మాకీ యేలడా యేలడా యేలడాయిలో వచ్చినందుకు చచ్చినావు అగే పహారీ ?

[అని దానిచేయి పట్టుకొనును.

తాంబూ.—అపహారీ వేరు మహాప్రభూ.

సు.—అపహారీని మేము చూడవాలా. బలే! బలే! బలే!

వలీ.—మనము ఎన్నిలడాయిలలో చస్తాం సర్కార్ ?

సు.—ఆహా! మీరుకూడా నాతో యిక్కడ వున్నారా! మీరు యెప్పుడు చచ్చినారు సాహేబ్ ?

వెట్టి.—[సమీపించి] ఇప్పుడే. ఇప్పుడే.

సు.—అహో! దివానాబహద్దర్! దివానాబహద్దర్! మాదగ్గిర మాదగ్గిర. [అని తనప్రక్కను తనకు వలీఖానునకు నడుమ గూర్చుండఁబెట్టుకొని] దివానాబహద్దర్భాయి హజారీకి మేము చూడవాలా.

[పెళ్లివాఁడు తన ప్రమిదను చూపును. అందఱు వికృతముగా నవ్వుదురు.
అంతట వలీపాత్రము సిపాయీలును ప్రవేశింతురు.

వలీపాత్రము.—బలే! బలే! సర్వం సిద్ధమా?

సిపా.—క్షుర్వం సిద్ధం,

వలీపా.—మరి కదలండి. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

వలీపా.—మీరు ఈలడాయిలో యే మేమిస్త్రి చూప్తారు చెప్పండి.

సిపా.—[ఒకరితో నొకరు] మనము శులాంద స్త్రఖైర్తు నిషీ చేత కట్టించు కొన్న పాటా కానిత్తాము రా, [అని సవాద్యముగా పాడుదురు.

ఒక సిపా.—[అొమ్మున షేయి యూంచుకొని] సర్దార్, నేను,

కెంఘలి ఢోం కలోన యెఘిరే నా ఘసామి
రఘిలే యి సము దాగే పఘిడీమియా.

[కడమ సిపాయిపాత్రములు వెంటఁ బాడుదురు.

మఱియొకఁడు.—[అల్లే] నేను సర్దార్,

నీ రంతా షారాయి నారంతా ఘంజాయి
జూరీ నిషా లేని పీయూ మియూ. ,,

ఇంకొకఁడు.—[అల్లే] నేను సర్దార్,

హోఖాషా నా ఫల్టీ లేఖాన్కి పార్వాల
ఢీఖోసీ యే షేటి షేఖూ మియా. ,,

[సిపాయీలందఱు కలిసి పాడుదురు.

* పీఖాల కీ కోసి హోఖాసా నీ కేసి
రాఖాను లూ రండి కేఖా లేస్తాం.
యేళ్లన్ని కోశేశి నాళ్లన్ని దోశేశి
ఊళ్లన్ని బల్వల్ల కాల్లు చేస్తాం.
యేన్గాల కొమట్టి పీన్గాలు గా గొట్టి

* పీఖాలకీ=గొంతు పిఁకెలను.

గాన్గపెం టలుగా తన్గి యేస్తాం.
సామూల రెవ్వు లట్టి సామాలు నా కేసి
నీమాలు పోగొట్టి నామాజ్ శేస్తాం.
అయ్యాల ముక్కట్టి గొయ్యాలు దిన్పించి
సయ్యేద్ సాహేబ్ చేసి సాపు చేస్తాం.
నిక్కాగు స్త్రీల తక్కాలు సల్లించి
అక్కడి కక్కడే సిక్షా శేస్తాం.
రానీవా సామూలా మానాముగా దెచ్చి
కానిక సర్దార్ జై నానా కిస్తాం.

సు.—వహావ్వా! వహావ్వా! [వర్తకులతో] ఈవస్తాదులు కూడా బొమ్మల్ చెయ్యలేక పోయినారా వర్తకులూ?

వర్త.—జగత్ప్రభూ, రసజ్ఞశేఖరా, ఈవస్తాదు లందఱు బొమ్మలే.

సు.—[పట్టి చూచి ఆశ్చర్యముతో ముక్కుమీఁద వ్రేలుంచుకొని] వర్తకులూ, మీది మర్వం మోషంవుంది. ఏమిహాశ్చర్యం! ఏమిహాశ్చర్యం మీరు యీలోకం వర్తకులుగారు. ఏలోకం వర్తకులు?

వెఱ్ఱి.—యమలోకం వర్తకులు. వెంగళప్పా. తెలివితక్కువ ప్రశ్నలు వేస్తావు?

వస్తాదులు, వర్తకులు.—[నవ్వుచు] దివానాబహద్దర్, నీవే ప్రళయకాలుఁడవు, మేమే కింకరులము.

వెఱ్ఱి.—అయితే మాకాయస్థుఁడు చిత్రగుప్తుఁ డేడీ?

వర్త.—చచ్చినవారిని యమునియెదుట మాటలాడ సిద్ధపఱుచుచున్నాఁడు.

వలీపా.—[ఆత్మగతము] ఈఢిల్లీ యేలకపోతే నేనుపఠాణ్ కాను. తెలంగీ దేవం కొడ్తే రాణువకీ లూటీ విస్తారంవస్తుంది, అది నాకీ వశం వుంటుంది. ఈలడాయిలో ఖుస్రూ చస్తే షంతోషం, బతికితే తర్వాత సఫాయి.

సు.—[వలీఖానుంజూచి] ఇదేమోయి యిది? యిట్వంటీ ఆలోచన వుందా నీకీ?

వ. ఖాన్.—బందగానె అలీ, ఇదంతా అబ్ధం, జూటా, వుత్తనాటకం.

సు.—అవును వుత్తనాటకమే. కానీ చూస్తాం యింకా.

[ప్రకటవాద్యములు మ్రోగును.

వలీపా.—మనం యిప్పుడు వోరంగోల్ చేరినాంగదా. యీవందు పట్నం పట్టడానికి ఖుస్రూతో ఛోడ్దేవు చేశి రాజాకి పట్టడాన్కి జంగల్కు పోదాం.

సిపా.—సర్దార్చిత్తం. [ప్రయాణభేరి, ఇతర వాద్యములును.

సు.—అహో! వలీఖాన్. లడాయిలో రాజాకి పట్టినాన్ చెప్పినావే?

వలీఖాన్.—ఇదంతా జూటానాటకం సర్కార్.

సు.—మంచిది, నాటకమే, చూస్తాం యింకా.

వలీ.—మరినడవండి. [అందఱు సవాద్యవాదనముగా పరిక్రమింతురు.

వలీపా.—అడ్వీకి వచ్చినాం రాజాకి వెత్కండి.

[సిపాయీలు చెదరి అన్వేషణమభినయించుచు నిష్క్రమింతురు.

వలీపా.—రాజా నాకీదొరికితే ఢిల్లీకి తీస్కొనిపోతాన్. ఖుస్రూ ఇక్డచావనీ.

సు.—[వలీఖానుతో] అరేయేమిరా నీకీ ఖుస్రూఖాన్ మీద అంతా ఖావేషి?

వలీఖాన్.—తమరు కైఫ్మే వున్నారు,తమకీ యిదీ అదీ తెలియడం లేదు. అరే నట్లువులు, యేమి నాట్కం యిది, జూటానాట్కం ఆడ్తారు? మాకీ సుల్తాన్వారికి ద్వేషం చేస్తారూ?.

సు.—[కోపముతో] అరే!యేమిరా యింతా జబర్దస్తీ మాటాడ్తావ్?

వలీఖాన్.—లేదు అల్లా, నట్వులుతో మాట్లాడినాను. గులాంతల మీద.

సిపా.—[రాజును పట్టితెచ్చి] సర్దార్సాహేబ్, ఇద్గో రాజా మీ ఖయిదీ.

వలీ.—ఆహా! రాజాకి పట్టినాను గదా!

వెఱ్ఱి.—నాకొక వెంగళప్ప ఒకపాటకట్టి నేర్పాడు. ఇది చూడకపోతే అది వినండేమి, [అని లేచి ఆడుచు పాడును.

రాజు నేమో పట్లలేదు, రౌతు నేమో పట్లలేదు,
చాకలిపేరని వల్లి సాయెబయ్య పట్టినాడు,
మంత్రిమాటకు మోసపోయి మంచిదుస్తు నగలు దోడిగి
వేట వేసము వేసుకొని కోటిమొనలో నునుకుచున్న
చాకలిపేరని వల్లి సాయెబయ్య పట్టినాడు.
రాజు నేమో పట్టలేదు రౌతు నేమో పట్టలేదు, చాకలి...

సు.—[ఆత్మగతము] ఆహాహా! ఎంతమోసం! ఎంతమోసం! [ప్రకాశము] అరే వలీ యేమిరా మహాల్వాలాకి మాచేత తాజీం యిచ్చినావు.

వలీఖాన్.— దివానాది పాటా నమ్ముతారూ, నాదీమాట నమ్మరు.

సు.—కానీ కానీ, అరే వర్తకులు, ఏమి మాకీ మోసం నాకటం చేస్తారు? మీకీ తల్కాయ అక్కర్లేదా?

పెద్దసెట్టి.—తలకాయ అక్కఱ లేదా? తలకాయకోసమే యింత కొలువు. జగత్ప్రభూ, మేము, తమదర్శనమునకు వచ్చి మూఁడుమాసము లయినవి, వచ్చినవాఁడే యీమోడకు లంగరు దింపి కొంచెమవలికి జరుగుటకు మరల లంగరెత్తఁగా లంగరుతో ఒకశవము మొండెము రాయి కట్టినది లేచినది.

సు.—తర్వాత? తర్వాత?

వలీఖాన్.—[వర్తకులను సుల్తానును అత్యుగ్రముగాఁ జూచుచు, ఆత్మగతము] యమధర్మరాజుమహాయం మోసం వుందా? వచ్చినపని జర్గడాన్కి జగడం పెడ్తారు తోస్తుంది.

పెద్దసెట్టి.—అంతట ఎవరో పాపము, ఎవరో చంపినారు, బంధువులు వెదకుకొనివచ్చిన ఈయవచ్చును, అని ఆశవమును ఓడలో పెట్టితిమి. గట్టున

నక్కలఁ గాంచి పోయి చూడఁగా తల యొకటి దొరకినది. అది ఈ మొండె మునకు సరిపోయినది.

సు.—తర్వాత? తర్వాత?

[వలీఖాను తన పక్షమువజీర్లకు హెచ్చరిక సేయును.

పెద్దసెట్టి.—అంతట మేమబంది చేసి ఔషధములచే ఆశవమును ఈ గదిలో కాపాడుచున్నాము. మతిమూగ్రహాచారముచే శవమువెంటనే చచ్చినవాని పిశాచము కూడ ఆగదిలో చేరినది. రాత్రులెల్ల అందులో కో యని యేడ్పులు. ఎందఱికో మాకళాసులకు ఆభయముచే జ్వరములు. ఎందఱినో ఆపిశాచము పట్టి మాపౌరోహితులు ధూపము వేసిన పలుకుచు, తాను ఖుస్రూఖాన్ —

సు.—[ఆశ్చర్యముతో] ఆ! ఆ! ఆ! ఏమి? ఏమి?

[వలీఖాను కత్తి దూయును, ఆతనిపక్షము వారును దూయుదురు.

పెద్దసెట్టి.—[వణఁకుచు] తన్ను వలీఖాన్ చంపినాఁడని, సుల్తాను వారితో చెప్పుమని యేడ్చును. తమతో చెప్పినతర్వాత దానిని పోఁగొట్టు కొందమని యింతకాలము ఇంత కష్టపడినారము.

[వలీఖాను సుల్తానును పొడువఁబోవును. వెత్తి, వలీకత్తిని లాగివేసి వాని పెడ రెక్కలు విఱిచికట్టును. సిపాయిప్రాతములు వలీ ఖానుమిత్రులను అట్లే చేయుదురు.

సు —అరే! యీఆశ్చర్యాలలో మాకైపు గయా, అంతా పట్టపగల్గా వుంది! అరే! అరే! జూటానాకటం చెప్పినావు! యెంతాద్రోహీరా నీవు! నీవు మాకీ కొమార్తెకీ యిచ్చి పెళ్లిచేస్తావు! విందూ చెప్పి యింటికి తీస్కొని పోయి చంపడానికి, నిశ్చయం! అహో ఆశ్చరం! ఎంతాద్రోహీ! ఎంతా ద్రోహీ? మాక చంపె యీపాపి మాఖుస్రూకీ చంపినాడులో సందేహం యేమి? అరే ఖుస్రూ! అరే ఖుస్రూ! అయ్యో! ఖుస్రూ! వాడు మాబిడ్డా, వాడు మాకూనా, వాడు మర్గయా, మేమూ మర్గయా.

[అంతట గదినుండి ఖుస్రూశవము పిశాచాధిష్ఠితమై వచ్చును. వర్తకులు గడగడ వణఁకుదురు. వజీర్లు భయవిభ్రాంతులై దూరము జరుగుదురు, అల్లే సుల్తాను వడవడ వణఁకును.

సు.—[భీతినాటితకముతో] మూడుమాసం ఖానా లేక సొక్కిన దవడలు, చిక్కినశవం, ఎండుతాటికాయలాగ తలకాయ, ఎండుతాటిబొండ లాగ మొండెం. వీడికి చూస్తే మాకీ గుండె పక్వారి పోతుంది! గాభరా వుంది! క్యాకర్నా!

ఖుస్రూ.—[పెద్దరోదనములో] మెరే బాబ్, ఘియాజ్ ఉద్దీన్ టోగ్లాక్ సుల్తాన్, బందగానె అప్, నాకీ వలీ చంపినాడు. లడాయిలో చావలేదు. బిసాత్ ప్రాణం దొంగాచేతా చచ్చింది. వీడు రాజాకి పట్టలేదు, చాకలికి పట్టినాడు. [సుల్తాన్ విభ్రాంతుఁడై వినును.

వెఱ్ఱి.—[వలీఖానును తన్ని దొరలించుచు] 'దివానాది పాటా నమ్ముతారు, నాది మాటా నమ్మరు.' [వలీ వణఁకును.

ఖుస్రూ.— రాజా తర్వాత వచ్చినాడు. లడాయి ఐంది, మన దండంతా మర్గయా. నేను మేరే బాబ్, మేరే బాబ్, మేరే బాబ్, తమ పాదాల్ దర్శణంకోసం, పరారిచేసి ఢిల్లీకి వచ్చినాను.

[సు. వణఁకుచు ఏడ్చును. సుల్తాన్ పక్షము వజీర్లును వణఁకుచు ఏడ్తురు. వలీ. కన్నులు మూసికొనును.

ఖుస్రూ.—వీడు సర్దార్గదా అని, వీడు సర్దార్గదా అని, వీనికి దర్శణం చేసి, నీవుచాకలికి తెచ్చినావు చెప్పినాను బాబ్, తమతో చెప్పవద్దు అన్నాడ్. తప్పకుండా నేనుచెప్తాన్ అన్నాను. అయితే పోనీ సికార్పోదాం చెప్పి, కబుర్లడుగుతూ, ఇక్కడిక్కడవచ్చి అద్గో అక్డచూడు చెప్పి యిద్గో యిక్డ నాతల కొట్టినాడ్ బాబ్, మేరేబాబ్. [వలీ. మూర్ఛిల్లును.

ఖుస్రూ.—వాడ్కి అట్లా మీరు తల్కాయ కొట్టించి నాకి గోరీ కట్టిస్తే నావాత్మ హల్లాకొడికి పోతుంది.

సు.—[కన్నీళ్లతో వణఁకుచు] యిద్దే వాడ్కి శాస్త్రీ చేస్తా. నీకి బంగారం గోరీ కడ్తాం. ఏడవకు హల్లాకొడ్కి-పో. అహహా, మూడుమాసాల్క్రింద దివానాగోడ్క స్త్రీజవాన్ను పీడి! చూచినాం చెప్పినార్. ఈవలీ పాపి జాటాభాత్ అన్నాడ్. మాకీ యుద్ధంలో ఖుస్రూ మర్గయా చెప్పినాడ్.

[వలీఖాన్ మూర్ఛ తేరును.

ఖుస్రూ.—మేరేబాబ్కి సలామతీ. నెనీదేఘం తమకీవప్పగించి అల్లాకాడ్కి పోతావున్నాను.

[ఖుస్రూ కళేబరమునుండి చెకుముకిశాస్త్రి వెలువడి కళేబరమును త్రోసి వలీకిమాత్ర మగపడి చాటునకు పోవును.

వలీఖాన్.—[చెకుముకిశాస్త్రిం గని] హా! హా! హా! యంధర్మరాజా

[అందఱు కళేబరమును దరిసి కని ఆశ్చర్యపడుదురు.

శెట్టి.—నన్ను పిలుస్తావా?

సు.—ఆరే గాడిదా, యమధర్మ రాజేమిరా?

పెద్దసెట్టి.—[వణఁకుచు] చావఁబోవువానికి, ఇది హిందూనావ గనుక యమధర్మరా జగపడినాఁడు.

సు.—వీడ్కి మేము యంధర్మ్ రాజ్ అవుతాం.

మాదీ నమ్మఖిన్న మంచి వజీర్లకి

మాపై ఖాహిషీ చేస్తాడు.

మాషాల్ వాలాగాడ్కి మాకీ తాజీం చెప్పి

మాకి హవ్మానం చేస్తాడు.

మాగులాం కు సంపి మాకీ స పాయి చేసి

మాతఖ్తు వీడు యెత్తాడు.

హిద్దర్గో వీడికి హిందారు చూడండి

యేటాపో తూ హల్లా కేస్తాన్.

వేడి వేడి వేడి వీడినెత్తు ర్తాగి

వీళ్ల మొ ఘూన థూ చేస్తాన్.

వీళ్ల డొక్కల్ చించి వీళ్లకె సుత్రెంచి
వీళ్లక్ బొమ్మస్తాను చేస్తాన్.
నిష్ఠురం పొలిబో సెత్తి యన్గు ద్దాక
నిత్యం పి న్లైమాన్ల్ కోయిస్తాన్.
భగ్గు భగ్గు న్నె మ్టలో పడివేస్లి గోత్రోజు
పాతి పః పస్తాంచ్ చేయిస్తాన్.

[అని వలీఖానుతలను కొట్టఁబోవును.

పెద్దసెట్టి.—కట్టినవానిని తమరుకొట్టఁగూడదు, అంగరక్షకుల కాజ్ఞ చేయుఁడు.

వజీర్లు.—అవును, బందగానె ఆలీ, మేము చెప్తాం. ఎవర్రా, అక్కడ? ఈపాపాత్ములకి తీస్కానిపోయి తలకొట్టి రాయికట్టి జమ్నామే వెయ్యండి. అది సర్కార్ అజ్ఞ.

అంగరక్షకులు.—సర్కార్ చిత్తం. [అని కొనిపోవుదురు.

పెద్దసెట్టి.—[ఒకవర్తకునితో అపవారించి] వలీతల తెచ్చి భద్రము చేయుము.

[ఆ వర్తకుఁడు నిష్క్రమించి, గుభీల్ గుభీల్ అని నీటి లో వేసిన శబ్దములు అగును. గుండ్లు మ్రోఁగును.

అంతట చెకుముకిశాస్త్రి ప్రవేశించును.

వర్త.—వీరే మాపురోహితులు.

సు.—ఓహో చిత్తర్ గుప్తజోస్యులు!

[చెకుముకి వలీఖానుని ఖరారునామా సుల్తానుచేత పెట్టును.

సు.—[చదువుకొని] అహో! మాకి యీ రాత్రి చంపడానికి మూడు నెలల్ కుట్ర. ఇది వాడిదే దస్తూరీ. ఇది వాడిదే దస్కత్. ఇవి వా డెవర్కి రాసినాడ్ ?

చెకు.—ఎవరికో? ఈ చీటి ఒకనాఁడు జగత్ప్రభువువారి యాస్థానమున సభ శేచిఁపిమ్మట నాకు దొరకినది. ఆశత్రువు లందఱు తమకు దొరకుటకై, ఇప్పటివఱకు నేను దీనిని దాఁచితిని. ఈవర్తకులకు ఈకుట్ర తెలిపితిని. వాని యింట జగత్ప్రభువునకు విందు తప్పించి వారివిషయమున తమకు చేసిననౌకరీ తమకు ప్రత్యక్షమే.

సు.—వారిచేత బతికినాం. మీ వుపక్కారానికి చాలా సంతోషం! హా యేమి రాత్రియిది! వీడ్కి మేం సిఫాయిమొదల్ ఫౌజ్‌దార్ చేశి, సర్వ సేనాపతి చేసి, ధనం ఇచ్చి మర్యాదల్ ఇచ్చి, వజీర్ చేసి, మొదల్‌వజీరు చేసినాం. మాకీ యింతా ద్రోహం చేసినాడు! హా హా హా!

[నేపథ్యమున బాలస్వరముగా]

దాదాజీ, దాదాజీ, నీహుకుం చెప్పి వీళ్లు నాకీ
చం పేస్తున్నారు! దాదాజీ, దాదాజీ! దాదా ఆ ఆ ఆ.

సు.—హా! నా హన్నాకొమారుడి యేద్పు విన్పడ్తుంది! ఆ! నాపాపం నాకికొట్టిందా! హా! హా! హల్లా! హాల్లా! [అని మూర్ఛితుఁడై పడిపోవును.

వజీర్లు.—[వణఁకుచు చెమర్చుచు] హా యేమిరాత్రి యిది! ఏమి రాత్రి యిది! అయ్యో! పెద్దపిసాసీ సహ్వాసంలో నో రెర్గని కూనపిసాసీ చేరింది! వీడు వలీఖాన్కి పెంచినాడు; దాన్కి పది వీడ్కి వీడి అన్నా పెంచినాడు. అతడు, సచ్చేతప్పుడు, మాకళ్లు చూస్తావున్నవి, యీపాపాత్ముడివల్లో పెట్టి పోయిన నోరెరగని కూనకి ఏడేళ్ల సిషువుకి, వీడు గోడచాటు వుండి చూస్తా వుండి, [కన్నీళ్లతో ఏడ్చుచు]తల్చుకొంటు మాగుండెల్ నీరవుతుంది,ఆ మహా ప్రభు సిషువుకి, వీడు యిద్దర్ మనుషుల్ చేత, ఇశనికి పిలిచిపిలిచి యేడుస్తా వున్న సిషువుకీ, సంపించి వేసి తఖ్తు యెక్కినాఁడు. ఆపాపం యిప్పుడు వీడి గుండెకి తగిలింది సౌదాగర్ భాయి.

పెద్దసెట్టి.—శివశివా! శివశివా!

[చెకుముకి సుల్తానుముఖమున పన్నీరు చల్లును. సుల్తాను ఆశ్వాసిల్లును.

వజీర్లు.— బందగానె అలీ, ఇక యిక్కడ మనం వుంటాంవద్దు. నగర్కు పోదాంపండి.

మ.— నగర్నుంచి గుండు మాగుండెకి యిప్డు తగిలింది. మేము యిప్డు నగర్కు రాలేము.

చెకు.— మఱియిచటనే శయనింపుఁడు, సర్వము సిద్ధము, నాతో రండు. కొంచెము పెర్బత్తు పుచ్చుకొనుఁడు, ఆయాసము తీఱును.

వజీర్లు.— అట్లాచేయండి.

[చెకుముకి పర్బత్తు ఇచ్చును. సుల్తానుత్రాగును. వజీర్లును. చెకుముకియు సుల్తానును శయనగృహమునకు తోడ్కొని నిష్క్ర).

అంతట రాజు ప్రవేశించును

వెట్టి.— పెద్దసెట్టీ, మహారాజునకు మంగళవేష మొసంగుము.

పెద్దసెట్టి.— శుభము శుభము శుభము. తమరును మంగళవేషము ధరింపుము.

[అని వెట్టివానికి మంత్రివస్త్రములు ఇచ్చి, రాజునకు వస్త్రములను ఆభరణములను తెచ్చి యుంచును. వెట్టివాఁడు మహామంత్రి వేషము ధరించును.

పెద్దసెట్టి.— జయము జయము మహామంత్రి యౌగంధరులవారికి.

చెకు.— [ప్రవేశించి యౌగంధరునింగని] జయము జయము యమధర్మరాజ మహామంత్రిగారికి. [రాజుం గని] ఈయమసభలో సౌదాగరులవారు దేనికి వెలలు వేయుచున్నారు? [ఆగ దు. యౌగం. తల ఆడించును.

రాజు.— [రాజవేషధారణమును ముగించుచు] వెల గలవానికి వేయఁగలమేగాని లేనివానికి వేయఁగలమా?

చెకు.— వెలలేని సరకులుం గలవా యీవర్తకులయొద్ద?

[అగాదు. యౌగం. తల ఆడించును.

రాజు.— [ముగించి తటాలున యౌగంధరునిపాదములు పట్టుకొని, హార్షాశ్రుగద్గదముగా] ఈ యౌగ్యమునకు వెలగలదా శాస్త్రులవారూ?

ఉ. 1 శ్రీదయితుండు 2 దానవులఁ 3 జెండి నిజాశ్రితు నింద్రుఁ బ్రోచిన
ట్లాదట నాయరాతుల నెలార్చి నను న్సతతంబుఁ బ్రోచుచున్,
4 శ్రీదుని బేదఁ జేద నలశ్రీదు నొనర్చి విధి న్నుతించు నీ
పాదసరోరుహద్వయికిఁ బ్రాజ్ఞవరేణ్యా, వచింపు మూల్యమున్. 6

[అని యాపాదములకు బాష్పములం దడుపును.

అందఱు.—లేదు, లేదు, లేదు. [మూఁడు ఆగాగులు.

యుగం.—లేలెమ్ము వత్సా [అని రాజును లేపి కూర్చుండఁబెట్టి] దైవికము తండ్రీ, ఖేదపడకు.

రాజు.—తమ యాజ్ఞమీఱిన దోషమే, దైవదోషముగాదు.

యుగం.—వత్సా, గతమునకు చింతిల్లకు.

ఉ. రాణ దలిర్ప నీ కఖిలరాజులు దండనతుల్ రచింప, వి
న్నాణపుమౌళికెంపులఘువద్ద్యుతి నల్గడఁ జొట్టువాఱుచో,
జాణను నిన్వరించు నలశాత్రవలక్ష్మిని బెండ్లియాడఁ బా
రాణియలంకృతిం బడయు రాజశిఖామణి, నీపదాబ్జముల్. 7

రాజు.—మహాప్రసాదము మహాప్రసాదము.

యుగం.—వత్సా, నీ బాహుకార్యమును వీరి భక్తివిశ్వాసములు కావించినవి.

రాజు.—నా సుకృతకార్యమును గావించినవి.

యుగం.—పెద్దసెట్టీ, బాల్యమున మాసహాధ్యాయివి సహక్రీడివియు నైన స్నేహవిశ్వాసములను పూర్ణముగా చెల్లించితివి.

పెద్దసెట్టి.—కంటికి ఱెప్పలవలె సదా రక్షకుల రగు తమకు నాచేయు కొలువునకు ప్రశంస యేల?

రాజు.—ఆచంద్రార్కము ప్రశంసనీయము మీయందలివిశ్వాసము.

1. నారాయణుఁడు. 2. అసురులను. 3. సంహరించి, ఆదటన్ = ప్రీతితో, ఆరాతులన్=శత్రువులను, 4. కుబేరుని,

యౌగం.—చెకుముకీ, ఇప్పు డీ ఢిల్లీనగర మెట్లయినది?

చెకు.— (పంచచామరము.)

సచిత్రగుప్తకింకరంబు చాయపట్టి చండతన్
విచిత్రవైఖరిన్ ¹మెసంగి పీడిసట్టు లయ్యెఁ జూ,
²విచేతనంపు మొండియుంపు జోరింపు లెంక ఢి
ల్లిచేట్ల, శ్వేతలక్ష్మి గాఁగిలించె దీనిఁ బ్రేమతోన్. 8

యౌగం.—ఇక్కడికి లెక్క అప్పగింపుము.

చెకు.—హతశేషులు—సుల్తాను, ఇరువురు ముసలిజజీర్లు, ఇరువురు జవానులు. వీరు షెర్బత్తునిద్రలో ఖైదు.

యౌగం.—వత్సా, మన సన్నాహమును పరికించుచుంటివా యింతసేపు?

రాజు.—విచారించితిని. ఈ యోడల నున్న పదివేలుగాక నడిపాడుగు నను నాబలము ఏఁబదివే లున్నదిగదా. మనమేల ఢిల్లీని పట్టఁగూడదు?

యౌగం.—వచ్చినపాము, పట్టి నిలుపుకొనుట కీసన్నాహము చాలదు.

రాజు.—తమ చిత్తము.

పెద్దసెట్టి.—ఏలినవారు ఒక కొన్నియేని నిజమంగళాలంకారములు ధరింపరాదా?

రాజు.—విశ్వనాథక్షేత్రమున ప్రాయశ్చిత్తమై, విశ్వనాథపూజయై, [యౌగంధరుని పాదములు చూపుచు] ఈపాదములను నాస్వహస్తములఁ బూజించి, పిదప.

చెకు.—తురకలు తిండికి లేవఁగానే లంగరు లెత్తినారము. నిద్ర కేఁగినంతనే చాఁప లెత్తినారము. ఉభయవేగములఁ బోవుచున్నవి. తేపే విశ్వనాథసేవ.

---

8. సచి...డతన్=చిత్రగుప్తుఁడును కింకరులును తోడుగా యమధర్మ రాజు మహాకోపముతో. 1. భక్షించి. 2. ప్రాణములేని.

యౌగం.— మఱి అందఱు విశ్రమింపుఁడు.

ఆ. సెట్టి యొకఁడు, నేనుఁ, జెనముకిశాస్త్రియు,
కాలరుద్రుమూఁడుకనులభంగి,
మేము ముగ్వురమును మేల్కొని యుందుము,
ప్రభువు విశ్రమంబుఁ బడయుఁగాక.

[అందఱు నిష్క్రమింతురు.

---

# నవమాంకము.

స్థలము 1, ఓరుఁగల్లు, నగరిలో, రాణి పూజామందిరము.

అంతట విరహాకృశ ప్రతప్త రాణి గౌరిని పూజించుచును,
చేటిక ఉపకరణము లందిచ్చుచుండు, కొందఱు విప్రాంగనలు,
పురోహితుఁడు, తద్భార్య, తత్స్నుషయు, ప్రవేశింతురు.

పురో.—అమ్మా, స్వప్నములో దేవత యిచ్చిన వరములు తప్పవు. ఈ దినమే నీవు ప్రాణేశ్వరునిం గలసెదవు.

రాణి.—మహానుభావుల వాక్ప్రభావము.

[అని గౌరిని పాడును, చేటికలు మృదంగాదికము వాయింతురు.

ఖామాజ్ రాగము. చాపుతాళము.

*ఇందుమౌళి కామినీ, మృగేంద్ర గామినీ,
డెందమందుఁ గూర్పవే, నా కుందు దీర్పవే. ఇందు.

దుష్టవర్గ శిక్షణీ, ని జేష్టరక్షణీ,
కష్ట మడఁచి ప్రాణనాథుఁ గనుఁగఁ జూపుమా. ఇందు.

† కల్పకముల వారునితపము కన్నెలీలనే,
సల్పి యతని సగము గొన్న సాహసాంగివే. ఇందు.

కల నొసఁగిన వరము లిపుడె కరుణ సేయవే,
‡ కులగిరీంద్ర కన్య, జాలి గొనవె, కావవే. ఇందు.

---

*ఇందు—చంద్రశేఖరుని (శివుని) భార్యా, సింహము నెక్కి సంచరించుదానా, (నీ) హృదయమందు (నాపై) ప్రేమ వహింపుము, నాదుఃఖమును పోఁగొట్టుము.

† కల్పకము=సృష్టిమొదలు ప్రళయమువఱకుం గలకాలము.

‡ హిమవంతుని యొక్క.

రాణి.— [దోయిలించి దోయిలించి అమ్మవారి పాదముల పువ్వులు చల్లి] ఓసి, కాశీ, ముత్తెములగంప అందియ్యవే.

చేటి.— ఇదిగో. [అని దగ్గఱఁ బెట్టును.

[రాణి ముత్తెములు దోయిలించి గౌరిపాదములం దర్పించును.

ఒకచేటి.—[ప్రవేశించి] దేవీ, మల్లె పువ్వులు,కడమవి అన్నీ వచ్చినవి.

రాణి.—ఏవేవి? ఎంతెంత?

ఆచేటి.— పదిజల్ల పువ్వులు, నూరుబింకెలు పన్నీరు, నూరుగిండ్లు అత్తరు. ఇంకా చిల్లరలు వున్నవి.

రాణి.—సగము అత్తగారిపూజకు కొనిపొండు,సగము ఇక్కడికి తెండు.

ఆచేటి.— ఇవన్నీ అత్తగారు పంపినవే.

రాణి.—ఇటయిన మహాప్రసాదము. అంతయు తెండి జాగ్రత్తగా.

ఆచేటి.— దేవిగారి యాజ్ఞ. [అని నిష్క్రమించును.

రాణి.— ఈ వీనులు గౌరీవాగమృతమును గ్రోలిన యాదినమే ప్రాణేశ్వర నగరప్రవేశతూర్యనాదామృతముం గ్రోలుఁగాక. గౌరీపూజాపరిశేషిత కుసుమోత్కరంబుతో ప్రాణేశపాదములం బూజించెద.

[అని మరల గౌరిం బూజించుచు పాడును

[చేటికలు వాద్యములు వాయింతురు

హిందూ. కాపి రాగము. రూపకతాళము.

నీవే గతి గావే, *నిటలాక్షు రాణిరో,
కావవే వేగమే, వేగమే. నీవే.
శరణుఁ జొచ్చితి నీ చరణము తల్లిరో,
కరుణతోఁ జూడవే, చూడవే. నీవే.
తెల్లమయ్యె నా యుల్లమీ వేళ,
తల్లిరో, ప్రోచితే, ప్రోచితే. నీవే.

---

* ఫాలనేత్రునియొక్క (శివునియొక్క)

గౌరీ మహేశులు కౌతుక మ్మహాట,
పారము, చేసితే, చేసితే. నీవే.

నిన్నే నేఁ గొల్వ నిఖిలజన్మముల
నెన్న వే యీశ్వరీ, యీశ్వరీ. నీవే.

కల నీ కథ, నిద్ర కలఁగని ధ్యానము,
తెలివి నుతి, సేయవే, సేయవే. నీవే.

చుక్క లన్ని పూవు, లక్కడలి పన్నీరు,
లెక్క చేతుల్, సేయవే, సేయవే. నీవే.

మ్రొక్కఁగయి కొమ్మా, మ్రొక్కై కోవమ్మా,
మ్రొక్కెద నోయమ్మా, ఓయమ్మా. నీవే.

[ముత్తయిదువులు పాడుదురు. చేటికలు వాద్యములు వాయింతురు.

ఆనందభైరవి రాగము. రూపకతాళము.

గిరిరాజతనయా, రక్షింపు;
వరము లొసఁగి మమ్ము వాసిగాఁ బెంపు. గిరిరాజ.
అళిక నేత్ర మొకటి, యర్ధాంగ మొక్కటి,
తళుకు ‡ లే నెలపూవు తల నొక్కటి,
కులుకునింగపుఁదేజి కొదమయయు, గఱులుగా
వెలసి లోకము లేలు విశ్వేశురాణి. గిరిరాజ.
§ వాకు వా కున నాను ¶ భారతీదేవినీ,
+ ఏకస్థానము లేని యిందిరను,

---

* కల—నాస్వప్నావస్థ నీచరిత్రగాను, నానిద్ర నీధ్యానముగాను, నాజాగ్రదవస్థ నీస్తోత్రముగాను చేయుము. † లెక్క—లోకములో సంఖ్య లెంతవఱ కుండునో అన్ని చేతులు నాకిమ్ము. ‡ లేనెల=లేఁతచంద్రుఁడు. § వాకువాకునన్=ప్రతివారినోటను ¶ సరస్వతిని, + ఒకచోట స్థిరముగా నుండని లక్ష్మిని.

జేఁగొన గ దయితు మేనసె నెలగొని,

లోకము లేలుత్రి లోక్యజనని. గిరిరాజ.

[చేటికలు పుష్పాదికములను తెచ్చి యుంతురు. రాణి
వానిని పరీక్షించుచు యథాస్థానముల నుంపించును.

పురోహితపుత్త్రుఁడు సంభావనీయ బ్రాహ్మణులతో
వేఱుశాలం బ్రవేశించును.

ఒక వృద్ధబ్రాహ్మణుఁడు (అవధానులవారు)—[ప్రవేశించుచు]

'ఆపదా మపహర్తారం దాతారం సర్వసంపదామ్.
లోకాభిరామం శ్రీరామం భూయోభూయో నమామ్యహమ్.'

కూర్చున్నబ్రాహ్మణులు.—అబ్బో! అవధానులవారా! రండి రండి, ఇక్కడ ఇక్కడ. [అని వారిని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు.
వారును కూర్చుంటలో పడఁబోయి కూర్చుందురు.

ఇతరులు.—పెద్దకాలము!

మఱియొకబ్రాహ్మణుఁడు [కుండలధారి చయనులవారు].—[ప్రవేశించుచు]

'హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే.'

ఇతరులు—రండి రండి, చయనులవారు. నీవు లేరా.

[అని చిన్నవాని నొకని జరిపి ఆయనను కూర్చుండఁబెట్టుదురు.

పురో.—[వీరికడకు వచ్చి] ఇన్నాళ్లు ప్రార్థింపఁగా ప్రార్థింపఁగా ఈ దినము చయనులవారు అనుగ్రహించినారు.

చయనులు.—నాయనా, మీరా? మహాదేవయ్యగారా? ఈదినము కూడ అగ్నిహోత్రము అయిన తర్వాత ఉపనిషత్తులు పారాయణము చేసికొనుచుండి యిక్కడిమాట మఱవనే మఱచితిని. తర్వాత మనుమరాలు జ్ఞాపకము

చేయఁగా వచ్చితిని. మీ పరిపాలనను ప్రశంసించుచున్నాము. మీయెడ కోపమెట్టిది లేక యుండవచ్చునా?

మఱియొక బ్రాహ్మణుఁడు [కుండలధారి సోమయాజులవారు]—
[ప్రవేశించుచు]

'శివం శివకరం శాన్తం శివాత్మానం శివోత్తమమ్
శివమార్గ ప్రణేతారం ప్రణతోఽస్మి సదాశివమ్.'

వేదికడ ఎన్ని గుంజిళ్లు పెట్టినను కాళ్లకు నొప్పిలేదు. ఈద్వారములు దాఁటి ఈసోపానములు ఎక్కునప్పటికి నా పని అయినది.

ఇతరులు.— ఓహో! విశ్వేశ్వర సోమయాజులవారు! ఇన్నాళ్లకు గ్రామము విడిచి దయచేసినారు. ఇక్కడ ఇక్కడ.

[అని సగౌరవముగా కూర్చుండఁ బెట్టుదురు.

పురో.— బహుదినములకు కటాక్షించితిరి. సోమిదేవమ్మగారు కూడ వచ్చినారా?

సోమ.— మాయింటిదా, వచ్చినది. దానివలననే యింత యాలస్యము.

సోమిదేవమ్మ.— [ప్రవేశించుచు నవ్వుతో అత్మ.] ఇక్కడికొచ్చినా తప్పులేనా?

పురోహితభార్య.— రండి సోమిదేవమ్మగారూ, రండి. [అని ఆమెను రాణి కడకుఁ గొనిపోయి కూర్చుండఁబెట్టి, కోడలితో] అమ్మీ జగదంబికా, మనము ముత్తయిదువులను పూజింతాము రావే అమ్మా.

పురో.— [తనకుమారునితో] మహేశ్వరా, బ్రాహ్మణపూజ కానీ.

[రాణిచందనపుష్పతాంబూలాదులను సంస్కారవంతములను-గాఁబరికించి
చేటికలచేత మహేశ్వరయ్యకడకును జగదంబికమ్మ కడకును బంపును.
వారు బ్రాహ్మణులకును ముత్తయిదువులకును వినియోగింతురు.

పురో.— ముందు చయనులవారిని పూజింపుము.

చయనులు.— సోమయాజులవారున్నారు, మహానుభావులు, వారిని పూజింపుము నాయనా ముందు. ఇంక పెద్దలెవరున్నారో చూడు బాబూ.

సోమ.—తమరే ఇచట వయోవిద్యాకర్మజ్ఞానజ్యేష్ఠులు. సాక్షాత్తు ఆపస్తంబుల వారే. బాబూ చయనులుగారికే కానిమ్ము నాయనా.

[మహేశ్వరయ్య చయనులవారికి చందనాదికము ఇచ్చును.

చయనులు.—మఱేమి చేయవచ్చును! పెద్దలమాట తప్పఁగూడదు.

[అని గ్రహించును. ఒకరిద్దఱు బ్రాహ్మణకుమారులు
తెచ్చి యితరులకు చందనాదికము సమర్పింతురు.

చయనులు.—[మహేశ్వరయ్యతో] నాయనా, మహాపుణ్యాజన్మము మీది, 'కర్తాకారయితా' అన్నారు పెద్దలు. [బ్రాహ్మణపూజ జరుగును.

ఒక బ్రాహ్మణుఁడు.—[ప్రక్కవానితో]

క. ఈ మాన్యవృత్తపావన
సామీప్యంబందు నున్న సమయం బెల్లన్
నామదిఁ దోఁచు మథురలో
నా మీనేక్షణసమీపమందున్నగతిన్. 1

మఱియొక బ్రాహ్మణుఁడు.—

క. ఊరఁ గల *వామ లెల్లరు
నీ రాణిని నీమెపూజ నీక్షించినచో
పారమతి నల్లయనసూ
యారుంధతు లగుట కొక్క యంకిలి యున్నె ! 2

ఇంకొక బ్రాహ్మణుఁడు.—సాక్షాత్తు ఆ కాశీవిశాలాక్షి ఇట్లవతరించినది.

[మహేశ్వరయ్యవరహాలు పళ్లెరములతో బ్రాహ్మణులకు కుమ్మరించును.

కొందఱు బ్రాహ్మణులు.—[వరహాలు ఉత్తరీయములో పట్టుచు] ఏమయ్యా, మహేశ్వరయ్యా, ఇరుసలతోఁ గొలిచి కుమ్మరించుచున్నావు ? మోయలేము బాబూ.

---

1. ఈమాన్యవృత్త=మాననీయమైనచారిత్రముగల యీరాణియొక్క
2. *కుటిలస్త్రీలు.

మహేశ్వ.—కోపగింపకుఁడు స్వామీ, కోపగింపకుఁడు; ఇంకొక పల్లెము, ఇంకొకపల్లెము. [అని మరల మరల వరహాలు కుమ్మరించును.

అమువ్వురు బ్రాహ్మణులు.—అయ్యా, పిల్లపారోహితులూ,

(సీసము.)

ఒక.—సాధించిరో నీరుఁజనకు లీదేవికై *భూరిసమాకృష్టిభైరవంబు?
మఱియొక-కాదేని, చేసిరో కనకధారాస్తోత్ర బీజాక్షరాదిసంయోజనంబు?
ఇంకొక.—అది కాదు, సిద్ధించె నలకుబేరోపాస్తి.
ఒక.— దొరకెఁబో వీరికిఁ † బరుసవేధి.
మఱియొక.—వశ మయ్యె నితనికి వటయక్షి
ఇంకొక.— యది గాదు, ‡ నిధ్యంజన మితండు నేర్పినాఁడు.
ఒక.— కంటె చేర్పుసారంగంబు § కనకగిరికి ?
నెచటి దన్మిది నెలలుగా నీ విధమున
వచ్చుబ్రాహ్మణ్యమున కెల్ల బైఁడిరాశి
దెచ్చి యిచ్చెదవు, వచింపు ద్విజవరేణ్య. 3

మహే.—ఆ. జగతి నేల వెలసి సాక్షాన్మహాలక్ష్మి
సింహపీఠి నధివసించి పేర్మి
నవనిధులను వితరణము సేయుచుండంగఁ
బా అద్దరిద్రమేమి కలుఁగు భూసురేంద్ర? 4

చేటి.—ఈ రత్నరాసులు కూడ వినియోగము చేయుమన్నారు దేవిగారు. [అని అందించును.

---

3. *స్వర్ణాకర్షణభైరవ మనుమంత్రమును. దానిసిద్ధిచే అమితముగా బంగారము దొరకును. †ఇనుమునకుం దగిలించిన అయినుమును బంగారము చేయువస్తువిశేషము. ‡నిక్షేపములను జూపుకాటుక. § మేరుపర్వతమునకు అది యంతయు బంగారము.)

మహేశ్వ.—స్వామీ, బంగారము భారమని యివి పంపినారు. పుచ్చుకొండి మహానుభావులారా. [అని విప్రులకు కుమ్మరించును.

అనువ్వారు బ్రాహ్మణులు.—భార మన్నందులకు దండన యిది. నీచిత్తము. [అని పుచ్చుకొందురు.

ఒక ముత్తయిదువ.—బంగారం మహాలక్ష్మి. ముత్యాలు కెంపులు వజ్రాలు అన్నీ మహాలక్ష్మే, వద్దనరాదు. ఇళ్లల్లోయిన్ని బోషాణాలైనా చాలడంలేదు. వొచ్చిపుచ్చుకోకపోతే, అబ్బో! వైదికుల కెంతగర్వమో అంటారు. ఒకనాడైనా మోయగలిగే లాగయియ్యరు. మాయిళ్లలో కెనగలైనా యిన్నివాయనం పెట్టలేము,

జగదంబిక.—అమ్మ గాదూ, మాతల్లి గాదూ, ఇక వొరశే పళ్లెం, వొకశే. [అని ఒక్కొక్కరికి మరల మరల బలవంతముగా వరహాలు, ముత్తెములు, ఇతరరత్నములును, కుమ్మరించును. ముత్తయిదువలు మూటకట్టుకొందురు.

ఒక బ్రహ్మచారి.—కొండరిపువ్వులరాశివలె ఈవరహాలరాశి గనఁగా కన్నులు నుడి తిరుగుచున్నవి, మిణుమిట్లు గొనుచున్నవి. ఏల మనకీడబ్బు? దీనిని మన మేమి చేయఁగలము?

ఒకఁడు.—పెండ్లిచేసికొమ్ము,

ఆ బ్రహ్మచారి.—దీనికి వ్యయము లేదుగదా, వరదక్షిణాది లాభమే గాని?

ఆ యొకఁడు.—తరువాత యజ్ఞము చేయుము.

ఆ బ్రహ్మచారి.—బళి బళి.

ఒకఁడు.—నేను ఈయేడు నెలల ధనముతో కాశిలో శాశ్వతసత్రము వేసెదను.

,, [అపవారించి ప్రక్కవానితో]

క. తురకలకొలువునఁ దా ని

ర్హారణముగా నీధనమున నఖిలమ్ము న నే

దరిసించి కాశి, రామే
శ్వరుఁ బొడగని, పడయువాఁడ శాశ్వతశుభముల్. 5

ప్రక్కవాఁడు.—[అపవారించి వీనితో] నా యీ సర్వధనముతో,

క. గ్రామగ్రామంబునఁ గా
శీమార్గములన్ హిమాద్రిసేతులు దాఁకన్
దామరకొలంకు లిడెద మ
హామదసైన్యఫలమన్నయతికిం బ్రతిగాన్. 6

ఒకఁడు.—నేను నాకొమార్తను పెండ్లిచేసెదను.

,, ఈదేశమున జీర్ణాలయములు లేవు. నేను పరదేశముల జీర్ణోద్ధారములు చేయించి మాన్యము లిచ్చెద.

,, నేను విద్యార్థులకు షడ్రసోపేతముగా భోజనము పెట్టుటకు, సకలోపచారములు జరుపుటకును, లేనిచోట్ల నెల్ల సత్రములు వేసెదను.

[రాణి ముత్తయిదువులకు నమస్కరించును.

ముత్తయిదువులు.—నీవూ నీప్రాణేశ్వరుడున్నూ కడుపునిండా కడుపెడుపిల్లలను గనుక్కొని ఆపార్వతీపరమేశ్వరులలాగ శాశ్వతంగా భూమి పాలిస్తూవుండండి.

రాణి.—[వామాక్షిస్పందనము సూచించి పురోహితభార్యతో] అవ్వగారూ, నాయెడమకన్ను అదరుచున్నది.

పురో. భార్య, ముత్తై.—శుభం, శుభం, శుభం.

ఒకచేటి.—[పడిపడిగా ప్రవేశించి] దేవీ, దేవీ, ఏలినవారు గడికోట కొచ్చినారు. [రాణి హర్షాశ్రువులతో తనమెడలోనిహారమును చేటిమెడను వైచి, ఆభరణము లూడ్చి దాని కిచ్చును.

చేటి.—[ఆభరణములు గ్రహించి రాణిపాదములకు మ్రొక్కి] తల్లీ, ఇంక జాములో దరిశన మని మంత్రిగారు మనవి చేయుమన్నారు.

రాణి.—[మరల వామాక్షిస్పందనము సూచించి] ఓసి, ఈకంటిసంవాదము లేక అతిప్రియ మగుటచే నీమాటను నేను నమ్మలేకున్నాను.

పువ్వులచేటి.—[ప్రవేశించి] ఇంక 1000 బళ్ల పువ్వులు 100 బళ్ల పన్నీరు, 50 బళ్ల అత్తరు, తమకోసం వస్తున్న వని పువ్వుల శిరస్తాపంతులు చెప్పినారు.

రాణి.—ఓసి, మా వివాహదినముకన్న ఈదినము మాకు ప్రియముగానున్నది. ఈపుణ్యదినమున, మాప్రాణేశ్వరులు మాకు దర్శనమిచ్చు నీమహోత్సవమున, ఆపుష్పాదులను,

క. గంపలు బింకెలుగా నగ
రంపునువాసినుల కెల్లరకు నింటింటన్
బంపక మిడు మని యిచ్చె మా
పంపుగ వచియింపు గంధపాలకుతోడన్. 7

చేటి.—దేవిగారి యాజ్ఞ.

రాణి.—నాకు హర్షాతిశయముచే నేమియు తోఁపకయున్నది. ఈ కల్యాణంబును అత్తగారికి తెలుపుకొని వారి దీవనం బొంది వచ్చి మరల గౌరిపాదములం బూజించుకొని ప్రాణేశ్వరులం గనులఁ జూచెదను.

పురో. భార్య.—మంచిది, రా అమ్మా.

పురో.—పెద్దలందఱకు రాణిగారు నమస్కరించుచున్నారు. మహర్షులారా, ఆశీర్వదింపుఁడు.

వృద్ధబ్రాహ్మణులు.—మాతపఃష్షాంశము వారిక్షేమమునకే గదా!

రాణి.—ధన్యురాలను.

[అని పురోహితభార్యాసుప్తాచేటులతో నిష్క్రమించును.

[పురోహిత తత్పుత్త్రులును నిష్క్రమింతురు.

బ్రాహ్మణకుమారులు.—మనము గడికోటకుఁ బోయి రాజయుగంధరుల పరిభవము చూతము.

వృద్ధులు.—ఈదినము మేము ఈబరువుతో ఇల్లుచేరుట ఎట్లు ?

కొందఱు బ్రాహ్మణకుమారులు.—స్వామీ, ఎట్లయిన మేము మోచెదము తెండి. [అని వారిమూటలు కైకొనుదురు,

వృద్ధులు,—[ఇచ్చి] నూఱేండ్లు బ్రతుకుదురు మీరు.

స్త్రీలు కొందఱు—[పరస్పరము] తొరగారావో, వోయిడో, తొరగారా, యిళ్లకు పోదాం. ఆలశ్యం చేస్తే యీకోజా పీనుఁగుల్లో సుపుగెంజ రాలను. రాజొస్తాడువ, మంత్రొస్తాడువ. [స్త్రీలుపురుషులు అందఱు పరిక్రమింతురు.

ఒకబ్రాహ్మ.—ఓసీ, నామూట నీవు మోసికొని పోదువా? నేనుకూడ గడికోటకు పోయెదను.

బ్రాహ్మణి.—నావే నేను మోయలేకున్నాను, మీవి నేను మోయడ మెక్కడిది?

బ్రాహ్మ.—స్వారస్యముగానే చెప్పితివి.

వృద్ధులు, స్త్రీలు.—నగరు వెలువడుటకే క్రోశమైనది; మేము పరుగెత్తలేము. ఇక్కడ నెచటనేని రవంత కూర్చుండి మేమిల్లు సేరెదము.

[అని నిష్క్రమింతురు.

బ్రాహ్మ.—మనము త్వరగా పోదము రండి రండి. [అని త్వరగా పరిక్రమింతురు.

స్థలము 2. ఓరుఁగల్లు రాజవీథి.

[నేపథ్యమున చాటింపువాద్యము.]

బ్రాహ్మ.—[శ్రవణ మభినయించి] ఏమి చాటింపు?

అంట వెట్టివాఁడు డప్పు వాయించుచు ప్రవేశించును.

బ్రాహ్మ.—ఏమిరా ఆచాటింపు?

వెట్టి.—[ఉచ్చైస్స్వరముతో] సామే, యీయాల పెద్ద మంతిరిగారు ఉగందర దేముడుగారు సాకలాయన పేరాయన్ని ఢిల్లీ నుంచి తీసకొని ఈపట్టం వొచ్చి శేరినారు. [డండండండ] పేరాయన్ని యెత్తుకెళ్లిన తురకోడి బుఱ్ఱ

కొట్టించి తెచ్చినారు. [డం డం డం డం.] ఢిల్లీసుల్తాన్నికూడా తెచ్చి నారు. [అనుచు డం డం డం డం.] మంతిరిగారికి మారాజు కాశీదాక యెదురెల్లి [డం] ఉచ్చవంతో [డం] పట్టంలోకి తీసకొచ్చినారు. మారాజు గారిని పట్టంలోనికి తేనడానికి బేతాళనాయనింగోరుదండుతో ఎదురెల్లి నారు; మారాజుయెల్ల యిభవాలతోటిన్ని పట్టంలోకి వస్తావున్నారు. [డండం] పట్ట మంతా అలంకారం శెయ్యాలిశిందే. [డండండండం.]

[అని వాయించుచు నిష్క్రమి.

బ్రాహ్మ.—త్వరగా పోదము, త్వరగా పోదము. [అని పరిక్రమింతురు.

అంతట ఆకాశయానమున విద్యాధరమిథునము
ప్రవేశించును.

విద్యాధరుఁడు.—ప్రేయసీ, గౌరి తా నేయిచటికి తనభర్తురాలు ప్రతా పరుద్ర మహారాజు పట్టపుదేవి యీశర్వాణి కళ్యాణమును తనకన్నులతోఁ జూచుటకు రాక, మనలం బంపిన దేల?

విద్యాధరి.—ఆర్యపుత్రా, గంగతో మహేశ్వరుఁడు మంతనమాడినది మొదలు గౌరి యలిగి, యిప్పుడె యలుక తీఱె దాయన యనుపలాలనంబుల మునింగి యున్నది. భక్తవత్సల, నన్ను శర్వాణీకళ్యాణమును కనులఁ గాంచి వచ్చి నివేదింపు మని మనయందలి యనుగ్రహాతిశయముచే మన కానతిచ్చి నది. ఆర్యపుత్రా, చూడు చూడు!

క. పుర మెల్లను గ్రీడామం
దిరముగఁ *శైసేఁత వొంది దీపించును. † రా
జ్యరమా ‡ వాసకసజ్జిక
§ యయుత లాలస నెమఁరుసూచుచున్నది విభునిఁ. ౭

౭. *అలంకారము. † రాజ్యలక్ష్మి యనెడి. ‡ పడుకటింటి నలంకరించి తన్నలంకరించుకొని భర్త నెదురుచూచుచుండునాయిక. § గొప్ప కోరికతో.

సరిగాని, ఆ కేమి ఆర్యపుత్రా, నగర మెల్ల వానకుఁ దడిసిన ట్లున్నది !

విద్యాధరుఁడు.—వాన గాదు ప్రేయసీ, పౌరుల మెల్ల, అత్తరు, పన్నీరు, చందనద్రవంబులు, వర్షించినారు.

బ్రాహ్మ.—గడికోట కీదారి దగ్గఱ, ఇటు పోదము.

[అని నిష్క్రమింతురు.

విద్యాధరుఁడు.—ప్రేయసీ, అదె గడికోటలో డేరాలు; జన సంఘము చూడు! మనము నచటికే పోదము. [అని ఆకాశయాన మభినయింతురు.

స్థలము 3. గడికోటకడ తోపులో డేరాలు మొదలు
ఓరుఁగంటినగరివఱకు ఆకాశము.

విద్యాధరి.—ఆర్యపుత్రా, కాశికడ మనము విశాలాక్షీవిశ్వేశ్వర సేవార్థము పోవునపుడు ఆదినము మనకగపడిన యీ మేనాపల్లకీలు ప్రతాపరుద్రునిరాణీవాసముల వని తలంచితిమే. ఇదే మాశ్చర్యము! వానినుండి తురకలు పురుషులు దిగుచున్నారు! ఎవరువారు ?

విద్యాధరుఁడు.—[పరికించి] ఆశ్చర్యమే. అతఁడే ఢిల్లీసుల్తాన్, కడమవారు అతని వజీర్లు. [మరల చూచి నిగిడించి] ఓహో! కడమవారందఱు ఖైదీలు, బంగారు సంకెలలుచూడు.

విద్యాధరి.—ఆర్యపుత్రా, వారి నెవరు ఎట్లు ఖైదుచేయఁగలిగినారు?

విద్యాధరుఁడు.—ఇదంత అల్లవాఁడుగో ఆమంత్రి యుగంధరదేవుని నీతి విద్యావిజృంభితము.

విద్యాధరి.—అటువైపు చూడు మార్యపుత్రా, ఎనిమిదేనుఁగులపై ఒకటే అంబారి వేసినారు. అందులో రాజు, సుల్తాను, ఇద్దఱు రాజమంత్రులు, ఇద్దఱు వజీరులు, మావటీలును, అంగరక్షకులును కూర్చున్నారు. వారాంగనలు వింజామరలు వేయుచున్నారు, ఛత్రము పట్టుచున్నారు.

విద్యాధరుఁడు.—బళిబళిరే ! అష్టగజపుష్పకము ఎంతదేదీప్యమానము! అదె తరలుచున్నారు చూడు.

చ. ఎనిమిది దిగ్గజంబులు రహిన్ వహియించుధరాతలంబుపై,
*దినకరచంద్రభోడుతతిదీపిత † మాకనకాచలం బనన్,
‡కనదురుధాముఁ డేకశిలకాముఁడుఁ, బాదుషహా, బజీర్లు, సం
గనలును గల్గి పుష్పకము గ్రాలు §గజాష్టకనిష్ఠపీఠిపై. 9

విద్యాధరి —అదే మార్యపుత్రా, వారు తరలఁగానే ఆ యాశ్చర్యము !

క. నెరయా రెండఁగ, సంపెఁగ
విరిజడి యన, సంజమొగులు విఁగి చిద్రుపలై
ధరఁ బడె నన, బంగరుమల
కరఁగి కురిసె ననఁగ, నింగి కడుఁ బసుపయ్యెన్. 10

విద్యాధరుఁడు.—మద్దరాలా, అది వాస్తవముగా సువర్ణవృష్టియే, పేదల కొఱకు రాజాధికృతులు కురియుచున్నారు.

విద్యాధరి.—[సభయము] ఆర్యపుత్రా, ఏమి అటువైపున ఆ రక్తవర్షము!

విద్యాధరుఁడు.— ఓసీ బేలా, రక్తవర్షము కాదు, రత్నవర్షము. అచట బ్రాహ్మణ జనము, వారికై మహామంత్రి కురియించుచున్నాఁడు.

విద్యాధరి.—ఆహా! అ దేమి రోహణశృంగపాతమువలె నున్నది!

విద్యాధరుఁడు.—

సీ. చూడుచూడుము దవ్వుఁజాడ్కికి వీ డెల్ల రేఁగుతేనియగూఁటిరీతి నొందె.
నీనుచున్నవి చూడు మిండ్లయోడులు చెట్లయాకులు నరుల నారీకులముల,
వనితలపలువన్నెవలిపంబులఁబురంబు కలయఁబూచిన *కానకళ వహించెఁ
బరగుఁ జూడుము †కేతుపట్టికాతతి నింగి సకలజాతి ‡విహంగనికరమనఁగ.

---

9. *సూర్య చంద్ర నక్షత్ర తారా సమూహ ప్రకాశితము. †పసిండికొండ(మేరువు). ‡వెలుఁగుచున్న గొప్ప తేజముగలవాఁడు, ఏకశిలకాముఁడు=ఏకశిలానగరియొక్క మన్మథుఁడు, ప్రతాపరుద్రుఁడనుట. §ఎనిమిదిఏనుఁగుల పైనున్న యంబారిలో.

11. *అడవియొక్క శోభను. †జెండావస్త్రముల సమూహము. ‡పక్షి సమూహము.

తే. వచ్చుకొంతుఁ గవని మెదఁ గ్రుచ్చుకొనఁగ
నగరి తమి మీఁద మెడ యోర్వ వ్రేఁగఁ బెనఁగ,
నేల నిరసించి జన మెల్ల నింగిఁ జేరెఁ,
గనవె *యనిమేషదృష్టి నీ †జని ఫలింప. 11

విద్యాధరి.—ఊరెల్ల నేల విడిచి నింగిని సాముచేయుచున్నది.

విద్యాధరుఁడు.—జూడు ప్రేయసీ, చూడు, అప్పుడే నగరప్రవేశ మునకు వరుస దీర్చుచున్నారు.

విద్యాధరి.—[దేనిమీఁదనో బద్ధదృష్టియై అనాకర్ణితముతో, భీత్యాశ్చర్యములతో] అదేమి ఆర్యపుత్త్రా? ఒకతలకాయను పామువాటి వెదురుగడ కొనకుఁ గ్రుచ్చి, అగడ నొకబండిలో నాటి ముందు నడపించుచున్నారు!

విద్యాధరుఁడు.—అది మనవిద్యవలనఁ దెలిసికోవలసియున్నది [ఆలోచించి] అది యీరాజును కొనిపోయిన వలీఖాని తలకాయ, యౌగంధర దేవుని తంత్రమువలన దేహమునుండి వేఱయినది. "చాకలిని గొనిపోయిన వలీఖానుసర్దారునితల" అని దానికి కొంచెము క్రింద పటమున పెద్దయక్షరముల వ్రాఁత యున్నది చూడు.

విద్యాధరి.—ఆహా! యౌగంధరా!

విద్యాధరుఁడు.—చూడు ప్రేయసీ, వానివెంట నగరప్రవేశ వ్యూహమును, ముందు భేర్యాదివాద్యములు, గుజ్జుపుదండు, మరల వాద్యములు, కాలిదండు, ఆహా! యేమి యీవాద్యముల వీరరసోద్బోధనము!

విద్యాధరి.—ఆర్యపుత్త్రా, నాకు చెవుల కమృతమైనను, హృదయమునకు భయముగా నున్నది.

విద్యాధరుఁడు.—చూడు, చూడు, వెంట బజంత్రీల మహానాటకములు, వెంట వారాంగనా శాలాశకటములు.

విద్యాధరి.—ఏమి యీ వాద్యనాదామృతము! ఏమి యీనృత్యోత్సవము!

---

* తెప్పపాటు లేనిచూపుతో. † జన్మము.

విద్యాధరుఁడు.—వెనుక పేరిగాని కంకరగాడిద, వానిచుట్టు చాకలి పటాలము.

విద్యాధరి.—ఏనికి పట్టినది రోగము.

విద్యాధరుఁడు.—వెనుక మహాశకటంబున అల్గోజా, సుతి, మృదంగాదికము, వారాంగనానృత్యములు.

విద్యాధరి.—ఈ దూరశ్రవణమునకు ఆనాదములు చల్లఁగా నిద్ర గొల్పుచున్నవి.

విద్యాధరుఁడు—వెనుక తురుపులు.

విద్యాధరి.—ఆవెనుక అష్టగజపుష్పకము.

విద్యాధరుఁడు.—ఆవెనుక అన్నియు విలోమముగా యథాపూర్వము, చాకలి తక్కువ. చివర ... [అనఁగానె సగములో,

విద్యాధరి.—చివర ఏమిది! తాటిచెట్టునంత మానిసిని బండిలోఁ నిలువఁ బెట్టినారు!

విద్యాధరుఁడు.—ఖుస్రూఖానుదేహము, నాలుగుమాసముల క్రింద ఢిల్లీలో వీనిని వలీఖానుఁడు తల కొట్టినాఁడు.

విద్యాధరి.—ఇదియు ఆ యౌగంధరుని తంత్రమే?

విద్యాధరుఁడు.—అవును.

విద్యాధరి.—మఱి ఆర్యపుత్త్రా, ఆయౌగంధరుఁ డెక్కడ?

విద్యాధరుఁడు.—[కలయం బరికించి] వాఁడుగో, ఎవ్వరు లేని యూరిబయటి రథ్యలో ఏకాకిగా గుఱ్ఱముమీఁద కోటకు పోవుచున్నాఁడు.

విద్యాధరి.—ఇతని మార్గములు దుర్బోధము లార్యపుత్త్రా.

విద్యాధరుఁడు.—ఓహో ఊరేఁగింపు కోట చేరినది.

సీ. రాజవీథిని జూడు 1రాజీవగంధి, యా 2శంపాతనుల తత్తఱంపు సొంపు.
కిటికీలఁ జూడుమీ కేరిక్రిక్కిఱిసిన మోముపెందామర మొగ్గరములు.

---

12.—1. పద్మములపరిమళముగలదానా. 2. మెఱపుఁదీగవంటి దేహములుగల స్త్రీలయొక్క.

రాజా చూడ్కికి నంద రమణీ, చూడుము వారి కనువిచ్చువిలసనల్కులికివగలు,
సింగారి చెద్దుముల్, చిన్నారిటక్కులు, గుజరీలాజవర్షముల్గురియూహలాయలు,
తే. కను దవ్వులుదాఁక ఘూకాంతుఁ గాంచి, దాఁటి,
చప్పఁగన్నయి, జడ నయి, యొప్పు జాజి,
4వెమ్మ దాఁకిన కప్రంపు బొమ్మ లనఁగ,
లోఁగిళుల కాయుకటు లేఁగు లాఁబుఁదవనము. 12

క. అరమెయి దోఁపఁగ, ముక్తా
భరణము 1లఁఱ, జేనిఁ గన ధవళసౌధముఁన
బెరసెడు సీతరుణుల కా
2హరిఁ జూడఁ 3బయోబ్ధి లేచు నచ్చర లెనయే? 13

ఉ. వారక 1ఘర్మబిందువు లవారిగ నొక్కట రాలఁ, గ్రొచ్చి వే
హారపుటాణిముత్తెము లహంయుత నోయన రాలఁ, గైశ్యపుం
జారుసుమాళి రాలఁ, గడసారికి జేపఘు వాప్రసత్త కా
చారపులాజదోసిటిని జాజిచి మానముఁ గాచెఁ గోమలీ. 14

క. 1ఆలోకము లెద ముడి యిడి,
2లాలస దారంబుగా, 2నిలాపతి మేనన్
గీలించి, మదనుఁ డాడెడు
గాలిపడగ రైరి పౌరకాంతలు తరుణీ. 15

---

12 3. పేలాలు చల్లుట. 4. వేఁడి.

13.—1. ఉఱన్—ఒప్పఁగా. 2. నారాయణుని. 3. పాలసముద్రమునందు.

14.—1. చెమట. అహంయుతన్=పోటిచేత. కైశ్య...ళి—కేశసమూహముయొక్క యంద మయిన పువ్వులసమూహము, జేపఘువు=వడఁకు. ఘర్మబిందాదులు రాలుట లాజలు రాలుటగా నితరుల కగపడె నని భా.

15.—1. చూపులను. ఎదన్=హృదయమును. 2, ఖిన్నుటంపుఁ

విద్యాధరి.—ఆర్యపుత్రా! నీచూపు నేమి అక్కడ గ్రుచ్చివైచితివి? ఓహో! చెవులుకూడ కనుమన్నవా? [ఊఁపి] స్పర్శముకూడ? [కని] అహో! ఏమీరూపము! ఏమి పతిమీఁది యీమనోభావము! ఆర్యపుత్రా, [అని విద్యాధరుని ఊఁచుచు] ఆ కిటికీలోని యీయేకవేణీధరను రాణిని శర్వాణిని కనుచున్నావు; నీయోగ్యతను గౌరికి తెల్పెదనులే. [అని లాగును.

విద్యాధరుఁడు.—అబ్బ! ఏల నన్నట్లు లాగితివి! [విద్యాధరి మఱియొకవైపు చూచును] ఇదిగాక మఱి ఎవరు నన్ను లాగినవారు? [కలయంగని] నీబుద్ధిమాత్ర మేమైనది? రాజును జూచుచున్నావు! పుష్పకము దిగి, మేడయెక్కి పరివారమధ్యగతుఁడై రాజు నీకు నేత్రోత్సవ మొసంగుచున్నాఁడు! మఱి యిటు చూడవా? నీచెవులు పోయినవా!

[అని విద్యాధరిని ఊఁపును. విద్యాధరి అనాకర్ణితకముగా అట్లే చూచును.

విద్యాధరుఁడు.—పరివారమునకు సెలవిచ్చి, రాజు, ప్రతీహారి దారిచూప, నంతఃపురమునకుఁ బోవుచున్నాఁడు. అతఁడు దృష్టిపథము దాఁటినపిమ్మటనైన దీనికి చైతన్యము రాదేమో చూచెద. ఆహా! రాణి శర్వాణి సఖులగా ముమ్మడమ్మవెంట రాజుకడకు వచ్చినది. ఆ యేకవీరుఁడు యుగంధరుఁడును రాజుతో నున్నాఁడు. ఇది యిట్లే చూచుచున్నది. [అని విద్యాధరి కన్నులు మూసి] రాజునకు ముత్తయిదువులు ఆరతి యిచ్చుచున్నారు.

---

గోరిక. ౭. రాజు రెండుకన్నుల రెండుచూపులును హృదయంబు ననునీమూఁడును మూఁడు సూత్రములుగా ముడివేయఁబడినవి. కోరిక పొడుగుపాటి సన్ననిపురియైనది. కోరికతో చూచుచున్న యీ నగరిస్త్రీలు గాలి పడగ లయిరి; మన్మథుఁడే ఆగాలిపడగలను రాజు దేహమునకు (ఇంటిచూరునకో నిట్రాటికో కట్టినట్లు) కట్టిపెట్టి చిత్రము చూచుచున్న క్రీడాపరుఁడు.—ఎల్లస్త్రీలును కోరిక మీఱ రాజునే చూచుచుండి రని తా.

విద్యాధరి.—[కొంచెము కోపపడి] చేతులు త్రోసి, ఏమి ఆర్యపుత్త్రా? ఏల నాకన్నులు మూసితివి?

విద్యాధరుడు.—ఎందులకా! గౌరి యెదుటనే చెప్పెదనురా నీ యోగ్యతను.

విద్యాధరి.—[చింతించి, స్మరణ మభినయించి] నీయోగ్యతను నేనును చెప్పెదనురా శాంభవితో.

[అని శర్వాణిని విడుచు, రాజును, రాణియు చూచుచు నిష్క్రమింతురు.

స్థలము 4. నగరు.

అంతట రాజు, యుగంధరుఁడును, రాజమాత, ఏక
వేణీధర రాణి, బాలుఁడును ప్రవేశింతురు.

రాణి.-[ఆత్మగతము] నిద్రలోఁ గానియెడల నాప్రాణేశ్వరు నెవరు వంచింపఁగలరు? ఆహా! ఎంతకాలమున కార్యపుత్త్రు లీకన్నుల కగపడుచున్నారు!

యుగం.—[రాజును కేలఁగొని రాజమాత కప్పగించి] అక్కగారితో నాపలికినమాటను జగదీశ్వరుఁడు నెఱవేర్చినాఁడు.

[రాజు తల్లి పాదములకు ప్రణమిల్లును.

అమ్మ.—

ఉ. నాఁడు మహేశ్వరుండు కరుణాపరతన్ వర మీయ ప్రీతి యై
పోఁడిగ నాదుగర్భమునఁ బుట్టితి వంటది బొంకు సుమ్మి కన్,
నేఁడు యుగంధర ప్రభుఁ డనిద్రకృపన్ వర మీయ ప్రీతియై
పోఁడిగ నాదుగర్భమునఁ బుట్టితి వంట నిజంబు పుత్త్రకా. 16

వత్స, చిరంజీవ.

రాణి.—జయము జయ మార్యపుత్త్రునికి.

[అని రాజుపాదముల పువ్వులు చల్లి కన్నుల నద్దుకొనును.

రాజు.—ప్రేయసీ, వారిపాదములకుఁ బ్రణమిల్లుము, వారుచేసిన సౌభాగ్యవతివి.

[రాణి యుగంధరుని పాదములకు ప్రణమిల్లును. చేటి పువ్వులు ముత్తెములు బంగారపుఁ దట్టలో తెచ్చి యుంచును. రాణి వానిని దోసిళ్లఁగొని యుగంధరుని పాదముల బోయును.

బాలుఁడు.—నాయనగారిపాదాలకు నమస్కారిస్తున్నాను.

[అని ప్రణమిల్లును.

రాజు.—చిరంజీవ. నాయనా, తాతగారి పాదములకు నమస్కారింపుము.

[బాలుఁడు యుగంధరుని పాదములకు మ్రొక్కును.

యుగం.—వత్స, చిరంజీవ.

[రాజు బాలుని అంకమునఁ గూర్చుండఁ బెట్టుకొనును.

బాలుఁడు.—బాబయ్యగారూ, తాతయ్యగారుకూడా, అప్పుడు నేనూ, అమ్మగారూ, అవ్వగారూ, అందఱంపోయి అడిగినప్పుడు తమదర్శనం మాకు కలగజేసినారుగారు.

రాజు.—నాయనా, వారు సెలవిచ్చినప్పుడుగదా నీవు దర్శనము చేయవలసినది ?

బాలుఁడు.—అవును.

మమ్మ.—తమ్ముఁడు, అప్పుడా గాదంటివి. ఇప్పుడు చెప్పుము, నీఋణమును మే మెట్లు తీర్చుకొందుము ?

రాజు.—అమ్మా, తీర్చుకొనుట యెక్కడిది? జన్మజన్మమందును,

క. వారే రక్షకులుగ మన
మే రక్ష్యులముగను నిట్టియిడుములు మనకుఁ
జేరక యుండఁగ నీశ్వరు
నారాధింపంగవలయు నమ్మరొ సతముఁ. 17

బాలుఁడు.—మనము తాతగారిని ఇలువేల్పుగా గొలవవలెకిందిగదా.

రాజాదులు.—బళిబళి, పుత్త్రకా! [అని వానిని ముద్దుగొనుదురు.

యుగం.—అక్కగారూ, మనకు పరస్పరము ఋణానుబంధములు తీఱఁగూడదు గదా.

ముప్పురు.—[కేలు మోడ్చి] మాకు వర మిది.

రాజు.—నాయనా, నీవుకూడ చెప్పుము.

బాలుఁడు.—[కేలుమోడ్చి] మాకు వర మిది.

యుగం.—ఇఁక మీరు సుఖం బుండుఁడు. నేను మిగత యేర్పాట్లు విచారించికొనియెద. [అని లేచును. ఇతరులు నిష్క్రమింతురు.

యుగం.—[పరిక్రమించుచు సవిమర్శము] ఏర్పాటులన్నియు తమ్ములు జరిపి నాకై యెదురుచూచుచుందురు. [సోపానావరోహణము నటించుచు పరిక్రమించి] వీరుగో తమ్ములు, చెకుముకియు. ఓహో! చాకలియు, వేసడము పై ఆజ్ఞకై వేచియున్నాఁడు.

స్థలము 5 ఓరుఁగల్లు, వీథి.

అంతట చాకలి సపరివారముగా ప్రవేశించును.

పేరి.—[కేలుమోడ్చి] దండం సామే దండం!

యుగం.—సుఖ ముండు.

పరివారము.—[కొందఱు కేలుమోడ్చి] యీాయనకికూడా వూరేగింపు అయ్యింది సామే. [కొందఱు తమలో తాము నవ్వుకొనుదురు.

యుగం.—మీరు వీనిని ఈ వేసడముమీఁద నే వీని యిల్లుచేర్చి, మేము వానిని తెచ్చి యిచ్చితి మని, మామాటగా వాని పెండ్లాము ఎల్లితో చెప్ప వలసినది. పొండి.

పరి.—చిత్తం మహాప్రభో.

యుగం.—[ఆత్మగతము] నేను నాతమ్ములం గలసికొని యింటికిఁ బోయెద [పరికించి] ఓహో! వీరితో విశ్వాసరావుకూడ నున్నాఁడు. ఇతనిని వారముదినములు దేశోత్సవము జరిపి లెక్క రాజసభలో చదువు మని యాజ్ఞాపించెదను. [అని నిష్క్రమి.

పరి.—[పేరిగానితో పరిక్రమించి] యిల్లిదుగో యీడిల్లు, అల్లదుగో నిచ్చె వేసుకొని గోడమీద సిక్కి యెదురు సూస్తున్నది యీడి పెళ్లాం.

[పేరి. నోరు తెఱచి ఆనందముతో చూచును. అందఱు పరిక్రమింతురు.

పరి.—యిక దిగవోయి సొతలి మారాజా.

స్థలము ౭. పేరిగాని యిల్లు.

అంతట ఎల్లి ప్రవేశించును.

[ఒకముసలి చాకలిది ప్రవేశించి ఎల్లిని పేరని కలయ నిలిపి ఎఱ్ఱనీళ్లు వారి మొగములకు దిగఁ దుడిచి పాటఁ జో యుఁను. పరిజనులు పేరిగానితోఁగూడ కూర్చుందురు.

పరి.—ఎల్లీ, పెద్దమంతిరిగారు నీతోటి శెప్పమన్నారు. అరు, పెద్ద మంతిరిగారు యీణ్ని తెచ్చి నీకిచ్చినామన్నారు; మమ్మల్ని వొప్పగించ మన్నారు. మేం వొప్పగించినాం.

ఎల్లి.—దండ మామారాజుకి, ఆరిపేరు తలుసుకొంటా బదికున్నా న్నాలూ. బతికొచ్చినావా మామా! ఏం కట్టపడ్డావో, మామా! మామా, కూడుతింటావా ? నీకోసంవొండి నీకెట్టితినాలని కనిపెట్టుక్కూకున్నా, పువ్వులు, గెందం, *వోసననీలు, † వోసననూని, రాణీగారు పంచిపెట్టించి నారు. అన్నీ నీకోసం యెట్టుకునున్నా.

[అని తెచ్చి పువ్వులదండలు అందఱకు ఇచ్చును. చాకళ్లు కొందఱు మెడలో వేసికొందురు. కొందఱు జుట్టునకు చుట్టుకొను దురు. ఎల్లి పేరిగానికి చుట్టును. పన్నీరు తెచ్చి అందఱకు ఇచ్చును. చాకళ్లు దానిని త్రాగుదురు.

పేరి.—[పకపక నవ్వుచు] ఓరి యెఱ్ఱిమొకొల్లారా, అది మీద సల్లు కోటమేగాని తాగటం గాదురా!

[ఎల్లి అత్తరిచ్చును. చాకళ్లు జుట్టునకు పూసికొనుదురు.

---

* పన్నీరు. † అత్తరు.

పేరి.—[పకపక నవ్వుచు] అది గుడ్డలకి రాసుకోవటమేగాని జుట్టు కెక్కదురా యెఱ్ఱిమొకోల్లారా.

ఎల్లి.—నీకోసం అనుబుసిలు కూడా తెచ్చినాను, లే మామా లే కూటికి. నంజుడు గూడా శేశినా. కులం వోళ్లకంతా మాపటికి యిందు శేతా మని అంతా సిద్ధం శేసినా. అంపటికి కూడిక వొండిస్తా.

పరి. ముసలిదియు.—లేరా పేరయ్యా లేరా, లెండి తిను. పాపం! అది నీకోసం పడ్డాపాట్లు కతలు రామాండాలు పురాండాలు [ఎల్లితో] తీసకొచ్చి యీడెట్టే.

[ఎల్లి కంచము తెచ్చి పెట్టును.

పేరి.—ఇదేం కూడే వొలే! నాకే ముంగటిమాటలే నోటికి రావటం లే. యిందుట్లో *దూడప్పేడేదిలే? †బఱ్ఱిప్పేడేది? అయి లేకుండా నాను కూడు తిన్ను. [సారాయి చూపి] యీనిలకి మొగం వాశిపోయినాన్రా. ఇయి మాత్తరం తాగేస్తా. మీరుకూడా అందొరు కొంచెం నీ లుచ్చుకోండోయ్.

[ముసలిది పరివారమునకు ధారాళముగా కల్లు సారాయి పోయును, ఎల్లి పేరాయకు ఇచ్చును.

పరి.—దూడ పేడేంట్రా పేరయ్యా, కూడు తినక? బఱ్ఱిపేడేంటి?

ఎల్లి.—[ఆత్మగతము] మామ యెక్కవతాక్కుండా మానుకోవాల.

పేరి.—ఈబాపన నాయాళ్ల శేతుల్లో బడి సచ్చినానురా నాయినా. ఎల్లంశేటే సంపేస్తామన్నారు. ఒకపాలి మూడు రోజాలంట సంపేశుంచినారు.

ఎల్లి,—ఓరు మామా? ఓర్ని మామా?

పేరి.—ఓరా, బోపననాయాళ్లు; నన్ను.

ఎల్లి.—తురకోళ్లుమామా.

పరి.—తురకోళ్లురా పేరయ్యా.

పేరి.—బాపనోళ్లే, బాపనోళ్లే, బాపనోళ్లేరా సాకలోళ్లలారా.

పరి.—నీకేం మతి పోయిందంట్రా!

---

*దూడ్ఫేడా † బర్ఫీ, అనునవి భక్ష్యవిశేషములు.

పేరి.— [మాధ్యమాధ్య త్రాగుచు] యీ బుద్ధిగడ్డి తినెల్లిందంట్రా? బాపనోళ్లు బాపనోళ్లు, అల్లు సంపేస్తాగన్నారు, మూనాలు సంపేశినారు. నాకు జంజెం యేశినారు, యీపంతా గొలుసులే. అని బాపనోళ్లేసుకునేది దంజెం. అ వేసుక్కుంటే చచ్చిపోరా మా వాకలోళ్లమే? ఛీఛీ! అది కాదు మాట, సదువు సన్నోళ్లమే? ఛీఛీ! అదీ నాదు, మీకు సదు వెక్కడిది? పోనీ, అద్దదీ అదీ నాబయ్యం, అల్లని బాగా యేడిపించినా; అల్లు తేరంటే దంజెం తీశేవోణ్ని, అల్లుమాస్తే యేశేవోణ్ని. [నవ్వుచు ఎడమచేయి చూపి] యీ శేతిమీద యేసుకోమంటే [కుడిచేయి చూపుచు] యీ శేతిమీద యేసుకోవటం, సరదంగాల కాడ కాయి ఘుంపరికి తొయ్యమంటే యినక్కతొయ్యటం, బాగా యేడిపించినాన్రా.

పరి.— పేరయ్యా, ఏంట్రా యీ యెఱ్ఱిమాటలు, కూడుతిన్రా. మాకేం తెలటంలేదు, దంజె మేంటి, సరటంగా లేంట్రా, నీ మొకం?

పేరి.— మీకు తెల్దు. యింకొంచెం నీ లుచ్చుకోండి అంతా తెలస్తది.

[అని నవ్వుచు త్రాగును. అందఱు నంజాళ్లతో త్రాగుదురు.

పరి.— శెప్పరా పేరయ్యా, నువ్వు యీ యెనిమిది నెల్లు బతికినయిదం, గతికినయిదం, సతికినయిదం.

పేరి.— యిదే యిదం, యిదం యిదే. నాకు యేమి దుస్తురా? యేమి నగలురా! అంతా బంగారం రతనాలే. యిందుకే ఆ మారాజుల్ని తలుసుకోవాల. తలుసుకోంటే గప్తికొస్తారు. నన్ను దేశమంతా తిప్పినారు. నాను యక్కడికెల్లినా వోంబాయి, వోంబాయి, వోంబాయి.

ఒకఁడు.— సవారి మోయించినారంట్రా నీశాత?

పేరి.— బద్దరం, నాను మోయటమేం? నాకు మోయటం? కవద్దాల్! నా నెక్కడి కెల్లినా యేనిగమీదే. నాకు అచ్చలు అచ్చలు దండు పడాళ్లు అందోరు దండమే. నా నెల్లినకాడంతా బేరీ, డంకా, నగరా, నౌపత్తు, యింకా యేంటేంటో మియ్యబ్బనాడైనా మీ రెరుగుదురంట్రా! [అనినవ్వను.

నారిగాఁడు.—ఈణ్ణొట్టు కెల్లినాడే ఆసాయేబుకి సలాములు శేస్తే సంకెళ్లల్లో వున్నా యీ మొకం తన కనుకున్నాడ్రోయ్. ఆయేనికమీద తురక పడాలుకి యీడుకాళ్లు గుద్దతా వుండోడు గావాల.

[అని హేళనముగా నవ్వెను.

పేరి.—[కోపముగా] మరి నాను శెప్పను. యీరేమయినా సూసినాడా? నాను కాళ్లు గుద్దతా వుండగా యీడు సూసినాడా?

మఱియొకఁడు.—లేదు లే. శెప్పరా శెప్పు. నారిగాడి కైపుకూతల్లే.

[నారిగాఁడు ఊఁగుచు వినును.

పేరి.—గుడి గుడికీ యెల్లినా; నా నెల్లిన సోటంతా చటకోపాలే.

నారి.—నీకోపం నన్నేం శేస్తదిరా? నాకోపా లెరగవు.

సుబ్బఁడు.—[కైపుతో] వోడికిరా కోపం? వోడికో శెప్పు, నాను సంపేస్తా.

కొందఱు.—వోడికీ లేదురా సుబ్బా, కూకొని యిను.

సుబ్బఁడు.—నా కోప్కపమొస్తే చటకోపం గాదు, చట చట చట చట కోపం. సూసోక నాతమాసా. సచ్చిబతికొచ్చిన పేరయ్యమీదంట కోప మంట!

కొందఱు.—శెప్పరా పేరయ్యా, మా కేమి తెలటం లేదు.

పేరి.—పెసాదాలు! పెసాదాలు! ఒకటి మరికినా!

కొందఱు.—యేంట్రా?

పేరి.—ఆ చటకోపం నంబాశార్లు అయ్యవోర్ల వోరు, పూజారయ్య వోర్ల వోరు మారాజులబుర్రమీ దెట్టేది. నాబుర్రమీ దెడితే నాను తియ్యొద్దని జగడమాడేవోణ్ని [ఆత్మగతము]యీళ్లతో యేమి శెప్పినా నమ్ముతారు నాయాళ్లు. [ప్రకాశము] దాన్ని నెత్తినేసుకొనే పెసాదాలు తినేవోణ్ని, వొక తమాసా, యెందుకుంచోరు నానెత్తిమీద* శెప్పు సూతాం నాయాళ్లు?

*వచింపుము—అని పేరిగాని యభిప్రాయము.

శ్రోతలు.—మా కేం తెలటం లేదురా *శెప్పేందు కుంచోరో.

†నారి.—బుద్ధి రావటాని కుంచినార్రా.

పేరి.—వోరికిరా బుద్ధి రావటం?

నారి.—నీకు గాదురా.

పేరి.—అలా కూయి. మీరినండ్రా; కైంకర్యం కైంకర్యం? నాను కైంకర్యం శేయించలే? మానాన్య లీలే? గ్యామా లీలే?

శ్రోతలు.—మాకేమి తెలటం లేదు, శెప్పూ శెప్పూ.

పేరి.—నాముంగల బోగంవోళ్లు ఆట్టం, నాకు దండం. వోళ్లుగాని నాముంగటికొస్తే నాకు పండం. యెత్తే నాకు దండం.

శ్రోతలు.—మోము కౌగడాలట్టి కూళ్లే? అయి నీకు నాకు యెట్టే దండాలుగావోయి, ఆటలో యేట్టే దండ్యాలు,

పేరి.—మరైతే నాను శెప్పను.

శ్రోతలు.—శెప్పరా శెప్పరా, మాకు తెలటం లేదు.

పేరి.—యీపాలి నన్నెక్కరించి నోణ్ని యేనిగమీదినుంచి కిందిక్కి తోశేస్తా. ఒకనాఁడు, యీబాపన మారాజులు, యిందుకే ఆళ్లని తల్సుకో వాల, 'పేరిగా పేరిగా దూడపేడ తింటావా?' అన్నారు.

కోడిగాఁడు.—దూటపేడకి తల్సుకోవల్సిందేరా! వవ్వా! యెట్టి బుఱ్ఱ కెక్కిందిరా!

మఱియొక శ్రోత.—ఊరుకోరా పలక్క కోడిగా.

పేరి.—[కైపుతో]నాను శెప్పనే శెప్పను. యీణ్ని గెంటెయ్యండి.

[ఇతరులు అట్లే చేయుదురు.

పేరి.—'అత్తినిపిస్తారా మారాజా నాఁశాత' అని నా నేడవటం' ఆళ్లు యెవరికడుపు లాళ్లు పిసుక్కొంటా నవ్వటం.

---

* శ్రోతలు కొందఱు శెప్పనఁగా పాదరక్ష యని తలంచినారు.

† నారిగాఁడు శెప్పనఁగా పాదరక్ష యని తలంచినాఁడు.

కోడి.—వొకరి కడుపు వొకరు పిసికితే గవంట్రా నొప్పి తీస్తది. మళ్లీ బ్యామ్మలంటావు. తురకోళ్లురా, ఆళ్ల తెలివయంతే.

సుబ్బఁడు.—నీ తెలివి కాలా సస్తార్రా ఆలా శేస్తే.

పేరి.—వవ్వా, వవ్వా, అల్లా శెప్పతో కొట్రా * నాయాలిని.

† కోడి.—ఎల్లి, యీమద్దని తన్నులు లేకుండా వున్నావు. రాయే, అన్నీ వొక పాటే తిను.

నారి.—దాన్నెందుకురా కొట్టబుంకే? అదేం శేసింది?

పేరి.—వవ్వా! వవ్వా! నాజడ్డి? నాజడ్డి!

ఇతరశ్రోతలు.—దూడపేడ తిన్నావా? శెప్పరా అది.

పేరి.—అదా? అబ్బాపనో పెట్టిందా? మరిశినారా. అవున్రా. అపాట్కా ఆళ్లు 'తిని సూడ్రా యెట్టివుండాకాదకా' అని నాకూట్లో యేశినారు. పెద్ద కంచం యెట్టించోరు మారాజులు! ఆకంచానికి ఆ పెట్టిన కూటికి ఆళ్లని బతికినన్నాలు తల్సుకోవాల.

కోడి.—దూడపే డెట్టినందుకు మాత్రం తిట్టాలా.

పేరి.—దూడపేడకే తల్సుకోవాలా.

కోడి. నారి.—వవ్వా వవ్వా, యెట్టి బుద్ధికెక్కింది! యలా తిన్నావురా పేడ?

పేరి.—యిదుగో శెప్పుతా యిను సాకలినాయాలా. [నవ్వుచు] దూడపేడ యిరవకుండా కాలిస్తే ఆయెలిబూడిదుంటదే అలా వుంది. పచ్చిది గాదు గధా అనుకొన్నా. యెలిబూడిద తిన్నేను మారాజా అని యేడిశినా.

ఒకఁడు.—ఆయెనక ఆయెనక?

[అని కైపుచే పడి, వక్త పలికినప్పుడు పలుకనప్పుడునుంగూడ, చాలసేపు ఊఁకొట్టును.

---

* 'నాయాలిని' అని పేరయ్య కోడిగానిని తిట్టుట. † 'నాయాలిని అన్నమాటకు 'నాభార్యను' అని కోడిగాడు హేళనమునకై పెడయర్థము చేసినాఁడు.

పేరి.—ఆయొకడ దవ్వంత నిట్లో యేస్కొమన్నారు. కొంచెం గిల్లి యేస్కున్నా. మఱియింక నారంగా! ఆ శిపి నా నేమిశెప్పుదును! నోరంతా మదనం, వొళ్లంతా మదనం, పళ్లంతా మదనం కళ్లు శెవులు ముక్కంతా మదనమే. ఆళ్లకి దండాశెట్టి, ఆ దంతా తిన్నా. తిని ఒక తమాసా శేశినా.

ఒకఁడు.—యేంట్రా ఆ తమాసా?

పేరి.—'మారాజా దూడ పేడే యింత మదనమే, ఆవు పేడ, ఎద్దు పేడ, బఱ్ఱపేడ, దున్నపోతు పేడ, అన్ని యెట్టుండిసామే, మీకు దండా లెడతా. నాకు పేడేయెట్టుండి కూడొద్దు.' అన్నా. అరు సాకలోడికి ఖుయ్యన్ని యెడ తామా, అని బఱ్ఱపేడ మాత్రం యెట్టోరు, నాను తీనోణ్ని. పేడ లేని కూడు నాను తిన్ను. [ప్రష్ట కన్నులు మూసికొని ఊఁకొట్టుచు పడిపోయి మరల మరల ఊఁకొట్టును.

కోడి. నారి.—యెల్లి, నూ కూడా యీదిలో కెల్లి యింత పేడ తెచ్చి యెయ్యి, యెఱిముండకొడుక్కి నీకు దండ మెడతాడు, కూడు తింటాడు.

పేరి.—ఆ! ఆ! ఆ! నన్ను యెఱ్ఱిముండకొడు కంటావు? సాకలి నా యాలా! నా నోఱ్ఱా? ఓ రనుకొన్నావ్రా? నాను పెత్తాత మరడ మగారాజుని పెత్తాతమరద మగారాజు ననుకో. బద్దరం! బద్దరం! కవద్దాల్!

కోడి.—మఱినానో, దొనెకదుపురాకొశి ననుకో. బద్దరం! బద్దరం! కవద్దాల్.

నారి.—గాడిదమీ దెక్కిస్తె యీడు మాగొప్పనుకొన్నాడ్రా. నానైతే తోక్కితాటాకు కూడా కట్టించుకోనా, బోగమ్మవోరిలాగ!

కోడి.—నాను బుఱ్ఱ డెక్కించుకొని సున్నబొట్లు పొడిపించుకోనా సన్నా సయ్యలాగ?

సుబ్బ.—నా రుమాలు యెంక డెత్తుకెల్నప్పుడు నాకోపాలి గాలేదా యీరెండూని? మీయబ్బతోడు మీకొస్తదా! [ఇద్దఱు పడిపోదురు.

కోడి.—నాను గోశెపట్టుకొని హజా గలక శేస్తా, యీళ్ళి నెయ్యాటను మూతాం.

నారి.—నాతో చరినా సున్నం నెయ్యి మను వోడు శేస్తాడో.

సుబ్బి.—నాను కొటంశెడ్డని బద్దరం.

కోడి.—నాను పాతరాజుని బద్దరం. కవడ్డాల్,

నారి.—నాకైతే యీలాంటోళ్ళకి గోడం దండోయించుకోనా సమువులయ్యా వోరిలాగ?

ముసలిది.—నానో త్ర? నాను సోశేరమ్మను గానా? యెల్లండ్రా యెల్లండి, తాగుబోతులం కెకొడుకులు, యింటి కెల్లండి. పేరయ్యా, నూ లోనికి రారా, యీళ్ళని పొమ్మని తలుపేస్తా.

పేరి.—నూ పొలి పేరమ్మ వైతే పొలిమేర కొడికెల్లు. నాను రాను.

ముసలిది.—రాయే యెల్లి, యీణ్ణి తీసకెల్లి తలుపేశేతాం.

పేరి.—మీయబ్బతోడు మీవల్లగాదు.

అనామలు.—రండ్రా యెల్దాం, గాడిది తంతే పళ్ళాలిపోయినయి.

కోడి.—నాకొక్క పమైస్తే వుదకటం చణం, గుడ్డంతా నూలంతా పీసు పీసై యెగిరిపోవటమే, మరి కంతా నాశాతి నిలకటమే.

నారి.—ఈపాలి నన్నో సైన దోనెరాకాశంటే, ఆ అన్నావోణ్ణి రేవులో కడవలు బాన లన్ని తెచ్చి నెత్తినేసి కొట్టొకంటా.

[అని కోడి. నారి. సుబ్బి. నిష్క్రమించి, నేపథ్యమున కీకర బాకర కీబర బాకర అని జగడమాడుచు మరల ప్రవేశించి తొలఁగుదురు.

ఒకఁడు.—పేరాయయెట్టి కొండాయయెట్టిగానే వుందిరా!

అందఱు.—వవ్వా! కొండాయా!

[అందఱు ప్రక్క ప్రక్కను ఎదురెదురుగాను నిలిచి ఒకరిముఖము ఒకరి ముఖమునకు తగులునట్లుగా చేర్చుచు మహా వికృతహాసములతో, నేత్రవికాసములతో, మహాభినయముతో వికట నృత్యముతో పాడుదురు.

రై రైా ఝూశి మోగించినదు రాసావోరి పదుసు,
ఆ రాసావోరి పదుసు,
ఆ రాసావోరి పదుసు,
ఆ రాసావోరి పదుసు.

కోక్కా ఝూశి మోగించినదు గోసాసింగు పదుసు,
ఆ గోసాసింగు పదుసు,
ఆ గోసాసింగు పదుసు,
ఆ గోసాసింగు పదుసు.

గోడా గోడా దాన్నె గీశి గూశాల్యా ఝూశినదు,
ఆదు కొంగాల్యా ఝూశినదు,
ఆదు కోడ్యాల్యా ఝూశినదు,
ఆదు కోత్యాల్యా ఝూశినదు.

కూ డొ గ్గేశి నీ లా గ్గేశి కొండాదు యెల్లినదు,
ఆ కొండాదు యేగినదు,
ఆ కొండాదు సాగినదు,
ఆ కొండాదు సచ్చినదు.

[అని నిష్క్రమించి. నేపథ్యమున దానినే పాడుచు తొలఁగుదురు.

ముసలిది.—కూడు తినవా పేరాయా?

పేరి.—[అందఱు లేచిపోయిన పిమ్మట ఉన్నట్టు భావించి] ఒకపాలి నామీద ఒక బ్యామ్మడు 'సలవమడతల' కయిత్తం శేసినాడు. ఆయనకి అచ్చరకో ట్లిచ్చిదా.

ఎల్లి.—వోరికి మామా శెప్తావు? ఆళ్లెల్లి పోయినారే.

ముసలిది.—వోరికిరా పేరాయా శెప్తావు? ఆళ్లు లేరే.

పేరి.—యెక్కడికి ఎల్లినారే? మీపాకలికళ్ల కవుపడకుంటే నామా

రాజుకళ్ల కవుపడరంటేఁ? యినండ్రా మీరు. ఒక తంజావూరాయన పాటాయన నాగాడిదిలాగే పాడినాడు, ఆయనకి అచ్చరకోట్లు వొరా లిచ్చినా.

ఎల్లి.—ఇదేమి యెజ్జీ మామా?

సేరి.—యినండ్రా మీరు. బోగమోరిపిల్ల ఆడింది. దాన్ని సూశి నా నికిలించటం, నన్ను సూశి అది యికిలించటం. యినండ్రా మీ రినండి.

ఎల్లి.—కూడులేకవా మామా?

సేరి.—యెల్లీ, యీణోయించ గల్తవా?

ఎల్లి.—యీణేంటి యీణ?

సేరి.—[ఆత్మగతము] దీనికి తెల్నీకుండగా సడసమాడతా. [ప్రకాశము] మురికి కుడ్డ లుడికే కంపెల్లివి, యింక నాకు నువ్వు పనికిరావు, నా నెల్లిపోతా; పెత్తాతదురద మగారాజుకేంటి కంపెల్లి పెళ్ల మేంటి? [ఆత్మగతము] యీముసలి దెల్లిపోయినాక సడసమని శెప్పేస్తా.

ఎల్లి.—యెనిమిది నెల్లమట్టీ నీకోసం యేడుస్తావుంటే యేమి మామా యింటి కొచ్చికూడా యీ యెజ్జీ! అయ్యో నారాతా, నీకు దండ మెడతా మామా! [అని పాదములకు మ్రొక్కును.

సేరి.—[కనికరముతో] ఒశే లెగే లెగే. యిన్నాలు, యెన్నాలో నాకు తెల్దు, నీకోసం నా నేడిశిందినీకు తెల్సునా? అంతా మాపటికి శేస్తాలే. ఇయ్యిగో నీశేతి నిండా వొరాలు. [అని తల చొక్కా జేబునుండి వరహాలు తీసి దానిచేతఁ బోసి] ఎల్లీ దూడపేడ, బఱ్ఱిపేడ, కొనుక్కురా. పెత్తాతదురదమగారాజుని, అయి లేకుంటేనాను కూడు తిన్ను. నా నెల్లి యీపాగా తోటి యీకుడతాతోటి వూరంతా సూస్తా. [అని నిష్క్రమించును.

ఎల్లి.—ఆవ్వా యిల్లు కొంచెం సూస్కుంటావా? మామని పిలుసుకొస్తా.

ముసలిది.—నా నెల్లి మళ్లీ వొస్తా; యీళ్లని యీదిలోకి పట్టి యెల్తా.

ఎల్లి.—పట్టు మఱి. [అని ఇరువురును ఒకనిని కాలుసేతులు పట్టి మోచుచు పరిక్ర.

ప్రథ.—ఏమీ తెల్దు శెప్పా శెప్పు.

[మఱియొకనిని అక్లే కొనిపోవుదురు.

ద్వితీయుఁడు.—పెత్తాతరాజంట, అవును రాదేరా.

[వానిని అక్లే కొనిపోదురు.

ముసలిది.—నా సెల్తా. [అని నిష్క్రమించును.

ఎల్లి.—[తలుపు వేయుట నభినయించి పరిక్రమించుచు] శివశివా! ఏమి నారాత! దూడపే డేంటి? బర్రిప్పే డేంటి? నామామో! నామామో! యెర్రైత్తెనా బగవంతుడా! గవరమ్మతల్లి నాను నోసుకొంటే నామామని తెచ్చి యిచ్చినావు గదా, యెర్రికుదిరిస్తివా నాకు పెద్దమంతిరిగారిచ్చిన నగలన్నీ నీకు నిలువుదోపిస్తాను అమ్మతల్లీ, యిదే మొక్కు యిదే ముడుపు. మా మెక్కడికెల్లినాడో తెలదు. [ఆలోచించి] మంతిరిగారితోటే యెల్లీ చెప్పుకొంటా. మారాజా ‘సేమంగా తెప్పించిస్తామని నాకు వొర మిచ్చి యెర్రోణ్ణిచ్చినారు సామీ’ అని మొర్రెట్టుకొంటా, ఆ మారాజు లేమయినా మందూ మంతరం శేయిస్తారు. [అని నిష్క్రమించును.

## దశమాంకము.

స్థలము: ఓరుఁగల్లు, ప్రతాపరుద్రమహారాజు నాస్థానము.

ప్రతాపరుద్రుఁడు, అన్నమ దేవుఁడు, సుత్రాణుఁడు, వజీర్లు, జనార్దన విద్యానాథ సోమయాజులు, నరసింహరాయలు, విశ్వాసరావు, బహిఃపరివారములో ప్రవేశించి యుపవేశింతురు.

వేశ్యలు వీవనలు వీచుచుందురు.

రాజు.—తమ్ముఁడా, కటకముగతి వివరింపుము.

అన్నమ.—

చ. కటకనరేంద్రు బల్లహుని గాలునిచుట్టము గాఁగఁ బుచ్చితిన్,
బటుకృప వానిపుత్రునికి భండికిఁ దండ్రిధరిత్రి నిచ్చితిన్,
కటకము కట్టి కొండగ నగణ్యము రత్నచయంబు దెచ్చితిన్,
నిటలతటిన్ భవచ్చరణనీరరుహంబులఁ జేర్ప వచ్చితిన్. 1

రాజు.—బాహుశాలికి నీ కలవి గాని దేమున్నది? తమ్ముఁడా, నీరాక వలని తనివి మన క్రొత్తమిత్రులు సుల్తానువారు తరలినచింతచే నంతరిత మగుచున్నది.

అన్నమ.—మనయందు సుల్తానువారు మతి కొంచెము మైత్రి యుంప రాదా! మా కైన వారి సాంగత్యము రెండు గడియలే గదా?

రాజు.—నిర్బంధము చేయఁగూడదు. ఏ మది విశ్వాసరావు?

విశ్వా.—మహోత్సవవ్యయముల వివరము.

రాజు.—ఉత్సవముమీఁద ఉత్సవము వచ్చియున్నది; మొత్తములు మాత్రము చదువుము, చూతము.

విశ్వా.—స్వస్తి.

ఉ. కోటిసువర్ణము ల్గుడులకున్, శతకోటి మహీసురాళికిన్,
గోటి గజాశ్వధేనువులకున్, బది కోటులు సైన్యపాళికిన్,

కోటి వృషోష్ట్ర పక్షులకు, గోటి పికోలకు, జాగిలాలకున్,
గోటులునూఱు పేదలకు, గోటులునూఱు నియుక్తకోటికిన్. 2

సు.—మీ ఢౌలత్ కాలీఫ్ హరూనల్ రషీద్ వారికివుండింది తోస్తుంది. [ఆత్మగతము] ఖట్కాం పట్టినారు. ఢిల్లీ మీదికకూడా వస్తారువాలా తోస్తుంది. దక్షిణాఖండం అంతా వీరికీ స్వాధీనంవుంది. మారాజ్యంకంటెవీరిదేయెక్వా. వీరిచేయి యేలాగా తప్పించుకొని పోతాం? [ప్రకాశము] మహారాజ్, మేఘం చాటులో సూర్యుడు వున్నాడు, కింద అంతా ఆయన ప్రకాశంవుంది. ఆయన కంటికి కాన్పడడు. అలాగా వున్నార్ మీ బడామంత్రి యుగంధర్ వారు. వారికి మాకన్నతో చూడవాలా కోర్తాం.

రాజు.—అవశ్యము. మహామంత్రిగారు విజయంచేయు సమయమే. వారు వచ్చువఱకు మాతమ్ములు వచ్చిన యీ మహోత్సవమున సుల్తానుభాయి గారి ప్రయాణ మంగళముగా రవంత మేజువాణి కానిత్తుమా?

సు.—చిత్తం కానియ్యండి.

[అంతట వేశ్యాంగనలు మేళమున తౌర్యత్రికము జరుపుదురు.
"నిన్నుఁగని యెన్నుకొను" (109-వ పుట చూ).

ప్రతీ.—ప్రవేశించి జయము జయము జగదీశ్వరులకు. మహామంత్రి గారు వస్తున్నారు. [అని నిష్క్రమించును.

[నేపథ్యమున దూరముగా]

ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి, ఓంభాయి; పాడు, పాడు, పాడు, పాడు; దీ, దీ, దీ, దీ, తీ పాడు, తీ పాడు. [వాద్యములు మ్రోగును.

రాజు.—[సుల్తానుతో] మామంత్రిగారు వచ్చుచున్నారు. మా వాద్యములు పోయి వారిని తెచ్చినవి.

సు.—మీ మంతిరిగారికి ఎంతా గౌరవం ఐనా సరీ వుంటుంది.

[నేపథ్యమున దగ్గఱగా.]

పాడు పాడు పాడు పాడు, దీ దీ దీ దీ, తీ పాడు తీపాడు.

[వాద్యములు మ్రోగును.

రాజు.—మన మెఱుఁగకపోయి నారిఁ దోడ్కొని రాఁజాలయును.

[అందఱు లేచి ఎదురు నడచుదురు. యుగంధరునితో అందఱు మరలి వత్తురు.

రాజు.—[యుగంధరునితో] స్వాగతము.

[అని అభినయించి ప్రణమిల్లును.

యుగం.—సర్వాభ్యుదయోఽస్తు.

ఉ. శ్రీ యొసఁగ లార పెట్టఁబడిఁ గ్రిక్కిఱిసెంబడి నిల్చి, గద్దియన్
డాయు *కిరీటిసంఘము తడంబడి యొక్కట నీకు మ్రొక్కుచోఁ,
†వారిధివీచికాపటలిఁ ‡దోరపుభోగ మునన్ సరత్నముల్
వేయితలల్ మునుంచుకొని విష్ణుని మ్రొక్కననంతుఁ బోలుదన్. 3

[అన్నమదేవుఁడు యుగంధరునికిఁ బ్రణమిల్లును.

యుగం.—సర్వాభ్యుదయోఽస్తు.

ఆ. నూఱు వత్సరము లనూనభక్తిరసాన
నింద్రు సుఖితు నల యుపేంద్రుపగిది,
నన్నమాంబ నీక, యనపాయ లక్ష్మిక,
కొలువు మన్న నన్న, కోర్కు లలర. 4

[అందఱు కూర్చుందురు.

విశ్వాసరావు, అన్నమదేవమహారాజు వచ్చిన యీమహాశుభమున ఇంకొకవారము కచ్చేరీలకు సెలవులు, మహోత్సవములు, చాటింపించి జరిపింపుము.

విశ్వా.—మహామంత్రిగారి యాజ్ఞ.

రాజు.—తమ దర్శనము కొఱకు కనుపెట్టుకొని యున్నారు సుల్తానుగారు. నిజనగరమునకుఁ బోవ త్వరపడుచున్నారు.

---

* కిరీటము దాల్చినరాజులయొక్క. † కడలియాలలసమూహమందు. ‡ గొప్పదేహము.

సు.—సలాం యుగంధర్ మహామంతిరిగారికి.

యుగం.—సలాం. మాయింట అఋమోసము అయిన నిలువక ఆఋదిన ములకే వినివిరా సుల్తాన్ వారు ?

సు.—తమరు చేసే సత్కారం, గౌరవం, మర్యాదావల్ల యావజ్జీవం మీఘుర్మేవుండడమే మాకీ యిష్టం. అయితే పోవడాన్కి కోరడాన్కి కారణాన్కి మహామంతిరిగారు యెరుగుదురే యెరుగుదురు. దయా వుంచి సెలవు దయచెయ్యవాలా కోర్తాము.

యుగం.—ఇఁక వారిని నిలిపిన, వారికి వారికై యువ్విళ్లూరుచుండు వారికిం గూడ సాపరాధుల మగుదుము. వారెచటనున్నారో నిజనగరమునఁ దెలియదు. కావున వారిని పంపుట యుచితము.

[కంచుకి బాలుని తెచ్చి రాజుచెంత నిలిపి పోవును, బాలుఁడు ప్రతాపరుద్రునికి అన్నమదేవునికి యుగంధరునకు ప్రణమిల్లును. అందఱు 'వత్స, చిరంజీవ' అని ఆశీర్వదింతురు.

సు.—వీరు చిన్న ప్రతాపరుద్రమహారాజావారా ?

అన్నమ.—అవును.

సు.—సలాం చిన్న ప్రతాపరుద్ర మహారాజావారికి.

బాలుఁడు.—సలాం ఢిల్లీసుల్తాన్ వారికి.

రాజు.—నాయనా, యిప్పు డిక్కడికి నీవు వచ్చినపనియేమి? పిలిపింపకయే వచ్చితివి ?

బాలుఁడు.—చిన్నాయన మహారాజుగారు కటకమునుంచి విజయం చేసినా రని విని వారిని సేవించుకొనడానికిన్ని ...

రాజు.—ఇంక నేమి ?

బాలుఁడు.—ఢిల్లీసుల్తానువారు ప్రయాణమని వారిదర్శనము చెయ్యడానికిన్ని.

అందఱు.—బళి బళి బళి బళి !

సుల్తాన్.—బలే బలాదే! తుపాకీకడుపున పిరంగి! చిన్న మహారాజా వారూ, మీ స్నేహితులు. ...

బాలుఁడు.—'మీ' అంటారేమి? భాష బాగా రాదా?

సభ్యులు.—బళిబళి! అట్లు పుట్టుకలో రావలయుఁగాని తెచ్చుకొన్న వచ్చునా!

సు.—వహావ్వా వహావ్వా! బలే! పొరబాటు; పొరబాటు మన్నించండి. తమ స్నేహితులు ఢిల్లీలో వున్నారు చిన్న సుల్తానువారు.

బాలుఁడు.—చాలా సంతోషం.

కంచుకి.—[ప్రవేశించి వజ్రహార మొకటి రాజుచేత నిడి] జగదీశ్వరా, అమ్మగారు ఈవజ్రహారమును మహామంత్రిగారికి చాకలిని తెచ్చినందులకు, ఢిల్లీ సుల్తానును పట్టి తెచ్చినందులకు, వలీఖాన్ తలను, ఖుస్రూఖాన్ దేహమును, తెచ్చినందులకును, అని బహుమాన సూచక లేశమును పంపినారు.

[సుల్తాన్ తల యూఁచును.

రాజు.—[దానిం గొని పరికించి] అమ్మగారియాజ్ఞ శిరమున నవతంసించితిని! ఆహా వర్ణరూపమున విరచితము! ఏమి పావనవర్ణములు!—

"త్రైలింగరాజ్య సింహాసన సంస్థాపక,
ఢిల్లీసురత్రాణ బందీ గ్రాహక."

[అని చదివి లేచి హారమును యుగంధరుని మెడను వైచును.

సభ్యులు [తురకలుదప్ప]—జయ జయ త్రైలింగరాజ్య సింహాసన సంస్థాపక. ఢిల్లీసురత్రాణ బందీగ్రాహక; మహామంత్రి యుగంధర.

సు.—మహారాజ్, మేము దైవంచేష్టాచేత ఆవాడలో పడ్డాం, మీకి దొరికినాం, ఈయన పట్టినాడు మాకీ? మీరు ఈయనకీ అబ్ధంకీర్తి చేస్తార తోస్తుంది.

చెరు.—"అల్లహా డిల్లహో యిల్లహా డల్లహో
కల్లు లేనికబోది కడ తేర లేదు",

సు.—చిత్తర్గుప్తజోస్యులూ, మేము కబోది చెప్తావా? వుండు వుండు. [స్మరణమభినయించి] జోస్యులూ, మాతో వచ్చినాడు, అదివానా యేమైనాడు? అహాం వాడిక్కూడా సంపీ యేసినారా!

చెకు.—వాఁడే అందఱను చంపివేసినాడు. వాని నెవఁడు చంపఁగలవాఁడు!

సు.—మరి యేమైనాఁడు!

రాజు.—మీయెదుటనే యున్నాఁడు.

సు.—మాకీ అంతా షండేషుం. ఆ దివానా దివానా అర్థం, మీ తంత్రాల్లో మేము దివానా వున్నాం మహారాజ్,

రాజు.—వారే. [అని మోద్పుకేళితో యుగంధరుని చూపును.

[సుల్తాన్, వజీర్లును ముక్కుమీఁద వ్రేలుంచుకొందురు.

సు.—అల్లా! అల్లా! అల్లా అందుకీ మీరు రామేషరంలో మర్గయా పుఖార్ చేసినారు. తమరు యుగంధర్ షహాముంత్రిగారు మాకీ నిజంగా కబోదీ చేసినారు. మీషక్తి మన్సీకీ లేదు! ఆహాహా మీరు ఆరు నెల్లు ఢిల్లీలో దివానా తిరిగినారు, మీచరిత్రం మాకీ హాశ్చర్యం! బోధపడదు. అల్లా! అల్లా! అల్లా! మీరు మాకీ ష్నేహితులె అయితే యొందుకీ పట్టితెచ్చినారు! మాకీ షత్రువులు అయితే బలికి యెందుకి షహాయం చెయ్యలేదు. [ఆత్మగతము] దివానా మన్సీకాదు, సైతాన్, చెప్పినార్ జవాబ్లు!

యుగం.—అంతయు మీ వజీర్లు విశదీకరింతురు.

సు.—[దిగులుతో] మీరుకూడా షరీకువోయి వజీర్లు! అల్లా అల్లా అల్లా! ఇంకా యేమి తల్చినారు మాకీ యుగంధర్ మహారాజ్? [అని వజీర్లకు దూరముగా నిలిచి] యిది మల్లీ వాడారాత్రి అవుతుందా యుగంధర్ మహారాజ్?

యుగం.—అట్లు కానేరదు. శివునియాజ్ఞ లేక చీమయు కుట్టదు. మీవజీర్లు బుద్ధిమంతులు,ఊహించి చెప్పుదు రని మామాట. క్రమక్రముముగా

మీ రెఱింగిననే స్వారస్యము; మావలన విననలదు. మీకు యావజ్జీవము బుద్ధికి ఇది యొక వినోదవ్యాపారమగుఁగాక.

సు.—హాబ్బ! మీ మాటచేత గాభరా తీరింది మహారాజ్, అమహా రాజా అన్నిమాట్లు పట్టిన అపాదాల్కి మేము షఖ్మాటు పట్టుతాం. [అని కటాలున యుగంధరుని పాదములు సోఁక సలాముచేసి] మీరు యొవరో హావతారం. మాకీ వరమియ్యండి స్వామీ. మీదర్శణం యట్వంటి పాపాత్ముడికీ మేలు చేస్తుంది.

యుగం.—[సుల్తానుచేయి ప్రతాపరుద్రునిచేయికలిపి] మీ కిరువురకు సఖ్యము చేయుచున్నాను.

క. మయశంబరులకుబలె *న
న్వయపారంపరిగ సఖ్య మమరుత మీకుఁ,
నయముగ నొండొరులకు † రిపు
భయదాహవములను దోడుపడుదురు గాతఁ. 5

సు.—ప్రతా, వజీర్లు, చెకుముకి ప్రభృతులు.—కోరిక గాదు, వరము వరము వరము.

సు.—మాజ్ఞాపకం తమకాడ వుండవాలా.

[అని యుగంధరునికి తనకత్తి ఇచ్చి, తన పగిడీ ఇడి, తాను పాగాధరించును.

రాజా.—మాగుర్తు తమయొద్ద నుండవలయును.

[అని సుసుల్తానుకు పగిడీ, కత్తి, ఇచ్చును.

సు.—[గ్రహించి, ధరించి] ఓట్కి ఖకీద్ వుంది, ష్నేహాన్కి ఖరీద్ లేదు, మహారాజా భాయి. [యుగంధరునితో] మాకీ ఢిల్లీకి తల్చుకొంటే హాడల్వుంది. అక్డయొక్వా తక్వా తప్పదు. తమకీ తెల్పుకొంటాం. తమరు స్వయం వచ్చి, మాకీ మల్లీ తఖ్తుమే నిల్పవాలా, అదీ మేమూ వరం అడ్గుతాం.

---

*అన్వ...=వంశపరంపరగా. † శత్రువులకు భయంకరములయిన యుద్ధములందు.

యుగం.—మంచిది.

చెకు.—[రాజ జనార్దనాదులతో, జనాంతికము] ఆపాటిస్థితిలో నీకె నూతేండ్లబలుకు ఉండినవి?

సు.—ఇక మాకి తెల్వ్యా.

రాజు.—మా సేనాపతి శేతాళరావుగారిని రానిండు, తమకు పరివారము నేర్పరించుచున్నాఁడు.

సు.—ఉత్తము.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి. పెద్ద సెట్టిగారు వచ్చివున్నారు.

రాజు.—రమ్మను.

అంతట పెద్దసెట్టి ప్రభృతులు ప్రవేశింతురు.

వర్త.—జయము జయముజగదీశ్వరులవారికి, జయము జయము మహామంత్రి యుగంధరులవారికి. ఓహో! సలాము సలాము సుల్తానువారికి, సలాము సలాము వజీర్సాయివారికి.

సు.—వజీర్లు—సలాం సలాం.

సు.—[ఆత్మగతము]వీళ్లకి కొట్టి రాజాసర్దార్లు మాకీ పట్టి తెచ్చినారు. వీళ్లు హుంగ్లీకి పోయినారు. వీళ్లు గోవావర్తకులు, రాజా మర్గయా మంత్రి మర్గయా, చెప్పినారు. ఇక్డ యిప్డు అంతా స్నేహితులు.అరే! హాల్లా! హాల్లా! మోసంమీదా మోసం! అహో! యిక్డనుంచి ప్రాణంతోటి పోతామా? [జనాంతికము] ఏమి వజీర్ సాహెబ్లు, మీకి యేమైనా యీతెలంగీ తంత్రం తూర్పు పడ్మర తెలుస్తుందా?

వజీర్లు.—[జనాంతికము] ఇది తెలుస్తుంది.ఇక్డనుంచి యెంత త్వరగా వెళ్తే అంత హాద్రుష్టం మనది.

ప్రతీ.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి. ఒక వైదికబ్రాహ్మణుఁడు వచ్చి వున్నాడు. చాకలి యెల్లిట వచ్చివుంది.

యుగం.—యెల్లిని రమ్మను. పహారాలో నున్న యా చాకలిని తెప్పింపుము.

ప్రతీ.—జగదీశ్వరుల యాజ్ఞ. [అని నిష్క్రమించును.

అంతట ఎల్లి ప్రవేశించును. పేరిగానిని జవానులు తెత్తురు.

యుగం.—[రాజుతో] ఇది చాకలియెల్లి. దీనిభర్త యీపేరిగాఁడు. వీనినే కల్ఖాన్ ఖయిదుగొనిపోవుట. వీనికిని దీనికిని ఏమో రగడయైనది. ప్రభువే స్వయముగా విచారింపవలయును.

సు.—[జనాంతికము, వజీర్లతో] అల్లా! యిది అన్నిటిక్కీ మీద వుంది. యీ గాడ్దాకోపం మాకీ పట్టి తెచ్చినార్. ఈడో బీబీకి హమేం తాజీం యిచ్చినాం. మళ్లీ వీడ్కి చూడటం హవ్వాకం యేలాగా తింటాం?

రాజు.—పాపము! వీని నావలె కొనిపోయినాఁడు? తమ నీతిప్రభావమువలన వీఁడు మరల వచ్చినందున దీనికంత తీటేనది గదా, రగడ యేల?

యుగం.—విచారించినఁగదా తెలియును?

సు.—[జనాంతికము వజీరుతో] వీడు మాదగ్ర యెన్నాక్కీ నిగిడి మహారాజా కూర్చున్నాడు: యిప్డు వీపురోతి వంగ్తాడు. హల్లా! హల్లా! మాకీ చౌరీ, వీడ్కి చౌరీ! మాకీ నాచీ, వీడ్కి నాచీ? హా! యీధండాలీ తెలంగీ తంత్రం! మాబుర్రాకీ అడ్డంసిల్వ కత్తిరించేఁదివాలా వుంది! యేమి చేస్తాం! యెప్డూపోతాం!

బేతాళరావు.—[ప్రవేశించి] జయము జయము జగదీశ్వరులవారికి.

రాజు.—బేతాళరావు, ఏమి చేసితివి?

బేతా.—తమ సెలవుప్రకారము, తురక ఖయిదీలను పదివేలమందిని విడుదలచేసి ఢిల్లీవఱకు బత్తెము లిచ్చి సుల్తానువారికి పరివారముగా ఏర్పరించితిని.

రాజు.—తమ్ములును నీవును నరసింహరాయలును సుల్తానువారిని మన నగరముదాఁట సాగనంపి రండు.

అన్నమ.—నాకీ వచ్చియు రాకముందే అన్నగారు మిక్కిలి ప్రియమైనపని పెట్టినారు, మహాప్రసాదము.

బేతా, నరసిం.—ఏలినవారి చిత్తము. [అందఱు లేచి పరిక్రమింతురు.

సు.—[రాజుతో] తమరు నిజ్యాండి. సలాం మహారాజాభాయి. సలాం జగద్గాథరామమహామంత్రియుగంధర్దేవ మహారాజ్. సలాంచిత్తగుప్తజోష్యులు.

[వీరందఱు వెంటవెంటనే సలాము చెప్పుదురు.

వజీర్లు అందఱకు సలాములు చేసి పొందుదురు.

సు.—[బాలునిచేయి ముద్దుకొని] తమవద్ద సెలవు చిన్నమహారాజావారు.

బాలుఁడు.—చిత్తం. మాసలాం మా స్నేహితులు చిన్న సుల్తాను వారికి చెప్పవలెనని కోర్తాము.

సు.—అచ్ఛా! అచ్ఛా!

[సుల్తాన్, వజీర్లు, అన్నమాదులును నిష్క్రమి.

ఇతరులు వచ్చి కూర్చుందురు.

యుగం.—ఎల్లీ, చెప్పుకోవే.

ఎల్లి.—[వడవడ వణఁకుచు చేతులు మోడ్చుకొని] నానోట మాట రావటం లేదు మారాజా. నాపిరాదు యిని ఆయన్నైనా శిచ్చ శేస్తారేమో మారాజా? పిరాదు శేసుకోను సామీ.

యుగం.—వానిని శిక్షింపము, చెప్పుకో.

ఎల్లి.—మరుండి, సామీ, [ఆత్మగతము] ఏమి చెప్పుకొందును? [ప్రకాశము] మరుండి, యీాయన పెత్తాతదురద మగారాజంటుండి.

యుగం.—[రాజుం గని. చిఱునగవుతో] విశద మగుచున్నదా?

[అందఱు నవ్వుదురు.

ఎల్లి.—నా కేమి తెల్దుండి, ఆయ నన్నామాట నాను శెప్పినాను మారాజా.

యుగం.—చెప్పు చెప్పు.

ఎల్లి.— [వణఁకుచు] ఏఁవండి, ఆనాఁడు తమరితో శెప్పకొన్నా మాశేనుండి.

యుగం.— ఆడే, భయపడకు. శేరిగాని నేమియూ చేయములే.

ఎల్లి.— [తల వాంచి ఓడియముతో] నన్నొల్లడంట, నాను కంపెల్లినంట, యీ ణోయించ శేనంట, పేడ శేకుండా కూడు తినడంట.

రాజా.— చీ! చీ! చీ!

ఎల్లి.— [వణఁకుచు] ఆయన శెప్పినమాశేనుండి.

యుగం.— ఏం పేఁడ?

ఎల్లి.— దూడపేడ, బర్రిపేడ. అయి ఆయనకి మదనమంట, యింకా యేంటేంటో శెప్పినాడు సామీ.

యుగం.— ఏమేమో చెప్పు. భయపడకు.

ఎల్లి.— యేనిగల నెక్కినాడంట, యెల్లినకాడంతా యీతనికి లచ్చల్లచ్చలు దండు దండా లెట్టోరంట. యీలాగంతా శెప్తాడు మారాజా. యెర్రోడో, ఒల్లడో, తెలదు మారాజా. కూడు తినక యింటికిరాక ఒగ్గేళ యెల్లిపోయినాడు మారాజా.

రాజా.— ఎందుచేత నీవు పనికిరావన్నాఁడు?

ఎల్లి.— తను రాజంట, సదువుకొన్నోడంట.

విశ్వా.— [లేచి] మహాప్రభూ, నేను ఎల్లికి వకీలను.

రాజా.— ఏమి నీవాదము.

విశ్వా.— వీఁడు చదువుకొన్నందున, చాకళ్లలో చెడిపోయినాఁడు. కావున వీఁడే యెల్లికి పనికిరాఁడు.

ఎల్లి.— [సభావ్యముగా] నారాయణమూర్తి! పనికొస్తాడుసామీ, పనికొస్తాడు!

విశ్వా.— ఉండవే, నీకు తెలియదు.

ఎల్లి.— [దీనముగా] తెలుసును సామీ, పనికొస్తాడు.

రాజు.—ఏమిరా నీవాదము?

పేరి.—[వడవడ వణఁకుచు చేతులు మోడ్చి] నేరనోణ్ణుండి, కాయాల దేవాదిదేవా. [అని సాగిలఁబడును.

చెకు.—నేను పేరిగాని వకీలను.

రాజు.—మీవాద మేమి?

చెకు.—చదువుకొన్నను గూను పోలేదు గనుక వీఁడు చాకళ్లలో చెడలేదు. కావున ఎల్లికి పనికిరాఁడని మానవష్టిచేయుట తప్పు.

ఎల్లి.—దండం సామీ దండం. ఎర్రిదాన్ని రచ్చించండి మారాజా.

చెకు, జనా. పెద్దసెట్టి.—నీవంటివెఱ్ఱి కులస్త్రీల కండఱకు ఉన్న తరించిపోదురు.

రాజు.—మంచిది, తీర్పు.—పేరిగానివకీలు చేసినవాదము సరి. గూను తీరినఁ గాని చదువుకొన్నవాఁడు గాఁడు, చాకలివాఁడే. ఎల్లికి పనికివచ్చును. మఱి వీనికి మహామంత్రిగారు మాదర్శన మనుగ్రహించినారు గావున ఇనామియ్యక మేము పంపఁగూడదు. [చింతించి] ఇదే యినాము. మీ రిఁక చాకిపని మానవచ్చును. చాకళ్లకు వీఁడు కులముపెద్ద చాకలిదొర. చాకళ్లందఱు వీనికి పన్ను చెల్లింపవలసినది. వీనికి పరివారము, ధనము, సకల సౌభాగ్యము, మహాల్, దూడపేఁడ, బఱ్ఱెపేఁడ, యిచ్చినారము. మంత్రులిప్పుడే యేర్పాట్లు చేయుదురు. [ఒకనొకరు వైపుచూచి] ఓరి, వీరిఁగొనిపోయి దీనిని అప్సరస వలెను దీనిని అమరేశ్వరునివలెను కట్టించి తొడిగించి తెండి.

[ఎల్లి సాగిలఁబడి లేచును. పేరి. ఏమియు తోఁపక నిలుచును.

ఎల్లి.—[చేయిపట్టి లాగుచు] రా మామా.

[అందఱు నవ్వుదురు. ఆశబ్దమునకు పేరి. తెలివి వచ్చి యెల్లితో నిష్క్రమి.

యుగం.—[ఒకనొకరుతో] అబ్రాహ్మణుని తోడ్కొనిరా.

[వాఁడు నిష్క్రమించును.

అంతట అన్నమరాజు, వేంకటాద్రినాయుడు, నరసింహరాయుడును ప్రవేశింతురు.

అన్నమ.—సుల్తాను వేగిరించి నడచినాఁడు, మమ్ము బతిమాలి బతిమాలి వెనుకకు మరల్చినాఁడు. జనాంతిక భాషితముల వలన తమరాజ్యము చక్రాతిపై నెత్తి వేసికొండ యన్యోన్యానివి యయ్యు, తాము కేళాంతరమున పకీరులుగా బ్రతుకుట శ్రేయమనియు పలికినాఁడు. నేను యుగంధరమహారాజు సాహాయ్యమున్నది, వెఱవకుఁడని హెచ్చరింపఁగా, వెఱఁగుపడి మువ్వురు నంగీకరించిరి. ఈదుస్స్వప్నము సుల్తానునకు ఈజన్మములో తీఱుట దుస్తరము.

అంతట అగ్రహారస్థుఁడు ప్రవేశించును.

యుగం.—ఏమయ్యా, మీరు వచ్చినపని?

బ్రాహ్మ.—*నవలక్ష ధనుర్ధరాధినాథే
పృథివీం శాసతి వీరరుద్రదేవే,
అభవ త్పర మగ్రహారపీడా

[అని యర్థోక్తమున.

రాజు.—శివశివా! నా యేలుబడిలో అగ్రహారములకు పీడ కలిగినదా?

విద్యా.—[తటాలున లేచి]

† కుచకుమ్భేషు కురఙ్గలోచనానామ్.

జనా. చెకు.—బళిబళీ! మహాకవీ, స్త్రీల పాలిండ్లయందు హారముల యిఱుకటము మిక్కుటముగా కలిగినదఁట.

---

*తొమ్మిదిలక్షల విలుకాండ్రకు దొర యగు ప్రతాపరుద్రమహారాజు భూమిని యేలుచుండఁగా అగ్రహారములకు మిక్కిలి బాధ కలిగినది.

†లేడికన్నులవంటి కన్నులుగల స్త్రీలయొక్క చనుఁగుండలయందు అని యర్థము. దీనిచేర్పఁగా తృతీయపాదముయొక్క యర్థము, జనా. చెకు. చెప్పినవిధమున మాఱినది.

రాజు.—శ్రీహరీ విద్యానాథులవారా! [దేవి పాదములకు మ్రొక్కి మరలఁ గూర్చుండి] అనవాలు పట్టనందులకు మన్నింపవలయును.

యుగం.—అయ్యా, మీ యగ్రహారమునకు క్షేమము చేసెదము, రేపు మాకచ్చేరికి రండి. కూర్చుండుఁడు. [బ్రాహ్మణుఁడు కూర్చుండును.

రాజు.—మహానుభావా, తమకొమారితకు వివాహ మైనదా?

విద్యా.—[ఆత్మగతము] కృతికన్యం గూర్చి పలికెదఁగాక. [ప్రకాశము] మహారాజా, అల్లుఁడు కాశిలో నుండఁగా వివాహ మెట్లగును?

రాజు.—[ఆత్మగతము] కృతింగూర్చి పలుకుచున్నాఁడు మహాకవి. [ప్రకాశము] వచ్చెనుగదా కాసీరాదా?

విద్యా.—ఇదిగో 'కానిచ్చెద. తదేవలగ్నం సుదినం తదేవ విద్యాబలం బుద్ధిబలం తదేవ...'

[అని ప్రతాపరుద్రీయగ్రంథమును విప్పి ఒకటిరెండుశ్లోకములం జదువును. (55,56వ పు. జూ.) చెరుముకి అర్థము చెప్పును. విద్యానాథుఁడు గ్రంథమును రాజునకిచ్చును. రాజు లేచి సనమస్కారముగా గ్రహించికూర్చుండును.

విద్యా.—ఇట్టివరులు హరణము కోరరు గాని హరణహీనముగా కన్య నిచ్చుట కన్యాజనకులకు పరువు తక్కువ, కావున, ఈయలంకారమును గ్రహింపవలయును.

[అని రాజువ్రేల ముద్దుటుంగరమును తొడుగును.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు].

రాజు.—[నమస్కరించి, మోడ్పుఁగేలితో] అంతటను వానినే తగులవేసితి నంటివి గదా.

విద్యా.—ప్రతిశ్లోకమునను పేరు తగిలియున్నదో లేదో చూచికొనుఁడు.

[నేపథ్యమున దుందుభులు పుష్పవృష్టియు].

[యుగంధరుఁడు రాజుచేతికి కొన్ని శాసనము లిచ్చును.

రాజు.—[చూచి ఆనందించి] విశ్వాసరావు, వీనిని అందింపుము.

[అని ఒకటొకటిగా తీసి యిచ్చును. విశ్వాసరావు వరుసగా
విద్యా. చెరు. జేతా. వరసెం. పెద్దపె.—కిచ్చి ఇచ్చును.

యోగం.—ఏలినవారు మిమ్ము నందఱను దేశాధీశ్వరులను చేసినారు, మిత్రగోష్ఠిగా మర్యాద నిబంధించినారు.

[నేపథ్యమున దుందుభులు ప్రవృత్తి.]

నారదుడు.—మేము ఏలినవారి సన్నిధానమునందే యుండెదము, మాకు రాజ్యము లేల? అయినను సమ్మానమును గ్రహింపవలసినది. [అని గ్రహింతురు.

విశ్వా.—[ఒక శాసనము చేత నుండ] ఇది మడివేలు దొరవారిది.

[పేరిగాఁడును ఎల్లియు ముస్తాబుతో ప్రవేశింతురు.

సభ్యులు.—బళి బళి బళి బళి!

[చాకళ్లు సాగిలఁబడి లేతురు. విశ్వాసరావు పేరిగానికి శాసన మిచ్చును.

పేరి.—[వణఁకుచు అందుకొని] యిదేంటి మారాజా?

విశ్వా.—కన్నుల నద్దుకో, దీనిని దాఁచుకో, దీనివలన నీవు చాకలి దొరవు, ఇది పోయిన చాకలివి.

[పేరిగాఁడు తా నద్దుకొని ఎల్లి కిచ్చును, ఎల్లియు కన్నుల నద్దుకొ..ను. పేరిగాఁడు ఏమో చెప్పఁబోయి తడఁబడుచు నత్తివానివలెనై యూరకుండును.

రాజు.—ఏమిరా నీవు ఇంక చెప్పఁబోనునది? చాలదా?

పేరి.—నన్ను దొరని శేశినారు, ఎల్లిని—

[అని యర్థోక్తములో నూరకుండును. అందఱు నవ్వుదురు.

రాజు.—మంచిది, మంచి యనుకూలనాయకుఁడవు నీవు, స్వాధీనపతిక అది. మంచిది, ఎల్లిని దొరసానిని చేసినాము.

పేరి.—దండం మారాజా దండం. మరి నాకీదొర మిచ్చిన బెమ్మదేము డొపడితే, ఆయనపాదాల్లో పడతా.

[అని సభలో కలయ వెదకును. చెరుకుకి విద్యానాథునికి చాటు తొలఁగును.

పేరి.—[విద్యానాథునిం గని] బెమ్మదేముఁడా నీదొర మిది.

[అని సాగిలఁ బడును. ఎల్లియు పడును.

పద్మా[illegible]ండి. ఇంతకన్నను క్షేమపడెదవు లెండి.

[ఇరువురు లేతురు.

యుగం.—[రాజునుగూర్చి] వత్సా, నీ కింక నేదేని మనోరథం బున్న వచింపుము.

రాజు.—మహానుభావా,

శా. ఢిల్లీనాథుని మిత్త్రుఁ జేసితివి, * ధాటీధుర్య బాహ్యాత్ముఁ డా
వల్లీఖానుశిరంబుఁ దెచ్చితి, † ద్విషద్బందీకృతుల్ సత్ప్రిజల్
ఇల్లాండించితి చాకిసేని, ‡ గజరా జేఁగెన్ యము స్థానఁగా,
సల్లాపింపుము యింకనుం గలుగునే, సర్వజ్ఞ, § యాశాస్యముల్! 6

అయిన నిది యగుఁగాక.

[భరతవాక్యము]

(మానిని)

వానలు లోకశివం బకృశంబుగ వాసవుఁ డిచ్చుతఁ గాలమునన్,
దేనియ జాల్కొన దేశము పండుత దివ్యుల దన్పుత యాగకరుల్,
మానిత మా[illegible]మార్గముఁ దప్పక మంతురుగాక నృపుల్జగతిన్
[illegible]లా కవిపుంగవులం బొరపొచ్చెము సేయరు గాక బుధుల్.

సమాప్తము.

* దాడియొక్క న్యాయమునకు వెలియయిన హృదయముగలవాఁడు. † శత్రువులచేత చెఱఁబెట్టఁబడినవానిని. ‡ కటకజల్లహుఁడు. § కోరఁదగినవి.

చంద్రికాప్రెస్, చాకలపేట, చెన్నపురి.—15-3-54.